

## పరిచయం

| | |
|---|---|
| పేరు | : సాగి కమలాకర శర్మ |
| విద్యార్హతలు | : ఎం.ఏ.(తెలుగు), ఎం.ఏ. (సంస్కృతం), ఎం.ఏ. (జ్యోతిషం), |
| | పిహెచ్.డి ( ప్రాచీనాంధ్ర సాహిత్యంలో జ్యోతిష విజ్ఞానం ) |
| | ప్రాకృతం పి.జి. డిప్లొమా, జర్నలిజం పి.జి. డిప్లొమా |
| బిరుదులు | : జ్యోతిష ప్రవీణ, జ్యోతిష విశారద, జ్యోతిష మనీషి, |
| | దైవజ్ఞరత్న, ఆంధ్ర భాషా భూషణ |
| ముద్రిత రచనలు | : జానపదుల జ్యోతిర్విజ్ఞానం, జ్యోతిష కమలాకరం |
| వృత్తి | : జ్యోతిషోపన్యాసకుడు, మూసీ మాస పత్రిక సంపాదకుడు |
| ప్రవృత్తి | : ధార్మిక, సాహిత్య, జ్యోతిషోపన్యాసాలు, పత్రికా రచన |

జానపదుల జ్యోతిర్విజ్ఞానం

సాగి కమలాకర శర్మ

# జానపదుల జ్యోతిర్విజ్ఞానం



సాగి కమలాకర శర్మ

# జానపదుల జ్యోతిర్విజ్ఞానం

సాగి కమలాకర శర్మ

తేజశ్రీ ప్రచురణలు

భాగ్యనగరం, 2003

జానపదుల జ్యోతిర్విజ్ఞానం



ప్రతులు : 500

వెల : 80 రూపాయలు

ప్రచురణ : **తేజశ్రీ ప్రచురణలు**

భాగ్యనగరం.

ప్రతులకు : **మనోహరి,** 3-4-245/1,

లింగంపల్లి, కాచిగూడ, హైదరాబాద్ - 500 027.

ఫోన్ : 27560616, 27550530.

ముఖపత్రాలంకరణ : శ్రీధర్.

డి.టి. పి.: **కావ్యశ్రీ గ్రాఫిక్స్**

2-2-1136/7/1-సి,

న్యూనల్లకుంట, హైదరాబాద్ - 500 044.

ఫోన్ : 27550530.

ముద్రణ : శ్రీ సాయి ప్రాసెస్

నారాయణగూడ, హైదరాబాద్ - 500 029.

ఫోన్ : 27563075

# అంకితం



చేయూతనందించి చేరదీసి అనునిత్యం

ఆదర్శ బోధనలతో మార్గాన్ని నిర్దేశిస్తూ

నా జీవనపథానికి మూలకారణమై నాకే కాక

నాలాంటి ఎందరినో నిత్యమూ

ప్రభావితం చేస్తున్న ఆత్మీయ గురువర్యులు,

జాతీయసాహిత్యోద్యమరథసారథులు,

ఆదర్శ స్వరూపులు, సమాజ సేవాతత్పరులు,

ఉత్తమ అధ్యాపకులు

**ఆచార్య కసిరెడ్డి వెంకటరెడ్డి గారికి**

హృదయపూర్వక నమస్కృతులతో .....



# కృతజ్ఞతలు

నేను మొదట్లో వ్యాసాలు వ్రాయడం మొదలు పెడుతున్న రోజులు. ఆ రోజుల్లో జ్యోతిషం, సాహిత్యం రెండు అంశాలలోనూ కృషి చేయాలనే సంకల్పంతో మార్గాలు వెతుకుతున్నప్పుడు వేరు వేరు సామెతల్లో జ్యోతిష విశేషాలు కనిపించాయి. వాటిని గూర్చి చిన్న వ్యాసం వ్రాద్దామని సేకరించడం మొదలు పెట్టే సరికి దాదాపు 300 పై చిలుకు జ్యోతిష సంబంధ విశేషాలతో కూడుకున్న సామెతలు, ఇంకా పొడుపు కథలు లభించాయి. ఇక నమ్మకాలు అనేకం. అయితే వాటినన్నింటిని ఒక క్రమంలో వ్రాసుకొని వ్యాసం ప్రచురించాలనుకుంటున్న సమయంలో **ఆంధ్రప్రదేశ్ జానపద విజ్ఞాన పరిషత్** వారు ప్రతి యేటా ప్రకటించినట్లే **ఆచార్య బిరుదురాజు రామరాజు జానపద విజ్ఞాన బహుమతి**కి పోటీ విశేషాలను ప్రకటించినారు. ఆ ప్రకటనను ఆధారం చేసుకుని ఆచార్య కసిరెడ్డి వెంకటరెడ్డిగారిని జానపద విశేషాలలోనూ, డా॥ సి.వి.బి.సుబ్రహ్మణ్యంగారిని జ్యోతిషం విషయాలలోనూ సలహాలు తీసుకొని పరిశోధనా వ్యాసాన్ని దాదాపు 200 పేజీల వ్రాతప్రతిలో పరిషత్తు వారికి సమర్పించినాను. దానికి 1996వ సంవత్సరం రామరాజు జానపదవిజ్ఞాన పరిషత్తు బహుమతి లభించింది. ఆ బహుమతి ప్రదాన ఉత్సవం కూడా తెలుగు విశ్వవిద్యాలయ ఆడిటోరియంలో 1997 సెప్టెంబర్‌మాసంలో జరిగింది. ఆచార్య సి.నారాయణ రెడ్డి గారు, అప్పటి విద్యాశాఖమంత్రివర్యులు శ్రీ జి.ఎం.సి.బాలయోగిగారు, విశ్వ విద్యాలయ ఉపాధ్యక్షులు, ఆంధ్రప్రదేశ్ జానపద విజ్ఞాన పరిషత్తుకు అధ్యక్షులు ఆచార్య నాయని కృష్ణకుమారి గారు తదితరులు ఆ వేదికపై బహుమతి ప్రదానం చేసినారు.

ఈ పుస్తకం ముద్రణలోకి రావాలని అనుకుంటూ కాలయాపన చేస్తూనే ఉన్నాను. ఇటీవల తెలుగులో ఎన్నో పుస్తకాలను ముద్రిస్తూ, మూసీ లాంటి పత్రికలను వెలికి తీస్తున్న **కావ్యశ్రీ గ్రాఫిక్స్** ఇంట్లో ఉండి కూడా స్వంత పుస్తకం మాత్రం బైటికి రాలేదు. అవును. దేనికైనా సమయానుకూలం కావాలనే కదా జ్యోతిషం నిర్దేశించేది. ఆ శ్రమ ఇప్పటికి పుస్తకరూపంలో వెలువడింది.

జానపదులు శిష్టులకన్నా ఎంతో ఎక్కువ ప్రాకృతిక జీవనం కల్గినవారు. వారికున్న జ్యోతిష జ్ఞానం అపారం. వారికేమీ తెలియదని కొట్టిపారేయడం ఏమీ తెలియనివాళ్ళు చేయవలసిన పని. ప్రస్తుత కాలంలో జానపదత్వాన్ని వదులుకోలేక, నాగరీకాన్ని

ఆహ్వానించలేక సతమతమవుతున్న వాళ్ళకు మన వారి విజ్ఞాన సంపద తెలుసుకోవడం అవసరం. అప్పుడే మన హైందవ సమాజం విజ్ఞాన భిత్తికలపై చక్కగా నిలిచే అవకాశం ఉంటుంది. ఈ ఉద్దేశంతో ఈ పుస్తకాన్ని ప్రచురించడం జరిగింది. దోష గుణాలకు లోకమే ప్రమాణం.

మొట్టమొదటిదైన ఈ గ్రంథం వెలువడుతున్న ఈ సందర్భంలో నాకు విద్యాబుద్ధులు నేర్పించి జ్యోతిషం, వైదికం, సాహిత్యం, సంస్కృతాది అంశాల్లో ప్రాథమికస్థాయిని పూర్తి చేయించి, యోగ్యజీవన మార్గాలను నిర్దేశించిన మా అమ్మానాన్నలకు (శ్రీ సాగి జానకిరామశర్మ, శ్రీమతి స్వరాజ్యలక్ష్మి) ముందుగా పాదప్రణామాలు చేస్తున్నాను.

ఈ గ్రంథాన్ని అంకితం తీసుకోవడానికి ఆనందంగా అంగీకరించిన మా గురువర్యులు, మార్గనిర్దేశకులు, నాలో ఉన్న శక్తిని తట్టి లేపడానికి ప్రయత్నించి పుష్పానికి సుగంధాన్ని అలిమి, వారి ఉపన్యాసాలతో, ఆదర్శ జీవనంతో ఎందరికో ఉత్తమ మార్గాన్ని చూపిస్తున్న **ఆచార్య కసిరెడ్డి వెంకటరెడ్డి గారికి** హృదయపూర్వక కృతజ్ఞతలు తెలియజేసుకుంటున్నాను.

ఈ గ్రంథం వెలువడడానికి తోడ్పడిన ఆంధ్రప్రదేశ్ జానపద విజ్ఞాన పరిషత్తు వారికి కృతజ్ఞతలు తెలియజేసుకుంటున్నాను.

నా శ్రమలో భాగం వహిస్తూ అర్ధాంగి శబ్దాన్ని సార్థకం చేస్తున్న మనోహారికి, డి.టి.పి.లో సహకరించిన మా అమ్మాయి ప్రభకు, ఇబ్బంది పెట్టకుండా పనులను పూర్తిచేయనిస్తున్న మా చిరంజీవులు కావ్యశ్రీ, తేజశ్రీలకు శుభాకాంక్షలు.

ముద్రణ విషయంలో ఎప్పటికీ తొందరలే. అయినా సంయమనంతో త్వరగా ముద్రించి ఇచ్చిన శ్రీ సాయి ప్రాసెస్ అధినేత రాజశేఖర్ రెడ్డిగారికీ, సిబ్బందికీ, ముఖపత్ర అలంకరణ చేసి శ్రీధర్‌కూ ....

నాలోని చైతన్యాన్ని మేల్కొల్పుతూ, అలసిపోయినప్పుడల్లా ఆత్మీయతను, అనురాగాన్ని, ఆప్తతను, స్నేహాన్ని అందిస్తూ నాకు ఎప్పటికీ బాసటగా నిలుస్తున్న ఆత్మీయస్నేహ బంధువర్గానికి... అందరికీ ... ప్రత్యేక కృతజ్ఞతలు.

మీ .... సాగి కమలాకర శర్మ

# ఆహ్వానం

తమస్సు నుండి
జ్యోతిస్సులోకి పోదాం
అంటే కాదనేది ఎవరు?
రాననేది ఎవరు?
కమలాకరంలోని కమలాలు
కిరణాల నాహ్వానించడంలోని
అంతరార్థం ఇదే!
అలా వికసించిన కమలం
వెదజల్లే పరిమళ జ్యోతులు
జనపదాల నుండి
ప్రజ్ఞాపథాల మీదుగా
పయనించినై.
ఈ ప్రజ్ఞలో మునిగిపోవాలని ఉంది
పరిపూర్ణత సాధించాకే
తల యెత్తాలని ఉంది
అప్పుడే ఏదైనా స్వీకరించాలని ఉంది.
కాని ఇంకా దారిలోనే ఉన్నా.
గమ్యం బహుదూరం ..
నత్తనడక
అందుకే ఆ పరగమ్యం చేరేవరకు
ఈ అలంకారాలు తప్పవు
ఈ అనుభూతులూ తప్పవు.

భాగ్యనగర్
8.9.2003.

- కసిరెడ్డి

## విషయ సూచిక





# విజ్ఞానం

"విజ్ఞానం బ్రహ్మేతి వ్యజానాత్" అనేది ఉపనిషద్వాక్యం. విశిష్టమైన జ్ఞానమే విజ్ఞానం. లాటిన్ భాషలో సిరే (Seire) అనగా నేర్చుకోవడం ( to learn) లేదా తెలియడం (to Know) అని అర్థం. దీని రూపాంతరమే సైన్స్(Science).

"ఒక ప్రత్యేక పద్ధతిలో నిర్వహింపబడి, పరిశీలింపబడిన విషయాలను క్రోడీకరించి అవి ఏవిధంగా వివరించవచ్చో తెలుపుతూ ముందు ఏమి చేయాలో ఊహించగలిగేలా చేసే దృక్పథాన్ని విజ్ఞానమనవచ్చు" అని విజ్ఞాన దీపిక నిర్వచించింది.

విజ్ఞానశాస్త్రం మానవ పురోభివృద్ధికి అవసరమైన క్రొత్తభావాల్ని, పద్ధతులను స్వీకరించే శక్తి కలిగి ఉంటుంది. మనకు కల్గిన అన్ని సందేహాలకు సమాధానాలు ఇవ్వగలిగే శక్తి ఉందని కాక - సైద్ధాంతికంగాను, ప్రయోగ పూర్వకంగాను, ఎటువంటి నిశిత విమర్శనైనా ఎదుర్కోగల సామర్థ్యం ఉండడం వల్ల విజ్ఞానశాస్త్రం మీద విశ్వాసం బలమవుతుంది. దీనిలో నిశితవిమర్శ ఉంటుంది. ఇది సైద్ధాంతికంగా గాని ప్రయోగ పూర్వకంగా గాని నిరూపించగలిగి ఉండాలి. యోగ్యులైన వారి ఆమోదాన్ని పొంది పునరావృత్త (repeated) పరీక్షలకు నిలబడగల్గి ఉండాలి.

చాలా సంవత్సరాల కృషి ఫలితంగా గాని, మెరుపులా ఎవరి మెదడులోనైనా చొరబడడం వల్లగాని పుట్టిన ఆలోచన, లేదా సిద్ధాంతం పై పరీక్షలకు నిలబడగల్గితే అది విజ్ఞానశాస్త్రపద్ధతి అవుతుంది. దీనిలో ప్రయోగ ఫలితాలనేవి కొన్ని పరికరాల సముదాయాన్ని ఉపయోగించడం వల్ల తెలిసే అంశాలు కావు. ఈ పరికరాలు అనేవి విషయావిష్కార సాధనాలు కావు. అవి మన విమర్శలకు దోహదకారులుగా మాత్రమే ఉపయోగించే సాధనాలు. కాబట్టి అన్ని పరిశీలనలు పరికరాలను ఉపయోగించి ప్రయోగాల ద్వారా జరిగేవి కావు. వీటిలో కొన్ని ప్రత్యేక రీతిలో పరిగణించాల్సినవి ఉంటాయి.

ప్రకృతిలో మనకు గోచరించేవి, గోచరించనివి అయిన విషయాలు, వస్తువులను గూర్చిన యదార్థ వర్ణన విజ్ఞానశాస్త్ర ఆశయాలలో ముఖ్యమైంది. ఈ వర్ణన సంఖ్యాత్మకంగా ఉండి గణిత విశ్లేషణకు లోబడితే దాన్ని నిర్దిష్ట విజ్ఞానం (Exact Science) అంటారు.

విషయాలను కచ్చితంగా ఉదాహరించేటట్లుగా వివరణ పద్ధతులను లేదా విభజనను పెంపొందించడం – వర్ణనాత్మక విజ్ఞానశాస్త్రం (Discriptive Science) బాధ్యత. విజ్ఞానశాస్త్ర లక్షణాలను తెలుసుకునే పరికరాలు కొన్ని ఉన్నాయి. అవి –

1. వైజ్ఞానిక పద్ధతులు (Methods of Science)
2. వర్గీకరణ (Classification)
3. పునశ్చరణ లేదా పునరావృత్తత (Repetition)
4. ఆమోదం (Consensus)
5. ప్రయోగం (Experiment)
6. కార్యకారణ సంబంధం (Cause and effect)
7. కొలత (Measurement)

పై పద్ధతులనుండి జ్యోతిషాది విజ్ఞాన శాస్త్రాలను **'పునశ్చరణ'** ద్వారా పరిశీలిస్తారు.



సూర్యుడు ప్రతిరోజూ తూర్పున ఉదయిస్తాడు. చంద్రుని కళలు ఒక ప్రత్యేక పద్ధతిలో పునరావృత్తమవుతాయి. హెలీ తోకచుక్క 70 సంవత్సరాలకు ఒకసారి కనిపిస్తుంది. ఇటువంటి శాశ్వతమైన వస్తువులు, సన్నివేశాలు పునరావృతం అవడం సంభవమే. ప్రయోగశాలలో కొన్ని పరిస్థితులను తిరిగి కల్పించి పూర్వపు వర్ణన లేదా పరిశీలనం ద్వారా తిరిగి ఆ ఫలితం వస్తుందో లేదో తెలుసుకోవచ్చు. ఈవిధంగా పునశ్చరణ జరపడం వల్ల ఇంతకుముందు జరిగిన తప్పులను తొలగించి యదార్థ విషయాలకు దగ్గరగా వుండే వర్ణనను ఇవ్వవచ్చు. కాని పరిశీలనల, పరిశీలనా పరిస్థితుల వివరణ పరస్పర ఆశ్రయమవడం వల్ల ఇది మానవప్రయత్నంలో తొలగించ రాని లోపంగా మిగిలిపోతుంది.

పునశ్చరణ – సాధ్యత, నియంత్రణ మీద ఆధారపడుతుంది. కొన్నిసార్లు నియంత్రణ అనేది ఒక ఆదర్శ ప్రక్రియా మాత్రంగా వుండి వాస్తవంగా సాధ్యం కాకపోవచ్చు. ఖగోళంలో ఉండే వస్తువులపై మానవుడు ఏవిధమైన నియంత్రణ చేయలేక పోయినప్పటికీ యాంత్రిక, భౌతిక సూత్రాలే ఖగోళశాస్త్రంలో వర్తించడం వల్ల, ప్రకృతే పునశ్చరణ కలుగజేయడం వల్ల ఇది విజ్ఞానశాస్త్రంలో భాగమవుతుంది. మనం పరిశీలించే అన్ని విషయాలపై నియంత్రణ అవసరం లేదు. ఒక్కో శాస్త్రానుకూలంగా ఒక్కో నియంత్రణ ఉంటుంది.

ఇది విజ్ఞానశాస్త్రంగా జ్యోతిషాన్ని పరిశీలించడానికి పూర్వరూపం.

మానవుడు తన పరిసరాలను నిశితంగా పరిశీలించి గ్రహించిన విషయాన్ని క్రమపద్ధతిలో అమర్చి సంతరించుకున్న విజ్ఞానాన్ని – శాస్త్రం అని పిలువవచ్చు. ప్రయోగం, పరిశీలన వీటిని గురించిన హేతుబద్ధమైన ఆలోచన మొదలగునవి విజ్ఞానశాస్త్రాభివృద్ధికి పునాదులు. కేవల విషయవర్ణన, విజ్ఞానాలలోని కొన్ని సామాన్య నియమాలు, సిద్ధాంతాల ద్వారా పరిశీలించిన విషయాన్ని క్రోడీకరించి, సమన్వయ పరచడం విజ్ఞానశాస్త్ర ముఖ్యోద్దేశం.

# జ్యోతిషం

# ప్రాదుర్భావ నేపథ్యం

"శిక్షా వ్యాకరణం ఛందో నిరుక్తం జ్యోతిషం తథా।
కల్పశ్చేతి షడంగాని వేదస్యాహుర్మనీషిణః॥"

వేద పురుషునికి శిక్ష, వ్యాకరణం, ఛందస్సు, నిరుక్తం, జ్యోతిషం, కల్పమనే ఆరు శాస్త్రాలు, ఆరు అంగాలుగా ఆలంకారికంగా చెప్పబడినాయి. ప్రపంచ వాఙ్మయంలో అత్యంత ప్రాచీనవాఙ్మయం వేదాలు. ఇవి అనాదులు, అపౌరుషేయాలుగా భావించ బడుతున్నాయి. వేదార్థాలను విపులంగా తెలియజేయాలంటే కేవలం సంస్కృత శబ్దార్థాలు తెలిస్తే సరిపోదు. ఆవిధంగా చెప్పిన అర్థం కేవలం శబ్దార్థమౌతుంది. పూర్తి వివరణ తెలపడానికి ప్రకృతి, భూ, విశ్వ రహస్యాలను తెలుసుకోవాలి. వేదాంగాలలో శిక్ష, వ్యాకరణం, ఛందస్సు, నిరుక్తాదులు భాషాసంబంధి విశేషాలే. కల్పం యజ్ఞయాగాది క్రతువులను గూర్చి వివరిస్తుంది. ఒక్క జ్యోతిషశాస్త్రం తన పూర్తి ప్రాభవాన్ని చూపిస్తూ మిగిలిన భాషావిషయాలకు, యజ్ఞయాగాదుల నిర్వహణ సమయాలకు తన విశేషమైన వివరణ అందిస్తుంది. సమయాసమయ నిర్దేశం చేస్తుంది.



కాలస్వరూపాన్ని చూపిస్తుంది. వేదాలలోని ఎన్నో విజ్ఞానాత్మక, జిజ్ఞాసాత్మక విషయాలను వివరిస్తూ వేద భావాన్ని తెలుపుతుంది. మార్గదర్శనం చేస్తుంది. అందుకే వేదాన్ని పురుషునిగా భావిస్తూ తెలియజేసిన విధానం ఈ విధంగా ఉంది.

"ఛన్దః పాదౌతు వేదస్య హస్తౌ కల్పోథ పఠ్యతే
జ్యోతిషామయనం చక్షుః నిరుక్తం శ్రోతృముచ్యతే
శిక్షాఘ్రాణస్తు వేదస్య ముఖం వ్యాకరణం స్మృతం
తస్మాత్సాంగ మధీత్యేవ బ్రహ్మలోకే మహీయతే"

జ్యోతిషం వేదమనే పురుషుని నయనభాగాన్ని ఆక్రమించింది. శబ్ద స్పర్శ రూప రస గంధాలలో రూపం కలిగింది అగ్ని. దాన్ని గమనించేది చక్షువు. అందుకే సర్వేంద్రియాణాం నయనం ప్రధానం అని అంటారు.

జ్యోతిస్సులు అనగా కాంతిపదార్థాలు. కాంతితో కూడిన పదార్థాలన్నీ ప్రకాశిస్తూ ఉంటాయి. ప్రకాశవంతమైన కాంతివత్పదార్థాల అధ్యయనమే జ్యోతిషం. ఈ అధ్యయనం రెండువిధాలు. ఒకటి కంటికి కనిపించే జ్యోతుల గూర్చిన అధ్యయనం – సిద్ధాంతభాగం. మరొకటి ఆయా జ్యోతులు వ్యక్తిపై, జీవరాశిపై చూపే ప్రభావం పరిశీలించి అధ్యయనం చేయడం – ఫలితభాగం. ఈ రెండు విధాలుగా జ్యోతిశ్శాస్త్రం అత్యంత ప్రాభవాన్ని కలిగివుంది.

పదార్థ వ్యక్తానికి పూర్వం ఉన్న కారణశక్తి పేరే జ్యోతి. అగ్ని. బ్రహ్మ (బృహత్ ఇతి) అన్ని పదార్థాలకంటే జ్యోతి పెద్దది. అనగా సర్వవ్యాపకగుణం కలిగినది. ఈ సర్వవ్యాపక గుణ తత్త్వానికే 'విష్ణు' వని మరో పరిభాష. ఈ ప్రకాశమనేది సూక్ష్మమైంది. సూక్ష్మమే స్థూలానికంటే బలమైంది. ఆ సూక్ష్మమైనదే మానవుని మనస్సు, బుద్ధి, ఆత్మలలో ప్రవేశిస్తుంది. ఆ ప్రవేశించిన ప్రకాశమే ఆత్మను బుద్ధి చేత, మనస్సు చేత వివేచింపజేస్తుంది. వివేచించిన తత్త్వాన్ని తరువాతిదశలో ముఖంద్వారా వ్యక్తం చేస్తుంది. అదే భాష. అనగా భాషకంటే పూర్వం పదార్థతత్త్వ ప్రకాశమైన జ్యోతిస్సు మూలమైనది, ప్రతిపాదకమైనది, ప్రధానమైనది. అందుకే 'జ్యోతిషాం జ్యోతిరేకం' అని వేదం చెబుతుంది.

వ్యక్తి యొక్క మనస్సు ఈ ప్రకృతి ఒడిలో ప్రతిస్పందించినపుడు తొలుదొల్త స్పందన ప్రకాశమే. ఎందుకంటే సృష్టి ఏర్పడడానికి కారణతత్త్వం ప్రకాశమే. అందువల్ల ప్రకృతి ఒడిలో ప్రతిస్పందించడానికి మూలజ్యోతిషమే దీనిలో సంక్రమిస్తుంది. మూలజ్యోతిషం ఆధారంగా వ్యక్తిని ప్రభావితం చేసే సూర్యోదయ, సూర్యాస్తమయాలు, చంద్రోదయ, చంద్ర వృద్ధిక్షయాదులు, పూర్ణిమనాటి ఆహ్లాదం, అమావాస్యనాటి భయం, నక్షత్రాల ప్రకాశం, ఋతువుల మార్పులలో ఎండ, వాన, చలి వంటి ప్రకృతి మార్పులు, ఇటువంటి అంశాలన్నీ అతని అనుభూతులలో అంతరాలుగా మారాయి.

సూర్యుడు ఉదయించడం, ఆ సమయంలో ప్రకృతిలోని పశు పక్ష్యాదులన్నీ మేల్కొనడం, ఆహార సముపార్జనకై తిరగడం, రాత్రి కాగానే వాటి గూళ్ళకు చేరి నిద్రించడం – ఆదిమమానవుడు తన జీవనసరళిని కూడా అదేవిధంగా ఏర్పాటు చేసుకున్నాడనడానికి నిదర్శనం. సూర్యోదయకాలంలో సృష్టి చైతన్యం, సూర్యాస్తమయ కాలంలో ఏర్పడే బద్ధకం, నిద్రా స్థితి వ్యక్తిని ప్రభావితం చేశాయి. పౌర్ణమినాటి చంద్రుని వెన్నెల ఆహ్లాదాన్ని కలిగించింది. ఒకే క్రమంలో వచ్చే ఋతువులు ఉత్కంఠను కలిగించాయి. మానవుడు స్వభావరీత్యా దేన్ని గూర్చయినా తెలుసుకోవాలనుకుంటే దానిని గూర్చి ఏమిటి? ఎక్కడనుండి? ఎలా? ఏమౌతుంది? ఎందుచేత?అనే జిజ్ఞాసాత్మక రీతిలో పరిశీలన చేస్తుంటాడు. తెలుసుకోదగిన సమాచారం తెలిస్తే అపరిమితానందం పొందుతాడు. ఈ రకమైన జిజ్ఞాసే జ్యోతిశ్శాస్త్రాన్వేషణకు దారి తీసింది.

ఆధునికవైజ్ఞానికశాస్త్రరీత్యా జ్యోతిశ్శాస్త్రంలోని వివిధాంశాలను పూర్తిగా అధ్యయనం చేయవచ్చు. జ్యోతిస్సులనగా కాంతి పదార్థాలు. అత్యధికమైన కాంతిని, ఉష్ణాన్ని మనం సూర్యునినుండి పొందుతున్నాం. సూర్యుని కాంతి ఇతర గ్రహాలపైన, భూమిపైన, భూ ఉపగ్రహమైన చంద్రునిపైన పడుతుంది. ఆవిధంగా అవికూడా ప్రకాశిస్తుంటాయి. ఈ సూర్యకాంతి వ్యక్తిలో చైతన్యం కలిగిస్తుంది. కేవలం వ్యక్తిపైననే కాక సూర్యకాంతి ప్రకృతిలోని సకల జీవరాశిపైన ప్రభావం కలుగజేస్తుంది. దీనిని అర్థం చేసుకోవడానికి ఒక ప్రత్యేకమైన చక్రం వుంది–



సూర్యకాంతి వృక్షాలమీద పడుతుంది. వృక్షాలలోని ఆకులు పత్రహరితం (Chloroplast) కలిగి వుంటాయి. సూర్యకాంతి ఈ పత్రహరితంతో చర్య జరుపుతుంది. ఇదే కిరణజన్య సంయోగ క్రియ(Photosynthesis). ఈ చర్య వల్ల పిండిపదార్థాలు ఏర్పడతాయి. ఈ పిండిపదార్థాలు వృక్ష జీవనానికి ఉపయోగపడతాయి. పూలు, కాయలు, పండ్లు అన్నింటిలోనూ పిండిపదార్థాల మూలస్వరూపం ఉంటుంది. ఇటువంటి పదార్థాలను వృక్షాలనుండి వివిధ జంతువులు, మానవులు స్వీకరిస్తున్నారు. ఈవిధంగా ఆలోచిస్తే సూర్యకాంతి కలిగివున్న పదార్థాలు వ్యక్తికి ఆహారంగా మారుతున్నాయి. వివిధరకాలైన పదార్థాలు వేరువేరు రకాలైన శక్తులను మనిషికి అందిస్తున్నాయి. ఆ శక్తి మనిషియొక్క వివిధ జీవనవ్యాపారాలకు వినియోగించుకోబడుతుంది. ఇదే శక్తి శారీరకమైన ఎదుగుదలకు తోడ్పడుతుంది. శరీరంలో రక్తప్రసరణవంటి పనులను ఈ శక్తి ప్రోత్సహిస్తుంది. శరీరంలోని రక్తప్రసరణ మొదలైన వివిధభాగాల పనితీరు మనసుపై ప్రభావం కలిగిస్తాయి. శక్తివంతమైన శరీరంలో క్రమపద్ధతిలో తీసుకున్న ఆహారంద్వారా ఉత్సాహపూరితమైన, ఉన్నతమైన ఆలోచనలు వస్తాయి. అదేవిధంగా శక్తిహీనమైన శరీరం తనను గూర్చే ఆలోచిస్తూ తన కొరకే పాటుపడుతూ స్వార్థ చింతనకు ప్రాధాన్యమిస్తుంది. ఈ చక్రంలో సూర్యకాంతి – శక్తి – మనసుగా మారుతుంది. సూక్ష్మీకృతకాంతి – మనసుగా మారుతున్నట్లు అర్థమవుతుంది. సూర్యకాంతి వల్ల ఓషధులు, వనస్పతులు, వృక్షాదులెల్ల ప్రథమసృష్టి ప్రక్రియలో రూపొందుతాయి. వీటిని ఆశ్రయించి క్రమంగా క్రిమికీటక, పతంగ, జంతు, మానవసంతతులు వికసిస్తాయి. పై పదార్థాలలోని తత్త్వాలను ఆహారంగా ఇవి స్వీకరిస్తాయి. పత్రహరితాదులే జీవుల్లో రక్తమాంసాదులవుతాయి. వీని పరిణతి జీవులలోని పరివర్తిత ప్రక్రియ. ఈ భావాన్నే భగవద్గీత కూడా ఈ విధంగా సూచించింది.

"అన్నాద్భవంతి భూతాని పర్జన్యాదన్నసంభవః
యజ్ఞాద్భవంతి పర్జన్యో యజ్ఞః కర్మసముద్భవః"

కాంతియొక్క సూక్ష్మరూపమే మనసు. అందుకే మనసుకు ఎన్నో రకాల శక్తులు

ఏర్పడుతున్నాయి. ఎన్నో విషయాలను మనసు ముందుగా గుర్తించగలదు. పరిశీలించ గలదు. పరిశోధించగలదు. ముందు జాగ్రత్తలనివ్వగలదు. సమస్యా పరిష్కారాన్ని సూచింపగలదు. సూర్యకాంతి ప్రత్యక్షంగా ఎన్నో రకాల రోగాలను నేడు నివారిస్తుండగా దాని సూక్ష్మీకృత రూపమైన మనసు ఎన్నో రకాల నూతన ధోరణులతో ముందుకు సాగుతుంటుంది. జీవితానికి వికాసాన్ని, సమాజానికి చైతన్యాన్ని కలిగిస్తుంది. మనసుకున్న ఈ విశిష్ట కాంతి శక్తివల్ల వ్యక్తి ప్రకృతిలోని వివిధాంశాలను ముందు తాను గుర్తించి, మంచిమార్గంవైపు వెళ్తూ, ప్రమాదాలు లేని మార్గాలను ఎంచుకోవడానికి ప్రయత్నం చేస్తుంటాడు. జీవితాన్ని ఆనందమయం చేసుకోవాలనే ఆలోచనలో నిమగ్నుడౌతాడు. తీసుకునే ఆహారం కూడా పరోక్షంగా మనసుగా మారి సాత్త్విక, రాజస, తామస ప్రవృత్తులు ఏర్పడుతున్నాయి. ఇవి మనఃప్రవృత్తులు. అందుకే ఆహారపదార్థాల నియంత్రణ వల్ల మనసులోనూ, అది గుర్తించే వివిధ శక్తుల విషయంలోనూ మార్పు వస్తుందని ఆయుర్వేద వైద్యుల అభిప్రాయం. ఈవిధంగా విభిన్న మనస్తత్వాలు వేరువేరు వ్యక్తుల్లో కనిపించడానికి గల కారణాలను శాస్త్రీయంగా విశ్లేషించవచ్చు.

వేదకాలంనుండి ఈనాటివరకూ మానవజీవనంలోని వివిధ అంశాలపై ప్రత్యక్ష పరోక్ష ప్రభావాలు అధికంగా చూపే జ్యోతిశ్శాస్త్రం నిర్వచనాలు కాలానుగుణంగా వేరు వేరుగా కనిపిస్తున్నాయి. అధ్యయనంలోని వైవిధ్యం, విషయ విస్తృతివల్ల ఇటువంటి నిర్వచనాలు ఏర్పడి ఉండవచ్చు.

"**జ్యోతిషాం సూర్యాదీనాం బోధకం శాస్త్రం**" అనేది శబ్దార్థం. సూర్యాది కాంతివత్పదార్థాలను గూర్చి బోధించే శాస్త్రం ఇది. నక్షత్రాలు, గ్రహాలు, తోకచుక్కలు మొదలైన ఆకాశంలో కనిపించే వివిధ కాంతివత్పదార్థాల గూర్చి తెల్పేది జ్యోతిషమని కొందరి అభిప్రాయం. వీరి దృష్టిలో ఫలితభాగంతో సంబంధంలేని ఖగోళశాస్త్రమే జ్యోతిషం. మరికొందరి అభిప్రాయంలో సిద్ధాంతభాగంతో సంబంధంలేని ఫలిత జ్యోతిషమే జ్యోతిశ్శాస్త్రం. ఈ శాస్త్రంయొక్క నిర్వచనం క్రమంగా వికాసం పొందుతూ వచ్చింది. నది పుట్టినపుడు చిన్న కాలువలాగా ఉండి ప్రవాహశీలగుణంతో వివిధ



పిల్ల కాలువలను కలుపుకుని మహానదియై సాగడం లోకవిదితమే. అదేవిధంగా ప్రాచీనకాలంలో నక్షత్ర తారకల స్వరూప విజ్ఞానమే జ్యోతిశ్శాస్త్రం. దృష్టి, పర్యవేక్షణల ద్వారా నక్షత్రాలను గమనించడం ఆకాలంలో జరిగింది. వేదాలలోని అనేక మంత్రాలలో సూర్యచంద్రాదుల విషయాలు, వివిధ నక్షత్రాలు వాని ప్రతీకలు కనిపిస్తున్నాయి. బ్రాహ్మణాలు, ఆరణ్యకాలు మొదలైన ఆర్ష వాఙ్మయంలో నక్షత్రాల ఆకృతి, గుణాలు వీని ప్రభావం జ్యోతిశ్శాస్త్రంగా భావింపబడింది.

క్రీ.శ. మొదటి ఐదు శతాబ్దాల వరకు నక్షత్రాల శుభాశుభఫలిత విచారణ, ఋతువులు, అయనాలు, దినప్రమాణం, లగ్నం వాని శుభాశుభాలు అందులో చేసే వివిధ కార్యక్రమాలు మొదలైన అంశాలన్నీ జ్యోతిశ్శాస్త్ర సంబంధ నిర్వచనాలైనాయి.

వేదాలలో ఎక్కువగా నక్షత్రాల స్వరూపజ్ఞానం, మాస, అయన ప్రసక్తి తప్ప ఫలిత జ్యోతిషాంశాలు నామమాత్రంగానే వున్నాయి. వేదాంగ జ్యోతిషాదులైన ఋక్, యజుర్, అథర్వణ వేదాంగజ్యోతిష గ్రంథాలు, సూర్యప్రజ్ఞప్తి, చంద్రప్రజ్ఞప్తి, జ్యోతిష్కరండకము మొదలైన గ్రంథాలు వచ్చేవరకు గణిత, ఫలితమనే ప్రత్యేక విభాగాలు కనిపించవు.

మానవుడు తన పరిశీలనలో భాగంగా ఒకానొక నక్షత్రం తూర్పున సూర్యుని కన్నా ముందు ఉదయించినపుడో లేదా సూర్యాస్తమయం కాగానే కనిపించినపుడో గుర్తించాడు. ఆ సందర్భంలో ప్రకృతిలో జరిగిన మంచి - చెడులను అర్థం చేసుకున్నాడు. మళ్ళీ కొంతకాలానికి అదే నక్షత్రం, అదే ప్రాంతంలో కనిపించడం మళ్ళీ ప్రకృతిలో అవేమార్పులు రావడం మొదలైన అంశాలు అతని దృష్టికోణంలోకి పరిశీలనకు వచ్చాయి. ఈవిధమైన ఆవృత్తుల మధ్యకాలం గమనించడం, వాటికి సంబంధించిన లెక్కలు వేయడం గణిత శాస్త్రావిర్భావానికి దారితీసింది. కాలమానానికి సంబంధించిన అన్ని విశేషాల కూలంకష పరిచయానికి జ్యోతిశ్శాస్త్రాన్వేషణే మూలమైంది. ఇటువంటి ఫలితాంశాల సంబంధ వివరణకు వేదంలోని కొన్ని వాక్యాలు ఉదాహరణలుగా మనకు కనిపిస్తున్నాయి. పురుషసూక్తంలోని "చంద్రమా మనసో జాతః, చక్షో స్సూర్యో

అజాయత" అనే మంత్రం ద్వారా చంద్రుడు మనఃకారకుడుగా చెప్పడం జరిగింది. 'సూర్య ఆత్మా జగతస్తస్థుషశ్చ" అనే శ్రుతి వాక్యాల ద్వారా జగతికి సూర్యుడు ఆత్మ అని, అతనివల్లనే ఈ సృష్టిలో చరాచర జీవులు జీవించడానికి ఆధారమని తెలుస్తుంది.

సూర్యుడు ప్రత్యక్షంగా, పరోక్షంగా చైతన్య కారకుడైతే, చంద్రుడుకూడా వ్యక్తిపై, వ్యక్తిమనసుపై ప్రభావం కలుగజేస్తున్నాడు. భూమిపైన మూడువంతులు నీరు, ఒకవంతు భూభాగం ఉంది. చంద్రుడు భూమికి ఉపగ్రహంగా ఉండి వృద్ధిక్షయాదులను పొందుతున్నాడు. ఈ సమయంలో పౌర్ణమినాటి నిండుచంద్రుడు అమావాస్యనాడు కనిపించకుండా పోతున్నాడు. సముద్రాలలో మామూలు రోజుల్లోకన్నా ఈ రెండు రోజుల్లో అధికమైన ఆటుపోటులు వస్తుండడం అందరికీ ప్రత్యక్షమే. దీనికి కారణం సూర్యచంద్రుల ఆకర్షణశక్తి భూమిపైన అధికంగా ఉండడమే. సూర్యుడు, చంద్రుడు పౌర్ణమినాడు $180^0$ దూరంలో భూమికి రెండువైపులా ఉంటారు. రెండువైపులా లాగబడే ఆకర్షణశక్తికి నీరు పరుగులు తీసి ఆటుపోటులుగా కనిపిస్తుంది. అమావాస్యరోజున రవిచంద్రులు భూమికి ఒకేవైపున ఒకే డిగ్రీలో ఉంటారు. దానివల్ల కూడా ఒకవైపు రెండు ఆకర్షణ శక్తులు కలిసి ప్రయోగింపబడడం వల్లకూడా ఆటుపోటులొస్తున్నాయి. ప్రకృతితో పాటు తమశరీరంలో కూడా జరుగుతున్న మార్పులు గమనిస్తే - భూమిమీద ఉన్నట్లుగానే శరీరంలో కూడా మూడువంతుల నీరు వుంటుంది. అమావాస్య, పౌర్ణమి రోజులలో వాటి గమనశీలం పెరుగుతుంది. వాటిద్వారా రక్తప్రసరణ అధికమవుతుంది. అది మనసులోని ఆలోచనల ఉద్విగ్నతను పెంచడం, క్రమపరచడం, తగ్గించడం చేస్తుంది. ఈవిధంగా చంద్ర, సూర్య ఫలితాలు గమనించిన తర్వాత నక్షత్రాలు, రాశులు, గ్రహాలు వివిధ సమయాలలో పుట్టిన వ్యక్తుల స్వరూప స్వభావాలు, వాటిలోని సామ్యం, వైరుధ్యం అన్నింటినీ అర్థం జేసుకుని వాటిని సూత్రీకరించడం జరిగింది. అప్పుడే ఫలితజ్యోతిషం ఆరంభమైంది.

ఆదిమమానవునికి సంబంధించిన అంశాలలో దిగ్దేశకాలాలు ప్రముఖపాత్ర వహించాయి. వీటినే త్రిప్రశ్నాధికారం అని అన్నారు. తమ ప్రాణరక్షణకు ఒక్కోకాలంలో,



ఒక్కోదిక్కు, ఒక్కోప్రదేశం శ్రేయోదాయకమని గుర్తించడం ఈ సమయంలో జరిగింది. దిక్కుకు సంబంధించిన అంశాలు, ప్రదేశానికి సంబంధించిన వివరాలు వాస్తుశాస్త్రంగా రూపుదిద్దుకున్నాయి. కాలస్వరూపం అర్థం చేసుకునే ప్రయత్నం వివిధరకాల భౌతిక శాస్త్రాల అన్వేషణకు దారితీసింది. విశేషమేమంటే ఈ శాస్త్రాలన్నీ జ్యోతిస్సుల పరిశోధన వల్ల ఏర్పడిన శాస్త్రాంతర్భాగ విశేషాలే.

దాదాపు క్రీ.శ. 500 సం॥ల తరువాత జ్యోతిషం సిద్ధాంత, ఫలిత భాగాలుగా విభజింపబడింది. ఈ రెండూ వేనికవే విస్తరించడం మొదలైంది. వీనిలో గ్రహాల గతి, స్థితి, అయనాంశపాతం మొదలైన విషయాలు గణిత జ్యోతిషంతో ఆవిర్భవించాయి. ఇవి వివిధ కాలాలలో వివిధ సమ్మేళనాలతో చూపించే కాంతుల అభివ్యక్తి విశేషాలు శుభాశుభ సమయనిర్ణయం, ఆయా సమయాల్లో చేయదగిన పనులు, యజ్ఞయాగాది కర్మలు చేసే సమయాలు, స్థాన నిర్ధారణ మొదలైన ఫలిత జ్యోతిషాంశాలుగా కనిపించాయి.

అథర్వణ వేదాంగజ్యోతిషంలో తారాబలం చూసే క్రమం, తిథి-వార- నక్షత్ర-యోగాదులలో ఒకదానికంటే మరొకటి బలమైనవని చెప్పడం జరిగింది. 'తిథికంటే నక్షత్రం నాలుగురెట్లు బలమైనది.'

"తిథిరేకగుణాప్రోక్తా - నక్షత్రంచ చతుర్గుణం
వారశ్చాష్టగుణః ప్రోక్తా కరణం షోడశాన్వితమ్
ద్వాత్రింశతిస్తథా యోగస్తారా షష్టి సమాన్వితా
చంద్రః శతగుణః ప్రోక్త స్తస్మాశ్చంద్ర బలాబలమ్"

ఇటువంటి అంశాలు ఈ గ్రంథంలో చోటుచేసుకోవడం వల్ల ఫలితజ్యోతిష భావనలు పెరగడాన్ని గమనించవచ్చు. జైనులకు సంబంధించిన సూర్యప్రజ్ఞప్తి, చంద్రప్రజ్ఞప్తి, జ్యోతిష్కరండకము మొదలైన గ్రంథాలు జ్యోతిషంలో గణిత జ్యోతిష సంబంధ వివరాలతో కూడుకున్నవి.

క్రీ.శ.500 ప్రాంతానికి జ్యోతిషం స్కంధత్రయాత్మకంగా గుర్తింపబడింది. సిద్ధాంత, సంహిత, హోర అనేవి మూడుస్కంధాలు. క్రీ.శ. 1000 నాటికి జ్యోతిషం పంచస్కంధాత్మకంగా కనిపిస్తుంది. అవి సిద్ధాంత, సంహిత, హోర, ప్రశ్న, శకునాలు.

సిద్ధాంతస్కంధం పూర్తిగా గ్రహాల, నక్షత్రాల గణితాలతో కూడుకుని వుంటుంది. తిథి వార నక్షత్ర యోగ కరణాలు కేవలం సూర్య చంద్రుల మధ్యగల దూరాలమీద ఆధారపడి వుంటాయి. ఈ ఐదు విషయాలను **'పంచాంగాలు'** అని అంటారు. అవి గణనచేసేవిధానం, గ్రహగతులకు సంబంధించిన సిద్ధాంతాలు ఈ స్కంధంలో కనిపిస్తాయి.

సంహిత అనగా కూర్చబడినది అని అర్థం. అనేకరకాల వైజ్ఞానికాంశాల కూర్పునే **'సంహిత'** అని అంటారు. ఈ స్కంధంలో భూశోధన, దిక్‌శోధన, జలశోధన, ముహూర్తాలు, వాతావరణం మొదలైన అంశాలుంటాయి. ఒక్కొక్క విషయంలోని సూక్ష్మాంశాలను పరిశీలించిన సంహిత పెద్ద వైజ్ఞానికశాస్త్రాల సమ్మేళనంగా కనిపిస్తుంది.

**'అహోరాత్ర'** అనే శబ్దంలోని మొదటి 'అ'కారము, చివరి 'త్ర'కారం లోపించగా, 'హోర' అనే పదం ఏర్పడింది. ఆంగ్లంలో 'Hour' అంటారు. 'జాతకం', ఫలిత జ్యోతిషాదులు హోరాస్కంధంలో భాగాలుగా వున్నాయి. ఆధునిక కాలంలో జ్యోతిషమంటే కేవలం వ్యక్తి జీవనగమనాన్ని నిర్దేశించి శుభాశుభ ఫలితాలను సూచించే శాస్త్రంగా ఫలితభాగమే గుర్తుకువస్తుంది. మనిషి జీవితంలోని కష్టసుఖాలు, లాభనష్టాల నన్నింటిని జాతకచక్రంలోని ద్వాదశరాశులు, భావాలు, వానిలోని గ్రహాలు, దృష్టులు మొదలైన వానిని ఆధారంగా చేసుకుని ఫలితం నిర్ణయిస్తారు. ఈ శాస్త్రంలో ఇప్పటికే ఎన్నో స్వతంత్ర గ్రంథాలున్నాయి.

తాత్కాలికంగా సమస్యల ఫలాన్ని చెప్పడానికి ఎక్కువ ఉపకరించే శాస్త్రం ప్రశ్నశాస్త్రం. ప్రశ్న వేసిన సమయంలోని గ్రహాల స్థితిగతుల ఆధారంగా ఫలితాలను చెప్పడమే ఇందులోని ముఖ్యాంశం. ఈ శాస్త్రంలో కూడా అనేకరకాల పద్ధతులున్నాయి.



అనుకోనిది ఏదో జరుగుతుందనుకున్నప్పుడు, జరుగబోయేముందు ప్రకృతి, సకల జీవులు స్పందిస్తాయి. ఆ స్పందనల అధ్యయనం, సూక్ష్మీకృత పరిశీలనం ద్వారా అది ప్రత్యేకశాస్త్రంగా రూపుదిద్దుకుంది. దాదాపు 10,11,12 శతాబ్దులలో ఇది స్వతంత్ర శాస్త్రంగా రూపుదిద్దుకుంది. దీనికే **'నిమిత్తశాస్త్రం'** అని మరోపేరు.

ఈవిధంగా పంచస్కంధాత్మకమైన ఈ శాస్త్రాంశాలలో ఆనాటినుండి ఈనాటి వరకు అనేక శాఖలు, ఉపశాఖలు ఏర్పడినాయి. ఇది ఒక విజ్ఞానసర్వస్వంగా భావింప బడుతుంది. ఈ శాస్త్రాన్ని అధ్యయనం చేసే సమయంలో ఎన్నో శాస్త్రాలు ఉద్భవించి, ఎదిగి నేడు ప్రత్యేకశాస్త్రాలుగా అధ్యయనం చేయబడుతున్నాయి. దీన్ని **'విజ్ఞానాల తల్లి'** అనికూడా చెప్పవచ్చు.

సూర్యుని నుండి, ఇతర నక్షత్ర గ్రహాల నుండి వెలువడే కాంతిని పరిశీలించే సందర్భంలో కాంతిశాస్త్రం – వివిధ కాంతితరంగాలు, ఆకర్షణ వికర్షణలు గమనించే సమయంలో అయస్కాంతశాస్త్రం – భూభ్రమణ పరిభ్రమణాలను పరిశీలించేటపుడు ఏర్పడుతున్న వివిధశక్తులకు సంబంధించి శక్తిశాస్త్రం – ఆకాశంలోని నక్షత్రాల స్వరూప వర్ణనలు చేసే సందర్భంలో ఖగోళశాస్త్రం – వివిధ ఆవృత్తాలు, పరిభ్రమణాలు, చంద్రుని కక్ష్యలు, వాటి సమయం లెక్కగట్టేటపుడు గణితశాస్త్రం – భూపరిశోధనా సందర్భంలో భౌగోళిక విజ్ఞానం – ఈవిధంగా ఈ శాస్త్రాలన్నీ నేడు ప్రత్యేక శాస్త్రాలుగా ఉన్నాయి. కాంతుల వివిధ భావాలు ప్రకృతిపైనా, జీవరాశులపైనా చూపించే ప్రభావాల ఆధారంగా పదార్థవిజ్ఞానం, వివిధ వృక్షాలపై వాని ప్రభావాలు గుర్తించే సమయంలో ఆయుర్వేదం, వృష్టికి సంబంధించిన వర్షపాత విజ్ఞానం, కాంతుల వల్ల స్పందించిన జంతువుల ముఖధ్వనుల నుండి సంగీతం, సూక్ష్మీకృతకాంతి పరిశీలించేటపుడు రత్నశాస్త్రం, గొంతులోనుండి స్వరం బయటకు రావడం ద్వారా తగ్గే రోగాలను గూర్చి మంత్ర శాస్త్రం, అన్నింటిని గుర్తించి సూక్ష్మీకృత కాంతి మనసుగా మారి అది గుర్తించే స్థితిగతులననుసరించి మనస్తత్వశాస్త్రం– ఇలా ఎన్నో శాస్త్రాలు జ్యోతిష శాస్త్ర పరిశోధనా సందర్భంలో వెలుగు చూసినాయి. ఇటువంటి విజ్ఞానాలన్నీ మానవునికి తిరిగి ప్రయోజన

కారులవుతున్నాయి. విజ్ఞానం నేడు విధ్వంసాలకు కారణమవుతున్న సందర్భంలో జ్యోతిష విజ్ఞానం మాత్రం సర్వ విజ్ఞానాలకు మూలమై మానవుని పురోభివృద్ధిని నిత్యం కోరుకుంటూ, జ్యోతిస్సులను తదనుగుణంగా నడిచే ప్రకృతిని ఒక క్రమంలో ఉపయోగించుకునే విధానాన్ని వివరిస్తుంది. మొత్తం జ్యోతిశ్శాస్త్రం విశ్లేషిస్తే నేటి మనోవిజ్ఞానశాస్త్రం, జీవవిజ్ఞానశాస్త్రం, పదార్థ విజ్ఞానశాస్త్రం, చికిత్సాశాస్త్రం, గణిత శాస్త్రం, వృక్ష, పశువైద్యాలు, రత్నశాస్త్రం మొదలైన అనేక శాస్త్రాలకు సంబంధించిన ఎన్నో అంశాలు కనిపిస్తాయి.

వేదాలలో మొదలై పురాణతంత్రాలలో వెలుగు చూసిన జ్యోతిషం తన ప్రత్యేకతను చూపిస్తుంది. వేదాంగంగా ప్రత్యేకశాస్త్రమైంది. సిద్ధాంతస్కంధంలో గణితం, కరణం, యంత్రం, పంచాంగం, తంత్రం మొదలైన అంశాలు నిండిపోయాయి. సృష్ట్యాదినుండి, కల్పాది నుండి, యుగాది నుండి కాలగణనలు దీనిలో ప్రత్యేకాంశాలు. పంచవర్షాత్మక యుగంలోని వేరు వేరు సంవత్సరాలలో అంటే సంవత్సర, పరివత్సర, ఇడావత్సర, ఇద్వత్సర, అనువత్సరాలనేవాటిలో రోజులు, పర్వాల సంఖ్యలలోని వైవిధ్యం, విషువత్తుల ప్రవేశం, అయనాల ప్రారంభకాలాలలో రవి, చంద్రుల స్థితులు, వేరు వేరు కాలమానాలు, పంచాంగాల నిర్మాణానికి, గ్రహణాల, మూఢాల నిర్ణయానికి అవసరమైన గణిత, ఖగోళ విశేషాలు ఈ సిద్ధాంత స్కంధంలో చర్చించబడినాయి.

హోరాస్కంధంలో అనేక విభాగాలు ఏర్పడ్డాయి. 'తాజకం' అంటే ఒక సంవత్సర ఫలాలను చెప్పడానికి ఏర్పడిన ప్రత్యేక విధానం. జాతకం – 'జ' అంటే పుట్టుక అని అర్థం. పుట్టుక సమయంలోని వివిధ గ్రహ నక్షత్రాల సంచారమాధారంగా జాతకం వేసి భవిష్యత్తును సూచించడం, ఫలవివరణ చేయడం దీని ప్రత్యేకత. దీనిలో వివిధ రకాల మార్గాలు చూపినవారు – పరాశర, సత్యాచార్య, జైమిని, యవన, పాశ్చాత్యులు. వీరి ఫలిత విశ్లేషణామార్గాలు విభిన్నంగా ఉన్నప్పటికీ అన్నింటికీ ప్రామాణికత ఉంది. నాడీశాస్త్రం అంటే రాశిని వందలాదిభాగాలుగా విభజన చేసి వేరు వేరు భాగాలలోని లగ్నాలు, గ్రహాల ఆధారంగా ఫలితాన్ని గణించే విధానం.





సంహిత మానవజీవనవిజ్ఞాన శాస్త్రం. జ్యోతిస్సుల ప్రభావాలను అనేక రీతులలో పరిశీలించి, అవి మానవునిపై చూపించే ప్రభావాలను ఈ సంహితాస్కంధంలో అధ్యయనం చేస్తారు. దీనిలో తొమ్మిది విభాగాలు కనిపిస్తున్నాయి. ఈ విభాగాలలో జ్యోతిస్సుల ప్రభావం అస్పష్టంగా కనిపించి, ఛాయామాత్రమైన జ్యోతిషభావనలు వ్యక్తీకరించబడతాయి.

**సాముద్రికం** – కాంతి ప్రభావాల వల్లనే వేరువేరు శరీరతత్త్వాలు, రేఖలు ఏర్పడడం, శరీరాంగాల వృద్ధిక్షయాదులు సాధ్యమని సాముద్రికశాస్త్రం చెబుతుంది. ఈ అంగాల మరియు ఇతర ప్రభావాలను నిరంతరం అధ్యయనం చేయడంవల్ల ఈ రేఖలు మొదలైనవి భవిష్యత్తును సూచిస్తున్నాయనే భావం ఏర్పడింది. అందువల్ల ఇది ప్రస్తుతకాలంలో ప్రత్యేకమైన శాస్త్రంగా అధ్యయనం చేస్తున్నారు. హస్త, అంగ, తిలక, ముఖ, పశు సంబంధమైన అంశాలు ఇందులో ప్రత్యేక విభాగాలుగా రూపుదిద్దుకున్నాయి.

**వాస్తు** – వస్తుగతమైంది. ఈ ప్రకృతిలో భూమిపై ఆనందంగా, ఆరోగ్యంగా నివసించడానికి ఒక ప్రత్యేకమైన సదుపాయాలు కలిగి, ప్రకృతి శుభాశుభకిరణాలకు, భూ అయస్కాంత తరంగాలకు అనువుగా జీవనం సాగిస్తే అది వ్యక్తి అభివృద్ధి హేతువవుతుంది. ప్రకృతి వ్యతిరేక జీవనం పతనం చేస్తుంది. దీనికి శాస్త్రీయమైన రూపమే వాస్తుశాస్త్రం. దీనిలో 'కళారాధన' అనే అంశం కూడా చేరి అందం అనే అంశానికి ప్రాముఖ్యం కలిగింది. అందంగా ఉండి వ్యక్తి ఆనందమయ జీవనమార్గానికి హేతువయ్యేది వాస్తుశాస్త్రం. ఈ శాస్త్రాన్ని ఆలయ, శిల్ప, గృహ, యంత్ర అనే విభాగాలుగా అధ్యయనం చేస్తున్నారు.

**ముహూర్తం** – జీవితంలో జరుపుకునే ముఖ్యమైన కార్యక్రమాలకు తత్కాల అనుకూల గ్రహ నక్షత్రాల ప్రభావాలను చూసి సమయం నిర్ణయించే విధానాన్ని ముహూర్తం అంటాం. జనన సమయాన్ని మార్చలేము. కాబట్టి సంఘటనలకు, ముఖ్య జీవితాంశాలకు సంబంధించి శుభమైన కాంతులు ప్రసరించే ఉత్తమమైన కాలాన్ని



ఎన్నుకోవడం, ఆ సమయంలో ఆ కార్యక్రమాలను జరపడం ద్వారా ఇతర దోషాలు తొలగింపబడి ఆ కార్యం సఫలమై ఆనందం కలిగిస్తుంది.

**గోచారం** – గ్రహాల సంచారమే గోచారం. ఈ సృష్టిలోని సమస్తవస్తువులు భ్రమణశీలం కల్గినట్టివే. సూర్యకుటుంబంలో వేరువేరు గ్రహాలు భూగ్రహం పైనున్న మానవులపై కల్గజేసే ప్రభావాలు అధికం. వ్యక్తి జన్మజాతకాన్నుండి వివిధ గ్రహాలు ఎంతెంత దూరంలో ఉన్నాయి? ఆ ప్రదేశాలనుండి ఏయే కేంద్రాలు, కోణాల ద్వారా వ్యక్తిపై కాంతి ప్రసరిస్తుంది? ఈ కాంతుల ప్రసరణకు స్పందన ఏమిటి ? మొదలైన అంశాల పరిశీలన 'గోచారం' గా మారింది. వ్యక్తిపరంగా, దేశపరంగా ఆలోచనలు, అధ్యయనాలు దీనిపై విస్తృతంగా కొనసాగుతున్నాయి.

**వృష్టి** – వ్యవసాయదారునికి ముఖ్యంగా కావల్సింది వర్షం. దాని ప్రకారమే అతడు విత్తనాలు వేసి పంటలు పండిస్తాడు. అకాలంలో వేసిన పంట మొలకెత్తదు, పండదు. అది తనకే గాక దేశానికి కూడా నష్టమే. ఈవిధమైన వర్షవిజ్ఞాన పరిశోధన అత్యంతావశ్యకం. వర్షాలు పడే సమయంలో మార్పులు ఏవిధంగా వున్నాయో పరిశీలన లోకి వచ్చింది. సూర్యుని వివిధ కార్తెల ప్రవేశం, చంద్ర పరివేషం మొదలైన అంశాలు ప్రకృతిని ప్రేరేపిస్తున్నాయని, దానికి అనుగుణంగా వర్షాలు పడుతున్నాయని గ్రహించారు. ఇప్పటికీ ఆ సమయ నిర్దేశమాధారంగానే వ్యవసాయదారులు తమ పనులు చేసుకుంటున్నారు. ఈవిధమైన పరిశీలన రెండురకాలుగా సాగుతుంది. జంతుజాలాల ప్రవర్తనా మార్పులవల్ల కురియబోయే వృష్టిని 'సద్యోవృష్టి' గాను, జ్యేష్ఠ శుద్ధ పూర్ణమి తర్వాత పూర్వాషాఢా నక్షత్రం నుండి వరుసగా 27 నక్షత్రాలు దాటేవరకు ఏ రోజులో ఎంత వర్షం ఏ ప్రదేశంలో పడుతుందో గమనించి దాని ప్రకారం ఆ సంవత్సరం వర్ష ఫలితాన్ని తెలుసుకునే విధానం 'ప్రవర్షణ' అనే అంశంగా అధ్యయనం సాగుతుంది.

**శాంతి** – గ్రహదోషాలంటే గ్రహాలు చెడ్డవనీ, పీడాకారులనీ కాదు. గ్రహాలు తమవాతావరణానికి అనుగుణంగా [illegible] యి. గ్రహ

సంబంధమైన కాంతులు శరీరంపై సరిగా లేకపోవడం వల్ల ఆ శరీరంలో ఆయా కాంతులకు సంబంధించిన ధాతువుల వృద్ధి ఆగిపోతుంది. వివిధ శక్తి కేంద్రాలనుండి హార్మోన్ల విడుదల, శక్తి ప్రవాహం తగ్గుతుంది. అందువల్లనే గ్రహశాంతులకు ప్రాధాన్యమిచ్చి ఆయా గ్రహాలకు రూపాలను ఏర్పాటు చేసుకుని ఆరాధిస్తారు. ఈ శాంతి ఒక రకమైన వైద్య ప్రక్రియ. హోమ, జప, దానాదులు ఆధునిక కాలంలో హోమథెరపీ, మంత్ర థెరపీ, జెమ్‌థెరపీ అంటూ వేరు వేరు పేర్లతో ఏర్పడడమే కాక సంగీత సంబంధమైన వైద్యం, నక్షత్ర గ్రహానుకూలమైన చెట్లను పెంచడం ద్వారా వైద్యం వంటి అనేకానేక ప్రాకృతిక వైద్యాలు శాంతి సంబంధమైనవిగా పరిగణిస్తున్నారు. ఈ విధానాలకు నేడు అధికమైన ఆదరణ కూడా ఉంది.

**స్వప్నం** – కాంతియొక్క సూక్ష్మీకృత రూపమే మనసు. సకల జీవరాశుల అంతశ్చేతన ఒక్కటేనని మనస్తత్వ శాస్త్రజ్ఞుల అభిప్రాయం. మనిషి నిద్రించినా మనసు నిద్రించదు. దానికున్న శక్తి అమోఘం. అందువల్ల నిద్రలో కూడా అది స్మృతులను వెలికి తీస్తుంటుంది. మనసుకు భవిష్యజ్ఞానముండి స్వప్నం ద్వారా అది వ్యక్తీకరింప బడుతుంది. స్వప్నంలో కనిపించే వివిధ అంశాలకు వివిధ ప్రతీకలున్నాయి. ఇవి ప్రాంతపరంగా భౌగోళిక పరిస్థితుల ఆధారంగా విభేదిస్తాయి. వీనిని అధ్యయనం చేస్తూ శుభాశుభాలను పరిశీలనలోనికి తీసుకోవడం ద్వారా ప్రమాదాలనుండి రక్షించుకోవచ్చును. ఈ భావంతో వృద్ధి పొందిన శాస్త్రం స్వప్నశాస్త్రం. దీన్ని ప్రాంత విభేదం, అధ్యయన భేదాన్ని అనుసరించి ప్రాచ్య పాశ్చాత్య భావాలుగా అధ్యయనం చేస్తున్నారు.

**రత్నశాస్త్రం** – **'ముల్లును ముల్లుతోనే తీసివేయాల'**న్నది తెలుగు సామెత. మనిషి శారీరక, మానసిక స్థితులపై అధికంగా ప్రభావం చూపించే వివిధ కాంతుల ప్రభావం సరిగా లేనపుడు వానిని గుర్తించి సూక్ష్మీకృతకాంతిని శరీరానికి అందజేసే రత్నాల ద్వారా వైద్యం చేసే విధానాన్ని రత్నశాస్త్రం తెలియజేస్తుంది. ఒక్కో గ్రహసంబంధ మైన కాంతికి అనుగుణంగా ఒక్కో రత్నం పనిచేస్తుంది. కాంతికి సంబంధించిన



లోపాన్ని కాంతితోనే పూరించాలన్న వైజ్ఞానికదృక్పథం రత్నశాస్త్ర ఆవిర్భావానికి దారితీసింది. జాతకాదుల పరీక్ష ద్వారా ఏ గ్రహసంబంధమైన దోషం వుందో గమనించి ఆ గ్రహ సంబంధమైన రత్నం ధరింపజేయడం వల్ల నివారణ చేయడమే కాకుండా అనేక శారీరక, మానసిక సంబంధ లోపాలను రత్నాలద్వారా తీసివేయడం **'జెమ్ థెరపీ'** వల్ల సాధ్యమవుతుంది. ఈ విషయ సంబంధమైన వైద్య ప్రక్రియను **'స్టెల్లార్ హీలింగ్'** అని అంటారు.

ఇదేవిధంగా భూగర్భవస్తు విజ్ఞానంలో జలార్గళం, ధనం, లోహాలను గుర్తించడం కూడా జ్యోతిషంలోని సంహితలో ప్రత్యేకంగా అధ్యయనం చేయబడుతున్నది.

**ప్రశ్న** – జ్యోతిశ్శాస్త్రంలో చతుర్థ స్కంధమిది. తాత్కాలికంగా తాను చేయబోయే పనులలో శుభాశుభాలను గుర్తించి కార్యానికి ఉద్యుక్తులు కావడంలో ఉన్న అంశాలను దృష్టిలో పెట్టుకోవడం ఈ శాస్త్రంలో కనిపిస్తుంది. తత్కాల గ్రహస్థితి ఆధారంగా ఈవిషయాన్ని నిర్ణయిస్తారు. అంతేగాకుండా ప్రశ్న అడిగిన సమయంలో జ్యోతిష్కుని శ్వాస, చుట్టూవున్న శుభాశుభ వస్తువులు, చెప్పిన సంఖ్య, ప్రశ్నాక్షరాలు మొదలైన విషయాలపై ప్రత్యేక శ్రద్ధను చూపిస్తూ స్వర, కాల, సంఖ్య, వాక్య ప్రశ్నలుగా అధ్యయనం చేస్తున్నారు.

**శకునం** – జ్యోతిషవిజ్ఞానంలో తరువాతి కాలంలో పంచమ స్కంధంగా గుర్తించబడింది. ఈ శకునాలను గుర్తించేది మనస్సే. మనకు నిత్య జీవితంలో కనిపించే వస్తువులు, జీవజాలాలు వాటికి ప్రేరకాలే గాని అవి చెడ్డవి కావు. ప్రకృతిలో ఏదో మార్పు కలుగుతుందన్నప్పుడు జీవులు తమ శరీర ప్రకృతులు మార్చుకుంటాయి. అవి గమనించడం కూడా శకున సంబంధమైన అంశమే. దీనిలో మనుష్య, ప్రకృతి, పశు పక్షి సంబంధమైన విధాలుగా విభజన చేసి అధ్యయనం చేస్తున్నారు.

జ్యోతిషం ఎన్నో విజ్ఞానశాస్త్రాల ఆవిర్భావానికి మూలకారణం అవడమే కాకుండా వానికి సంబంధించిన ఎన్నో రకాల శాస్త్రాలను వృద్ధి చేస్తుంది. కేవలం వైజ్ఞానిక

శాస్త్రాలపై పరిశోధనలు చేసేవారు సామాజికశాస్త్రాలను, సామాజిక శాస్త్రాల పరిశోధకులు వైజ్ఞానికశాస్త్రాల వారిపై వాగ్బాణాలను సంధిస్తూ అవహేళనలు చేసుకుంటూ సమన్వయం సాధించకుండా పోతున్నారు. వీరి మధ్యగల అనైక్యత కారణంగా శాస్త్రవిజ్ఞానం సమాజానికి, సమాజస్థితి శాస్త్రానికి అంతుబట్టకుండా పోతుంది. ఈ పరిణామం వల్ల విజ్ఞానం వినాశనానికి, విధ్వంసానికి కారణమవుతుంది. ఈవిధమైన స్థితిగతులున్న సమాజంలో పూర్వకాలం నుండి ప్రస్తుతం వరకు నూతన దృక్కోణంలో సామాజిక, వైజ్ఞానిక శాస్త్రాలను సమన్వయం చేసే శాస్త్రంగా జ్యోతిషం వెలుగుతూనే వుంది. దీనిలోని సిద్ధాంత అధ్యయన భాగం ఖగోళ (Astronomy) సంబంధమైనది. దాని ఫలితం భౌతిక శాస్త్ర, కాంతి శాస్త్ర, అయస్కాంత శాస్త్ర సంబంధమైనది. వీనివల్ల శరీరంలోను, ప్రకృతిలోను కలిగే మార్పులు అధ్యయనం చేయడం 'కళ' (Art) గా సామాజిక శాస్త్రాంశంగా చూడవచ్చు.

"యథా శిఖామయూరాణాం నాగానాం మణయో యథా।
తద్వద్వేదాంగ శాస్త్రాణాం జ్యోతిషం మూర్ధనిస్థితం॥"

నెమళ్ళకు ఫించంలాగా, నాగుపాములకు శిరంపైగల మణులలాగా వేదాంగ శాస్త్రాలన్నింటిలోనూ జ్యోతిషం తలమానికమైంది.

ఒక శాస్త్రీయమైన విషయం ప్రజల్లోకి పూర్తిగా చేరిన తరువాత దాని ప్రభావాన్ని సాధారణంగా అందరూ గుర్తించడం జరుగుతుంది. ఒకవేళ అది ప్రభావం చూపలేకపోయినట్లయితే దాన్నెవరూ ఆచరించరు, ఆదరించరు, అనుసరించరు. శాస్త్రం పరిశోధించవలసిన అవసరం ఇక లేదనిపించి, గమనించిన విషయం పూర్ణజ్ఞానమనే స్థితికి వచ్చినపుడు అది నమ్మకంగా పరిణమిస్తుంది. ఈ విషయాలనే తమ తర్వాతి తరాలవారికి పూర్వులు అందజేస్తుంటారు. అవే సామెతలుగా, పొడుపుకథలుగా, నమ్మకాలుగా జానపదవిజ్ఞాన అంతర్భాగాలుగా కనిపిస్తున్నాయి. నిత్యజీవన వ్యవహారం లోనూ, వ్యవసాయంలోనూ, వివిధవృత్తులలోనూ అన్నింటిలోనూ ఈ విషయాలకు సంబంధించిన జానపద వచనరూపాలు కనిపిస్తున్నాయి.



'ఓం పూర్ణమదః పూర్ణమిదమ్
పూర్ణాత్పూర్ణ ముదచ్యతే
పూర్ణస్య పూర్ణమాదాయ
పూర్ణమేవావ శిష్యతే'

అని ఈశావాస్యోపనిషత్తు చెపుతుంది. పూర్ణమైన జ్యోతిషవిజ్ఞానం కూడా వివిధ భాగాలుగా విడిపోయినా అన్నింటి సమాహార విజ్ఞానం పూర్ణంగానే కనిపిస్తుంది. ప్రతి ఒక్కటీ పూర్ణంగానే కనిపిస్తాయి. పూర్ణంలో నుండి పూర్ణం, పూర్ణం పోయిన తర్వాత పూర్ణమే మిగులుతుంది. ఈ 'పూర్ణ' శబ్దం కూడా జ్యోతిష పరిభాషకు సంబంధించినదే.

**"అంగట్లో అష్టభాగ్యం, అల్లుని నోట్లో శనేశ్వరం"** అనేది సామెత. నిత్య జీవన వ్యవహారంలో దీన్ని ఉపయోగిస్తుంటాం. అత్తగారింటి దైన్యస్థితిని, అల్లుని దుర్భాగ్యాన్ని ఈ సామెత చూపిస్తుంది. జ్యోతిశ్శాస్త్రంలో పరిశీలించే గ్రహాలలో 'శని' గ్రహం ఒకటి. శనిగ్రహం ఒక్కోరాశిలో రెండున్నర సంవత్సరాలు వుంటూ రాశిచక్రం ఒకసారి చుట్టి రావడానికి 30 సంవత్సరాలు తీసుకుంటాడు. సహజంగా ఆ గ్రహం నుండి పరావర్తనం చెందే కాంతి అన్ని సమయాలలో శుభఫలితాలను ఇవ్వక పోవడం వల్ల దాన్ని అశుభగ్రహంగా నిర్ణయించారు. జాతకుని జన్మరాశికి 12,1,2, స్థానాలలో 'శని' వుంటే దానిని **'ఏలినాటిశని'** గా నిర్ణయిస్తారు. ఇది ఏడున్నర సంవత్సరాలు ఉంటుంది. దానివల్ల అనేక రకాల ఇబ్బందులు ఎదురవుతాయని జ్యోతిష గ్రంథాలు చెబుతున్నాయి. ఈవిధంగా శనిగ్రహం యొక్క కాంతి ప్రభావం వ్యక్తిలో బద్ధకాన్ని ప్రేరేపిస్తుందని, అనేక అరిష్టాలకు మూలహేతువవుతుందని, శాస్త్రాధార విషయాల ద్వారా తెలుసుకున్నా జానపదుల సామెతల్లో తన దైన్యస్థితి వర్ణించే సందర్భంలో ఈ రకమైన సామెత వచ్చింది. **'రామేశ్వరం పోయినా శనేశ్వరం తప్పలేదు'** అంటూ నిత్యజీవిత విషయాలలోనే కాక ప్రముఖ యాత్రాదులలో కూడా తమ అసౌకర్యాలకు జ్యోతిష సంబంధ గ్రహాలు సామెతలుగా పేర్కొనబడుతున్నాయి.

వ్యవసాయ సంబంధమైన సామెతలెన్నింటిలోనో జ్యోతిష సంబంధాంశాలు చేరాయి. **'మిథునంలో పెట్టిన మొక్క మీసకట్టులో పుట్టిన కొడుకు అక్కరకు వస్తారు'** సూర్యుడు మిథునంలో ఉండడం మిథునమాసంగా వ్యవహరిస్తారు. ప్రతి సంవత్సరం జూన్‌లో ఇది వుంటుంది. ఆ సమయంలో నాట్లు వేయడం పరిపాటి. తొలకరి వర్షాలు పడే ఆ సమయంలో మొక్కలు బాగా ఎదుగుతాయి. సూర్యుడు మిథున మాసంలో ఉన్నపుడు మృగశిర, ఆరుద్ర, పునర్వసు నక్షత్రాలలో ఉంటాడు. **'ఆరుద్ర కురిస్తే దారిద్ర్యం లేదు'** అనే సామెతలు కార్తెలకు సంబంధించినవి. వ్యక్తికి తొలిగా మీసకట్టు వచ్చే సమయంలో కొడుకు పుడితే తనకు శక్తి తగ్గే సమయానికి పిల్లవాడు ఎదిగి వస్తాడు. అందుకే **'అదును ఎరిగి సేద్యం – పదును ఎరిగి పైరు'** వేయాలని కాలధర్మాన్ని తెలిపే శాస్త్రవాక్యం వ్యవసాయజీవితం గడుపుతున్న జానపదుల జీవితంలో సామెతగా మారింది. ఇంకా **'దిక్కులేనింటికి దిక్కు ఉండదు'** అనే వాస్తుశాస్త్ర సంబంధ సామెతలు కనబడుతున్నాయి. ఇట్లా ప్రకృతిలోని కాంతి తరంగాలు, భూ అయస్కాంత తరంగాలను ఆధారంగా చేసుకొని నియమానుసారం కట్టాలి. లేకుంటే అనర్థాలు ఏర్పడతాయి. ఆ యింటిలోని వారికి తీవ్రమైన ఇబ్బందులు ఏర్పడతాయి. సరియైన దిక్కులు చూడకుండా కట్టిన యింటికి పెద్దదిక్కైన వారు మిగలరనే భావం సామెతగా మారింది. అందుకే **'దిక్కులేని యింట్లో దయ్యాల కాపురం'** వంటి సామెతలు కూడా వచ్చాయి. ఈవిధంగానే నిత్యజీవనంలోని వివిధ అవస్థలకు సంబంధించి, వ్యవసాయ జీవనానికి సంబంధించి, వాస్తువిశేషాలు, ప్రయాణాలు, ముహూర్తాలు, ప్రకృతి నియమాలకు సంబంధించిన అంశాలన్నీ సామెతలుగా జానపదులలో చేరినాయి.

జానపదులకు ఎన్నో నమ్మకాలు, విశ్వాసాలున్నాయి. వీటికన్నింటికి పూర్ణమైన జ్యోతిషాధారాలో లేక ఛాయామాత్రమైన జ్యోతిషభావనలు పరోక్షంగా కనిపించడమో జరుగుతుంది. నమ్మకాలు నిత్యజీవన సంబంధాలు. తనచుట్టూ పశుపక్ష్యాదులతో ఏర్పరచుకున్న సన్నిహిత సంబంధాలు మొదలైన అంశాలకు చెందినవే అధికం. ప్రకృతిని విశ్లేషించి పరిశీలించిన సందర్భంలో ఎదురైన అనుభవాల సముచ్చయమిది.



అది పునరావృతమైతే అదేవిషయం శాస్త్రీయమైన నమ్మకమవుతుంది. **'హేతువులేనిది తీతువు కూయదు'** అనేది నమ్మకం. తీతువు కూస్తే ఉపద్రవం సంభవిస్తుందన్న నమ్మకం వుంది. అదేవిధంగా ఏదో చెప్పరాని ఆపద సంభవిస్తుందన్నప్పుడు ప్రకృతిలోని వస్తువులు, జంతుజాలాలు వాటిని సూచిస్తాయని మన విశ్వాసం. ఈ సూచనను మనసు గ్రహిస్తుంది. ఆ దారిలోనే ఆలోచిస్తుంది. కారణం ఇక్కడ తీతువుపిట్ట అనేకసార్లు అరచినప్పుడు ఏదో అశుభాన్ని మనం గమనించడమే. మనస్సు సంబంధమైన ఛాయామాత్ర జ్యోతిష భావనలు ఈవిధంగా వ్యక్తమవుతాయి. భవిష్యత్సూచక విషయాలు ఇటువంటి విధానాల ద్వారా జ్యోతిషాంతర్భాగాలైనాయి. ఈవిధంగా ప్రకృతిని అధ్యయనం చేసిన జానపదులకున్న జ్యోతిర్విజ్ఞానం అపారం.

**'చంద్రుని చుట్టూ గుడి కడితే వర్షం కురుస్తుంది'** అనేది సామెత – నమ్మకం. **'దూరమైతే దగ్గర దగ్గరైతే దూరం (వర్షం)'** అనే పొడుపు కథ కూడా ఉంది. వర్షం కురవడానికి చంద్రుడు కూడా ఒక కారకం. ఇది కూడా పరిశీలనవల్ల తెలిసిన విషయమేకాని ఇతరమేమీ కాదు. బృహత్సంహిత లాంటి జ్యోతిష గ్రంథాలలో ఈ విషయాలు తెలుపబడినాయి. క్రీ.శ. 5వ శతాబ్ది ప్రాంతంలో ఈవిషయాలను సూత్రబద్ధం చేసిన వరాహమిహిరుని గ్రంథంలో ఇటువంటివెన్నో విషయాలు, వివిధ పక్షుల చేష్టాదులు, ప్రకృతిలోని వివిధ మార్పులు వివరించబడినాయి. అంటే అంతకు ముందు ఎంతో కాలంగా ఈవిషయ సంబంధమైన పరిశోధనలు ఎన్నో జరిపి ఉండి జానపదులు ఎంత ప్రాచీనమైన విజ్ఞానాన్ని మోసుకొస్తున్నారో వీని ద్వారా అర్థమవుతుంది.

జానపదుల పొడుపుకథల్లో కూడా ఈ విషయాలు కనపడుతున్నాయి. అయితే వీటిలో ఫలిత సంబంధమైన విషయాలు అధికంగా లేవు. కేవలం జ్యోతిస్సులకు సంబంధించి భౌతికపరమైన వర్ణనలు పొడుపుకథలుగా కనపడుతున్నాయి.

**"ఊరంతకీ ఒకే దుప్పటి"** (ఆకాశం)

**"చాప చుట్టనూ లేము – చంకబెట్టనూ లేము"** (ఆకాశం)

వంటి పొడుపుకథలు ఆకాశానికి సంబంధించి వచ్చిన ప్రహేళికలు. ఇదేవిధంగా పొడుపుకథలు కొన్ని జ్యోతిషవిజ్ఞాన సంబంధులుగా కనపడుతున్నాయి.

జ్యోతిష విజ్ఞానమీవిధంగా పండితుల్లోనే గాక జానపదుల్లో కూడా విస్తృతంగా వ్యాపించింది. ఫలితం చెప్పడమే జ్యోతిషమనుకుంటే వారికి ప్రకృతి సంబంధ విషయాలు, పశుపక్ష్యాదుల సంబంధమైన జ్ఞానంతో భవిష్యత్తు చెప్పగలరు. కేవలం సిద్ధాంతభాగమే జ్యోతిషమనుకుంటే ఆకాశంలోని వివిధ గ్రహాలు, నక్షత్రాలు అన్ని విషయాలను సూచించగలరు. ప్రకృతిలో నిండిన అనేక వైజ్ఞానిక విషయాల సమాహారం జానపదుల జ్యోతిషవిజ్ఞానంగా కనిపిస్తుంది. అందుకే వివాదాలతో కూడుకున్న అనేక శాస్త్రాలు వినాశాన్ని సృష్టిస్తుంటే జ్యోతిషం అనేక విషయాల సంబంధ విజ్ఞానాన్ని అందిస్తూ నిత్యనూతనత్వాన్ని, వ్యవహార దక్షతను, కర్మ పురోగామిత్వాన్ని కలిగిస్తూ శోభాయమానంగా వెలుగొందుతుంది.

"అప్రత్యక్షాణి శాస్త్రాణి వివాదస్తేషు కేవలం
ప్రత్యక్షం జ్యోతిషం శాస్త్రం చంద్రార్కౌ తత్ర సాక్షిణౌ"



# సామెతలు
# ఉద్భవ వికాసాలు

"అనుభవమే శాస్త్రం – మాటలే మంత్రాలు" అనేది సామెత. అనుభవం నుండి భావం పుడుతుంది. ఆ భావం అభినయం ద్వారా కొంత వ్యక్తీకరింపబడుతుంది. మాటద్వారా మరింత స్పష్టమవుతుంది. ఆ మాట నోటినుండి వచ్చేటపుడు దాని రూపురేఖలు, అర్థం చమత్కార ద్యోతకమవ్వాలి. ఈవిధంగా ఉంటే వ్యంజనావృత్తి ద్వారా మాట మనోహరమవుతుంది. వ్యక్తి యొక్క వ్యష్టి జీవితంలో, సంఘ జీవితంలో తనకు ఎన్నోరకాల అనుభవాలు కలిగినపుడు వాటిని తర్వాతి తరాలవారికి తెలియజేయడానికి ప్రయత్నిస్తాడు. ఆ ప్రయత్నంలో ఒక నూతనమైన దృక్కోణం ఏర్పడుతుంది. భాష మారుతుంది. భావం స్పష్టమవుతుంది. మణిపూసల వంటి వాక్యాలు బయటకు వస్తాయి. అవి కేవలం ఒక్కరి జీవితంలో తాత్కాలిక ప్రయోజనాన్ని కలిగించే మాటలైతే త్వరలో తేలిపోతాయి. ఆ మాటలు అందరి అనుభవాల మూటలైతే అదేవిధంగా కలకాలం నిలిచిపోతాయి. మరొక్కసారి దానికి తాదృశ్యమైన సంఘటన జరిగితే ఆ మాటను పూర్వపు భావం చెప్పే ఉదాహరణగా చెపుతుంటారు. ఒక్క

మాట ద్వారా ఒక జీవితానుభవాన్ని వ్యక్తీకరిస్తారు. ఈ మాటల ద్వారా చెప్పే విషయం ఎదుటి వారికి సంక్షిప్తంగా, సంశయం లేకుండా అర్థమవుతుంది. ఒకరకమైన సూచన కూడా వీనిద్వారా శ్రోతకు కలుగుతుంది. అందువల్లనే ఒక జీవితానుభవంతో వ్యక్తీకరించే సత్యాలే **'సామెతలు'**. సామెతలతో కూడిన సంభాషణం వల్ల చమత్కార సిద్ధితో మాట మనస్సును హత్తుకుపోతుంది. సామెతకు మారుగా నానుడులు, సుద్దులు, జనశ్రుతులు, మాటలు, శాస్త్రాలు అనే పదాలు కూడా వ్యవహారంలో ఉన్నాయి. వీటిలో ఒక్కోదానికి ఒక్కో ప్రత్యేక లక్షణముంది. ఈ మాటల్లో అర్థవిశేషమున్నప్పటికీ జన వ్యవహారంలో అన్నీ సామెతలుగానే పరిగణింపబడుతున్నాయి.

విశ్వనాథ సత్యనారాయణగారు సామెతను నిర్వచిస్తూ **సామెతలు ఆ జాతియొక్క అనుభూతి పారమ్యాన్ని ప్రతిబింబిస్తూ మహాశాస్త్రముల యొక్క సూత్రములవలె నిగూఢ రమణీయ వ్యాఖ్యాపేశలత్వాన్ని వాంఛిస్తూ ఉండే ఒక విలక్షణమైన సాహిత్య ప్రక్రియ. ఇదీ సామెత అంటే!** అంటారు.

సంస్కృతంలోని 'సామ్య' శబ్దానికి ఏర్పడ్డ అసాధురూపమే 'సామ్యత' అని, అది కాలక్రమంలో 'సామెత' గా మారి ప్రచారంలో ఉందని డా॥ చిలుకూరి నారాయణ రావు అభిప్రాయపడినారు. కన్నడ భాషలో కూడా సామెతకు సమానమైన పదం 'సామతి'. ఈ సామతి కూడా సామ్యత నుండి పుట్టింది.

సమత కల్గింది 'సామెత' అని శ్రీ నేదునూరి గంగాధరం గారి అభిప్రాయం.

**సామెతలు సంక్షిప్తంగా, వివేకయుతంగా ఉండే సాంప్రదాయిక అభివ్యక్తులు** అని రోగర్ డి. అబ్రహమ్స్ సామెతను నిర్వచించారు.

**సంక్షిప్తమైన, వివేకయుతమైన, తీక్ష్ణమైన, సాంప్రదాయికమైన, ప్రియమైన, అనుభవ మూలకమైన అభివ్యక్తి 'సామెత'** అని ఆర్వీయస్ సుందరం గారు ఆంధ్రుల జానపద విజ్ఞానమనే గ్రంథంలో నిర్వచించారు.



సాటి అయినదే సాటవ అని దివాకర్ల వేంకటావధాని గారి అభిప్రాయం. నెల్లూరు – రాయలసీమ ప్రాంతాలలో సామెతను సాటువ, సాటవ, చాటువు, చాటవ అని అంటారు. 'ఏదో సాటవ చెప్పినట్లు' అనేది వారిమాట. సాటిజేసి అంటే, పోల్చి చెప్పడమే దీనికున్న ప్రధానగుణం.

తెలుగులో ఇన్ని రకాల విలక్షణార్థాలతో, నిర్వచనాలతో కనిపించే సామెతకు వివిధ భాషలలో వేరు వేరు పేర్లున్నాయి.

సంస్కృతం – సుభాషితం, సూక్తి, లోకోక్తి, అభాణక, లౌకిక ప్రవాద, లౌకిక న్యాయ

| | |
|---|---|
| ప్రాకృతం | – గాహె (గాథా శబ్దభవం) |
| కన్నడం | – గాదె, నాణ్ణుడి, లోకోక్తి, శాస్త్ర, సామతి. |
| తమిళం | – పళమెళి. |
| మళయాళం | – పళించొల్. |
| తుళు | – గాదె. |
| కొడవ | – గాది. |
| కొంకణి | – మ్హణ్హీ |
| ఆంగ్లం | – Proverb |
| గ్రీకు | – Paroemia |
| లాటిన్ | – Proverbium |
| ఐరిష్ | – Sean Fhocal |
| టర్కిష్ | – atlaler sozir |
| హంగరీ | – Pelda begged |
| అరబ్బీ | – Mathal |
| చీనీ | – సుహా, సయూ. |
| బల్గేరియా | – పోస్లోవినా. |
| హిందీ | – కహావత్ |

ఈవిధంగా వివిధ భాషల్లో ప్రపంచవ్యాప్తంగా సామెతల పేర్లు మనకు కనిపిస్తున్నాయి.

**'అల్పాక్షరాలలో అనల్పార్థ రచన'** అన్న వాక్యానికి సామెతలు ఉదాహరణలుగా ఉంటాయి. సామాన్యంగా సామెతలలో ఒక వాక్యం మాత్రం ఉంటుంది. ప్రాచీన కళాత్మక అభివ్యక్తుల్లో సామెతలు ముఖ్యమైనవి. ఐతే సామెతలు ఎప్పుడూ సంక్షిప్తంగానే ఉంటాయని అనుకోవడానికి వీలులేదు.

**"నాతిదీర్ఘమై, గంభీరంగా, సూచ్యంగా, అనుభవాన్ని అభివ్యక్తీకరించినట్లయితే అలాంటి వాక్యాలను సామెతలని పిలవడంలో తప్పులేదు"** అని ఆర్వీయస్ సుందరంగారి అభిప్రాయం.

సామెతలు 'సూక్ష్మంలో మోక్షాన్ని' చూపించే ప్రాచీనుల వైజ్ఞానిక సంపదకు ఉదాహరణలు.

సామెతను అనంతపురం, గుంటూరు మండలాలలోను, కర్నాటక రాష్ట్రంలోని కొన్ని ప్రాంతాలలోను 'శాస్త్రం' అంటారు. సంస్కృతంలోని సర్వశాస్త్రాల విజ్ఞానం సూత్ర వాక్యాల్లో అణగి ఉండినట్లుండడంవల్ల సామెతకు 'శాస్త్రం' అని పేరు వచ్చిందని కన్నడ పండితుడు ఎం.ఎస్. నాయక్ గారి అభిప్రాయం.

అందుకే **'ఏదో సామెత చెప్పినట్లు'** అని తమ భావాన్ని చెప్పే సందర్భంలో 'ఏదో శాస్త్రం చెప్పినట్లు' అనడం కనిపిస్తుంది. శాస్త్రం అనే మాటకు సంస్కృతంలో విధి, వాక్యం, నియమం అనే అర్థాలు వున్నాయి. సర్వశాస్త్రాల జ్ఞానం సామెతలలో సూత్ర వాక్యాలలాగా నిక్షిప్తమై ఉండడం వల్ల సామెతకు 'శాస్త్రం' అని పేరు వచ్చిందని భావించవచ్చు.

కన్నడిగులకు **'సామెత వేదానికి సమానం'**(గాదె వేదక్కె సమాన). వేదాలు సనాతనమైనవి. అపౌరుషేయాలు. సామెతలు కూడా అటువంటివే. వేదార్థ జ్ఞానం,



శాస్త్ర జ్ఞానం ఇందులో ఉంటుందని **"సామెత మర్మాన్ని గ్రహించినవాడు వేద మర్మాన్ని గ్రహించ గలడని"** కన్నడ సామెత చెబుతుంది.

సామెతల ఉత్పత్తికి చెందిన సమయాసమయ నిర్దేశం చేయడం అత్యంత కష్టమైన విషయం. వేదం పుట్టిన సమయం చెప్పడం ఎంత కష్టమో సామెత పుట్టుకను చెప్పడం కూడా అంతే కష్టం. సామెతలు సాధారణంగా జనసామాన్యం నుండి పుట్టుకుని వస్తాయి. వారి అనుభవాలు, అభిరుచులు సామెతల్లో ప్రతిబింబిస్తాయి. అంతేకాదు, ఆ అనుభావాలు ఎంతో చమత్కారమైన రీతిలో హృద్యమైన మాటల ద్వారా చెప్పబడతాయి. తద్వారా వాటిని గుర్తుపెట్టుకోవడానికి అవకాశం ఏర్పడుతుంది.

సామెతను కూర్చడం ఒకడి వంతే అయినా అనుభవం మాత్రం జనసామాన్యులందరిదీ. ఒక్కొక్కరికి ఒక్కో అనుభవం కలుగుతుంది. ఎందరికో ఒకే అనుభవం కలుగవచ్చు. అందువల్ల సామెతలో ఉన్న అనుభవం కేవలం వ్యక్తిగతమైంది కాదు. ఎంతోమంది వివిధ ప్రదేశాలలో వివిధ సమయాలలో పొందిన అనుభవం. అనుభవం జీవితం నేర్పిన ఒక పాఠమే. ఈ అనుభవం అందించిన సందేశమే సామెత అనవచ్చు.

భారతదేశంలో ఎన్నోరకాల విజ్ఞానాల గూర్చి ఎన్నో శాస్త్రాలు ఆవిర్భవించాయి. ఈ శాస్త్రాలకు సంబంధించిన విస్తృతార్థం చెప్పడానికి అందులోని విషయాలు సూత్రీకరింపబడతాయి. ఎన్నో శాస్త్రాలను సూత్రాల రూపంలో విస్తృతంగా అధ్యయనం చేస్తారు. అదేవిధంగా వ్యక్తుల అనుభవాలలోని సారాంశాన్ని గ్రహించేవి సామెతలని చెప్పవచ్చు. ఈ సామెతల వెనుక ఎంతో అనుభవముంటుంది. ఈ అనుభవాలే సూత్రాల రూపంలో వ్యక్తీకరింపబడితే అవి 'సామెతలు' గా భావించవచ్చు. అందుకే **'అనుభవమే శాస్త్రం - మాటలే మంత్రాలు'** అనే నానుడి సామెతకు బాగా వర్తిస్తుంది.

జనపదాలకు సంబంధించిన విజ్ఞాన వాఙ్మయాలే జానపదాలు. జనుల హృదయ కుహరాలలోనికి చేరిన అంశాలు వివేచించబడి జీవితానుభవపూరితమైన అభివ్యక్తులుగా బయటకు వస్తాయి. ఆ అభివ్యక్తి సమాజపరమైన భావనలను కూడగట్టు

కుంటుంది. దానిలోని విజ్ఞానార్థం ఒకరి నుండి మరొకరికి, ఒక తరం నుండి మరొక తరానికి ప్రసారమవుతుంది. ఈవిధంగా జానపద వాఙ్మయం, విజ్ఞానం నేడు సమాజంలో సుసంపన్నమైంది. జానపద వాఙ్మయం గేయ, వచన, దృశ్య శాఖలుగా విభజింపబడి నట్లుగానే జానపద విజ్ఞానం ఐదురకాలుగా విభజింపబడింది. సామెతలు, పొడుపుకతలు జానపద విజ్ఞానంలోని అంతర్భాగాలు.

జానపద విజ్ఞానం - 1. మౌఖిక సాహిత్యం 2. భౌతిక సంస్కృతి 3. జానపద సాంఘికాచారం 4. జానపద ప్రదర్శనకళలు 5. జానపదుల భాష అనే ఐదు భాగాలుగా విభజితమైంది.

పైవానిలో 'ముఖే ముఖే సరస్వతి' అన్న రీతిలో వెలుగొందింది జానపదుల మౌఖిక సాహిత్యం. వినూత్నాంశాలతో అవిచ్ఛిన్న పరంపరగా వివిధ రూపాలతో ఈ విజ్ఞానం ప్రవహిస్తూనే వుంటుంది. వీటిని ఆరు రకాలుగా వర్గీకరించవచ్చు. అవి 1. గేయం 2. కథాగేయం 3. గద్యకథనాలు 4. సామెత 5. పొడుపు కథ 6. జానపదుల భాష.

ఆర్వీయస్ సుందరం గారి జానపద సాహిత్య విభజనలో కథలతో కూడిన విషయాలను గ్రహించడం జరిగింది. సామెతలు కూడా వాటిలో అంతర్భాగాలు.

జానపద సాహిత్యం - 1. గేయం 2. కథాగేయం 3. కథ 4. సామెత 5. పొడుపుకథ అనే ఐదు భాగాలుగా అధ్యయనం చేయబడుతున్నది.

సామెతలు జానపద సాహిత్యంలోనూ, జానపద మౌఖిక విజ్ఞానంలోనూ ప్రముఖ పాత్ర వహిస్తున్నాయి. సామెతలు సంస్కృతికి ప్రతిబింబాలు. సంఘానికి సంస్కృతికి అవినాభావ సంబంధం వుంటుంది. సంఘంలోని వ్యక్తుల ఆచారవ్యవహారాలను సంస్కృతిలో భాగాలుగా చెప్పుకుంటాం. ఈ ఆచారాల వైజ్ఞానిక విశేషానుభవాల సమ్మేళనం సామెతల్లో కనిపిస్తుంది. ప్రసరింపజేసే దృష్టి ఆధారంగా విజ్ఞానం వృద్ధి అవుతూ అంతరాంతరాలను శోధిస్తుంది. జానపదులవిజ్ఞానంలో ఈవిధంగా



అధ్యయనం చేసే సామెతలకు ప్రత్యేక ప్రతిపత్తి ఉంది. అందుకే **"అనుభవాల వేర్ల ద్వారా ప్రపంచ జ్ఞానాన్ని గడించి సంస్కృతి అనే లతకు పూచిన పువ్వులే సామెతలు"** అని ఆర్వీయస్ సుందరం గారి అభిప్రాయం.

జానపదుల జీవితంలో సామెతలు నిర్వహించే పాత్ర అత్యంత ఉన్నతమైంది. జీవితాన్ని వడగట్టినట్లుండే అనుభవ వాక్యాలు సామెతలు. నిత్య జీవితంలో తాను చూసిన విషయాలు, చూస్తున్న విషయాలు వానిలోని అంతర్గత విశేషాలు, దాని ద్వారా పొందిన అనుభవాలు అన్నీ సామెతలుగా తర్వాతి తరాల వారికి శాస్త్రీయ విషయ జ్ఞానాలుగా అందించబడతాయి. తప్పు చేసినా, చేసిన తప్పు సరిదిద్దుకోవాలన్నా సామెతలను ఆశ్రయిస్తుండడం అలవాటే. ఇవి జానపదుల విద్యాభ్యాసంలో అంతర్భాగాలన్నా తప్పులేదు.

సామెతకు కొన్ని ప్రత్యేక లక్షణాలుండాలి. ఆ లక్షణాలు దాదాపుగా పాటిస్తూ ఒక జీవన సత్యాన్ని, కథలను, భావాలను వ్యక్తీకరించే విజ్ఞాన గుళికలు సామెతలు.

భాషాశాస్త్ర పరంగా సామెతల వర్గీకరణ ఈవిధంగా ఉంటుంది. 1. పూర్తి వాక్యాలు 2. విద్యావంతుల సంగ్రహవాక్యరూపాలైన సామెతలు 3. అనుప్రాసలు 4. అసంపూర్ణ వాక్యాలు 5. క్రియారహిత అసంపూర్ణ వాక్యాలు 6. ఉపమలు 7. ఉదాహృత వాక్యాలు 8. ఆధునికసరసోక్తులు. వస్తువును బట్టి పౌరాణికాలు, చారిత్రకాలు, సాంఘికాలనే విభజనలు కనిపిస్తాయి.

సామెతకు ఉండాల్సిన లక్షణాలను డా॥ కసిరెడ్డి గారు ఈ విధంగా చూపించారు. అవి 1. సంక్షిప్తత 2. ఉక్తి వైచిత్రి 3. గుప్తత 4. ఘటనా విశిష్ట నిక్షిప్తత 5. లయాత్మకత 6. ఆలంకారికత 7. అర్థనిగూఢత 8. అనుభవసారాత్మకత 9. వాస్తవికత 10. కథాత్మకత 11. అపార్థద్యోతకత.

ఈ లక్షణాలవల్ల సామెత సౌందర్యవంతమై గుర్తు పెట్టుకోవడానికి వీలుగా వుండి జానపదవిజ్ఞాన వ్యక్తీకరణకు సాధనమవుతుంది.

సామెతల్లో వస్తువును బట్టి చేసే వర్గీకరణలో ప్రకృతి, వస్తువులను గురించిన సామెతలను కూడా చేర్చవచ్చు. కొన్ని స్థల పురాణాలు. చివరకు ఈవిధంగా ఆలోచిస్తూ పోతే ఒక్కో సామెత ఒక్కో ప్రత్యేక విభాగంగా కనిపిస్తుంది. వీటిలో మానవ అనుభవ స్వభావాలకు సంబంధించిన సామెతలు పెద్ద విభాగం. ఇంకా వైజ్ఞానిక సంబంధ సామెతలు, వేదాంతపరమైన సామెతలు, కథల నీతులను తెలిపే సామెతలు, వేదాంత పరమైన సామెతలు, ఆలంకారికమైన (శబ్ద-అర్థాలంకారాలతో కూడిన) సామెతలు, ఇంకా ఇదేవిధంగా సామెతలను అధ్యయనం చేసే దృష్టికోణాల ఆధారంగా వర్గీకరించవచ్చు. సామెతలను గురించిన జ్ఞానం ప్రపంచమంతా ఒక్కటైనప్పటికీ అభివ్యక్తిలో భిన్నత్వం ఉంటుంది.

సామెతలను జనప్రియ సామెతలు, గ్రంథస్థ సామెతలు, నాగరీకుల సామెతలుగా వర్గీకరించారు. వీటిలో జనప్రియ సామెతలు ప్రజల్లో సహజంగా పుట్టేవి. మిగిలినవి కొంత ప్రయత్నపూర్వకంగా ఏర్పడినవి. వేమన పద్యాలలో మూడవపాదం సామెతలుగా చలామణీ అవుతున్నాయి. వివిధ కవులు సామెతలు, సూక్తులతో కూర్చిన పద్యాలు ఈ కోవలోకి చెందుతాయి. అయితే జానపద విజ్ఞానంలోని సామెతల విషయం అర్థం చేసుకోవాలంటే ఇటువంటి విషయాలు పూర్తిగా సహకరించేవిగా ఉండవు.

ఈ విషయాలనన్నింటినీ దృష్టిలో పెట్టుకుంటే సామెతను నిర్వచించాలంటే పుస్తకం చివర్లో చేయాలిగాని, ప్రారంభంలో కాదని ఎ.కె.రామానుజన్ చెప్పడంలో ఔచిత్యం అర్థమవుతుంది.

భారతీయ కౌటుంబిక జీవనం సమిష్టిగా ఉంటుంది. తల్లి, తండ్రి, భార్య, పిల్లలు అందరూ ఒకే దగ్గర జీవనం గడుపుతారు. వీరి సంబంధాలు కూడా అదేవిధంగా ఆత్మీయతానురాగాలతో కూడుకుని ఉంటాయి. అందుకే ఇంటిలో **'ఆడది లేకుంటే అడవి - మగాడు లేకుంటే మఠం'** వంటి సామెతలు వచ్చాయి. అంతేగాక తమకు తగిన వారితోనే వివాహం జరుగుతుందని భావం ఉంది. **'ఎంత చెట్టుకు అంతగాలి'**



అన్న వృక్షాలకు సంబంధించిన విషయం ఆలోచిస్తూ **'అంతకు తగిన గంత - గంతకు తగిన బొంత'** అంటూ నిత్య వ్యవహారంలోని వస్తువులు మరియు దాదాపు సమానమైన ఆర్థిక శారీరక స్థితులున్న భార్యాభర్తల కుటుంబాలను గూర్చి సామెతలు వచ్చాయి. వ్యతిరేకమైన కుటుంబ జీవనం కూడా జానపదులు వివిధ సామెతల్లో వివరించారు. **'పెళ్ళాం బెల్లం - తల్లి విషం'** అనేది మారిన వ్యక్తి ప్రవర్తనను గాని, తరాల అంతరాలను గాని సూచించడం తెలియజేస్తుంది. **'అన్నీ తెలిసినమ్మ అమావాస్యనాడు చస్తే ఏమీ తెలియనమ్మ ఏకాదశినాడు చచ్చిందట'** అనే సామెతల వల్ల జానపదులకున్న జ్యోతిష విజ్ఞాన సంబంధమైన అమావాస్య రోజు అశుభఫలమని, ఏకాదశి పర్వం శుభఫలమనే విషయాలు అర్థం చేసుకోవచ్చు. నిత్యజీవితంలో తాము చెప్పి ఆచరించనటువంటి వారిపైన ఈ సామెతను ప్రయోగిస్తారు. తాము ఏమీ తెలియని వారైనా తమ నమ్మకం ఆధారంగా శాస్త్రీయమైన రీతిలో తాము చేసే ప్రయత్నం ఫలవంతం చేసుకునే వారినుద్దేశంచి ఈ రకమైన సామెత వచ్చింది. అయితే దాన్ని వ్యక్తీకరించే పరిభాష అందరికీ తెలిసిన విషయమై ఉండాలి. జ్యోతిషపరిభాష అందరికీ అర్థమయ్యేదే. తిథులలో చేయదగిన మంచి చెడు పనులు అర్థం చేసుకుని అమావాస్య, ఏకాదశిలాంటి పద ప్రయోగాలు వారు చేసినారు.

**'గ్రహచారం చాలకపోతే వసుదేవుడు గాడిద కాళ్ళు పట్టుకున్నాడట'**. వసుదేవుడు గాడిద కాళ్ళు పట్టుకునే కథ, ఐతిహ్యం ప్రాచీనమైంది. ప్రాముఖ్యం కలిగి నటువంటిది. అయితే ఆ అత్యవసర స్థితి మనిషికి గ్రహాల సంబంధమైన కాంతిపై ఆధారపడి కూడా వస్తుందని అర్థం చేసుకున్నారు. ఈ గ్రహచారం జీవితానికి ఎంతో దగ్గర సంబంధం కలిగినటువంటిది. ఈవిధంగా పౌరాణిక సంబంధమై నిత్యజీవితంలో అనుభవిస్తూ వాటి పర్యవసానం జ్యోతిషమేనంటూ దాన్ని గూర్చి చెప్పే సామెతలు అనేకం కనిపిస్తున్నాయి.

**'కర్కాటకం చిందిస్తే కాటకముండదు'**, **'కృత్తికలో కుత్తిక పిసుకుడు'** వంటి సామెతలు కూడా వర్షసంబంధమైన విషయాలే. సూర్యుడు వివిధ రాశులలో, వివిధ

నక్షత్రాలలో ఉన్నపుడు కురిసే వానలను కొన్ని వందల సంవత్సరాలుగా గమనించి చివరగా వానిని సూత్రబద్ధం చేయడం జరిగింది. ఇవి పూర్తిగా వ్యవసాయసంబంధమైన సామెతలే. **'చిత్త ఎండకు పిట్టల తల పగులును'** అంటూ కాలసంబంధమైన విషయ సామెతలు వచ్చాయి. దీనిలో వాస్తు, శకునం వంటి అనేక అంశాలు సామెతలుగా కనిపిస్తున్నాయి.



# నమ్మకాలు పుట్టుపూర్వోత్తరాలు

నమ్మకాలు జానపదుల విజ్ఞానంలోని అంతర్భాగాలు. జానపద విజ్ఞానాంతర్భాగమైన జానపద సాంఘికాచారాల క్రింద ఈ అంశాలు పరిశోధనలో ఉన్నాయి. అవి 1. పుట్టుక, పెళ్లి, మరణం మొ॥గు వానికి సంబంధించిన ఆచారాలు 2. జానపదుల నమ్మకాలు 3. జానపదుల మతం, దేవతాగణం 4. నోములు, వ్రతాలు, జాతరలు, పండుగలు 5. ఆటలు, వినోదాలు 6. జానపద వైద్యం.

మానవజీవితంలో నమ్మకాలకుండే పాత్ర ప్రత్యేకరీతిలో గమనించదగినది. నమ్మకాలు మానవుని మనసునుండే పుడతాయి. నమ్మకం అనేది సంఘం నుండి మనిషికి సంక్రమించేది. వ్యక్తి పనులు జరిగిపోతుండడం గమనించాడు. ప్రకృతి సంబంధ వైపరిత్యాలను ఆపడం తనకు అసాధ్యమని తెలుసుకున్నాడు. దానికి అనుకూలంగా బ్రతకడం, ప్రకృతికి అనుగుణమైన విషయాల ద్వారా సమయాసమయాలు చూసుకొని లాభపడడం ఆరంభించాడు. సాధ్యమైనంతవరకు ముందు

రాబోయే స్థితి నుండి వ్యతిరేక ఫలాలు కల్గకుండా జాగ్రత్తపడడం ప్రారంభించాడు. ప్రయత్నపూర్వకంగా కూడా కొన్ని పనులు కాకపోవడం, కొద్ది ప్రయత్నంతో కొన్ని అవసరాలు తీరడం గమనించాడు. ఈ రకమైన అనుభవాల సమ్మేళనం నమ్మకంగా పరిణమించి జానపద విజ్ఞానంలో ప్రముఖమైన పాత్ర వహించింది.

ఏది మంచి, ఏది చెడూ అనే నిర్ణయానికి వ్యక్తి రాలేనపుడు 'అంతా దైవాధీనం' అనే భావానికి వస్తాడు. తనచుట్టూ ఏదో శక్తి ఉందనీ, దానివల్లనే ఈ సృష్టి క్రమం మొత్తం సాగుతుందనీ, దానిలో భాగంగా తన జీవితం నడుస్తుందనే విశ్వాసానికి వ్యక్తి చేరుతాడు. ఆ విశ్వాసాలే నమ్మకాలుగా పరిణమిస్తాయి. కొన్ని నమ్మకాలు మూఢవిశ్వాసాలుగా కూడా వుంటాయి. అనుభవాలలో ఆయా నమ్మకాలు సత్యఫలితాన్ని అందిస్తే వాటిని అంతే జాగ్రత్తగా తర్వాతి తరాల వారికి అందించడం జరుగుతుంది. ఒకవేళ నమ్మకం తాత్కాలిక ప్రయోజనం మాత్రమే చేకూర్చగలిగినా అది కూడా శాశ్వత ప్రయోజనాన్ని కలుగజేస్తాయన్న భావంతో ఆ నమ్మకాలు కూడా తరువాత తరాలకు అందజేయబడతాయి. అవి తాత్కాలిక ప్రయోజనం మాత్రమే కల్గించే వయినందువల్ల ప్రస్తుత కాల అధ్యయనానికి 'మూఢవిశ్వాసం' గా పరిణమిస్తుంది.

జీవితంలో ఒకానొకనాడు ఒకానొక పనిని అతి సులభంగా విజయవంతంగా చేయగలిగినపుడు వ్యక్తులు ఆ రోజు జరిగిన దిన కార్యక్రమాల విషయాల పట్టికను ఏర్పాటు చేసుకుంటారు. మళ్లీ ఏదైనా పనిచేయాలంటే ముందు విషయం ప్రకారంగా వస్త్రధారణ, పోయేదిశ, నమ్మేదైవం, చేసేపూజ అన్నింటినీ దృష్టిలో పెట్టుకుని అవన్నీ మళ్ళీ ఆచరిస్తారు. రెండవసారి, మూడవసారి కూడా అదేవిధంగా విజయవంతమైతే తన అనుభవాన్ని అందరికీ పంచుతారు. పదిమందికి అనుభవం పంచితే దానిలో నలుగు రైదుగురికి సత్యం కనిపిస్తే అది నమ్మకంగా ప్రచారమవుతుంది. అది చాలా మందికి సత్ఫలితం ఇస్తే నమ్మకంగా, విశ్వాసంగా, విజ్ఞానంగా మారుతుంది. ఆవిధంగా జరుగకపోతే 'మూఢ విశ్వాసం' అవుతుంది. ఈవిధంగా ఒకసారి ఏర్పడిన నమ్మకం సత్ఫలితాలనిచ్చినా దుష్పరిణామాలకు దారితీసినా తొలి అనుభవంలో ఇచ్చిన



సత్ఫలితాలనే మనసులో ఉంచుకొని ఆ నమ్మకాన్ని విశ్వసిస్తారు. అనాదిగా నమ్మకాలు మనకు సంక్రమిస్తూనే ఉన్నాయి. వీటిలో కొన్ని మనకు తెలియకుండా పుట్టుకతో ఏర్పడేవైతే కొన్ని ఆలోచనలకు అంతుపట్టకుండా ఉంటాయి. ఆలోచనా పరిధిలో నిలదొక్కుకుని అనుభవ పూర్వకంగా ఏర్పడే నమ్మశక్యమైన విశ్వాసాలు మరికొన్ని.... ఈవిధంగా పరిశీలిస్తూ పోతే మూఢవిశ్వాసాలన్నీ నమ్మకాలే గానీ, అన్ని నమ్మకాలు మూఢవిశ్వాసాలు కావు.

జానపదుల నమ్మకం దైనందిన జీవన సమస్యలను నివారించడానికి ఉపయోగించే విధానం. ఏదేని ఒక నమ్మకాన్ని ప్రబలంగా విశ్వసించడం వల్ల తన నడవడిపై అది ప్రభావం చూపుతుందని ఒకడు భావిస్తే అది మూఢవిశ్వాసమవుతుందని అంటారు కన్నడ జానపద పండితుడు శ్రీ వి.ఎ. వివేకరై.

**'పరస్పరం సంబంధం లేని వస్తువుల్లో, సంఘటనల్లో సంబంధం కల్పించి వాటికి కొన్ని కల్పిత పరిణామాలను ఆరోపించడం మూఢవిశ్వాసం'** అంటారు కన్నడ జానపద సాహిత్యవేత్త డా॥ ఎల్.ఆర్. హెగ్గడె (మూఢనబికెగళు -2)

**'ఒకవ్యక్తి జీవించే సమాజం పొందిన వైజ్ఞానిక పురోగతితో పొందిక కుదరదని, సహేతుకంగా లేని నమ్మకాలను ఆమోదించడమే మూఢవిశ్వాసం'** అని జి.ఎస్.మోహన్ నిర్వచనం.

**'మానసిక అనుభవాల పరిణామంగా తెలిసికాని, తెలియక కాని, ఉద్దేశ పూర్వకంగా గాని, ఉద్దేశ రహితంగా గాని, జనులలో ఏర్పడి పలువురిచే అంగీకరింపబడిన విశ్వాసమే నమ్మకం'** అని నమ్మకానికి జి.ఎస్. మోహన్ గారిచ్చిన నిర్వచనం సమంజసంగా వుంది.

నమ్మకాలను శాస్త్రీయ దృష్టితో అర్థం చేసుకుంటే మూఢవిశ్వాసాలని భావించే చాలావిషయాలకు కూడా ఛాయామాత్రమైన వైజ్ఞానిక విశేషం కనపడుతుంది. వివిధ శాస్త్రాల సంబంధ విషయాలు చాలా తెలిస్తే కాని ఈ నమ్మకాలకు ఒక రూపం ఇచ్చే అవకాశం ఉంటుంది.

'అశ్వత్థ ప్రదక్షిణం చేస్తే పిల్లలు పుడతారు' అనేది ప్రస్తుతం మూఢవిశ్వాసంగా పరిగణిస్తారు. రావి చెట్టుకున్న ఒక ప్రత్యేకమైన శక్తి ఉంది. దాని క్రింద పడుకోవడం, కూర్చోవడం, ప్రదక్షిణ చేయడం మొదలైన పనుల ద్వారా శరీరంలో నూతనమైన శక్తి ఏర్పడుతుంది. అది గర్భస్థ సంబంధమైన దోషాలను రోగాలను తొలగిస్తుంది. అయితే స్త్రీ గర్భసంబంధ దోషం వల్ల పిల్లలు కలుగకపోతే ఇటువంటి ప్రత్యేకమైన రోగాలనుండి విముక్తి పొంది ఆ తర్వాత పిల్లలు పుట్టే అవకాశం ఉంటుంది. ఈ విషయాలను 'ప్రాణిక్ హీలింగ్' వంటి ప్రాచీన వైద్యశాస్త్రగ్రంథాలు వివరించాయి.

అన్ని నమ్మకాలకు పూర్తిగా శాస్త్రీయాధారం చూపించలేకున్నా కొన్ని నమ్మకాలకు వివిధ శాస్త్రాల సంబంధంగా పూర్ణ ఆధారాలను చూపించవచ్చు. ఇటువంటి నమ్మకాలు ఎప్పుడు పుట్టాయో చెప్పడం చాలా కష్టం. మానవ మేధస్సు ఆలోచించే నాటినుండి, మానవుడు ప్రకృతిలో భాగమని అర్థం చేసుకున్నప్పటి నుండి నమ్మకమనేది కనపడుతుంది. ఇవి అత్యంత ప్రాచీన కాలం నుండి ఒకతరం నుండి మరొక తరానికి సంక్రమిస్తూ వస్తున్నాయనడానికి ఏమాత్రం సందేహం లేదు. మానవుని పుట్టుకతోనే కొన్ని నమ్మకాలు పుట్టాయేమో అనిపించినప్పటికీ సంఘంగా ఏర్పడిన తరువాతే నమ్మకాలకు బలం ఏర్పడి స్థిరత్వం కలిగింది.

శాస్త్రీయమైన నమ్మకం ఏర్పడడానికి ప్రత్యేక కారణాలు కనిపిస్తున్నాయి. ఒక శాస్త్రం ఒక కాలంలో సార్వకాలిక ప్రయోజనాన్ని ఆశించి ఒకానొక నియమాన్ని ఏర్పాటు చేస్తుంది. దానినే సూత్రమని గ్రాంథిక పరిభాషలో చెపుతారు. అయితే కొన్ని సూత్రాలు జనుల ప్రయోజనానికి సంబంధించినవి అతి త్వరగా జనబాహుళ్యంలో వ్యాపిస్తాయి. ఆ వ్యాపించిన శాస్త్రీయాంశం ఇకముందు పరిశీలించాల్సిన అవసరం లేనంతగా దాని ప్రయోజనం సమాజంలోని వారికి కనిపిస్తుంది. శాస్త్రీయమైన విషయం కూడా తనదైన పరిభాషలో జానపదుల్లో ప్రచారమవుతుంది. దానికి చిలువలు పలువలు ఏర్పడి దానిలో మార్పువస్తే సూత్రానికి కొంత విఘాతం కలుగుతుంది. లేకుంటే జానపదుల భాషలో అది అందరూ ఆచరించదగిన విషయమవుతుంది. ఆ విషయమే



తరువాతి తరాలవారికి అందజేయడం జరుగుతుంది. కాలక్రమంలో అది నమ్మకంగా, సంప్రదాయంగా మారుతుంది. దీనిని పాటించడం వల్ల వ్యక్తికి ఉత్తమమైన ఫలితమేగాని చెడు జరుగదు. అందువల్ల వాటిని అదేవిధంగా పాటిస్తూ వస్తారు. పై పూర్తి అంశం తెలిపేదేమిటంటే కొన్ని నమ్మకాలకు సూత్రాలు శాస్త్రీయంగా ఉంటాయని, వాటిలో తరువాత పరిశోధించాల్సిన అవసరం ఉండని విషయాలు విశ్వాసాలుగా, నమ్మకాలుగా ఏర్పడతాయని చెప్పవచ్చు. పూర్తిగా పరిశోధించిన శాస్త్రీయాంశాల వారసత్వమే నమ్మకంగా పరిణమిస్తుంది.

నమ్మకాలు సామాజికులలో ధర్మవర్తనకు, న్యాయబద్ధమైన జీవనానికి, లోకహితానికి, సత్కర్మల కొరకు ఏర్పడినవి కూడా ఉంటాయి. వీటిలో మతసంబంధమైన ఆచార సంప్రదాయాలు విశ్వాసాలుగా, నమ్మకాలుగా కనిపిస్తాయి. ఆ నమ్మకాలను అతిక్రమిస్తే తమకు అధికమైన కష్టాలు ఎదురౌతాయని ఎందరో భావించడం అన్ని ప్రాంతాల్లో, అన్ని భాషల్లో మనకు కనిపిస్తుంది.

యజ్ఞయాగాదులు, జాతరలు, వ్రతాలు, నోములు, పూజలు మొదలైన మత సంబంధ విశ్వాసాలు, సాంస్కృతిక కారణాలు నమ్మకాలకు హేతువులవుతాయి. కొన్ని స్థల పురాణాలకు సంబంధించినవి కూడా వుంటాయి.

ఈవిధంగా విభిన్నమైన దృక్పథాలు కలిగిన నమ్మకాల విభజన కూడా కొంత కష్టమే. ముఖ్యంగా వైజ్ఞానిక, అవైజ్ఞానికమనే రెండు స్థూల విభాగాలుగా నమ్మకాలను విభజించవచ్చు. ఆర్వీయస్ సుందరం గారు జానపదుల నమ్మకాలను వివిధ కోణాలనుండి గమనించి విభజించారు. వారి విభజనలో మానవాతీత శక్తులకు సంబంధించినవి, ప్రకృతిలోని ఇతర వస్తువులకు సంబంధించినవి, కుటుంబ సంబంధాలు, ప్రకీర్ణాలని చూపించారు. ఇవేకాక వైద్యసంబంధ నమ్మకాలు, పౌరాణిక మూలం గల నమ్మకాలు, ఐతిహ్యాత్మక నమ్మకాలు, నీతి సంబంధాలు ప్రత్యేకంగా పరిశీలించదగిన అంశాలుగా వారు గుర్తించారు.

ఆర్.ఎస్.బాగ్స్ తన వర్గీకరణలో జానపదుల నమ్మకాలను ఆరు విభాగాలుగా విభజించాడు. వానిలో 1. పురాణం (Mythology) 2. ఐతిహ్యం (Legend) 3. ఆచారం (Custom) 4. మాంత్రికత (Magic) 5. వైద్యం (Medicine) 6. కాలజ్ఞానం, దైవీకరణ (Prediction, Divinition) అనే ప్రత్యేక విభాగాలు కనపడతాయి. వీనిలో ఒక్కోదానిలో అనేక ఉపవిభాగాలున్నాయి. (Funk & Wagnalls Standard Dictionary of Folklore P. 1146)

Wayland D. Hand అనే అమెరికన్ శాస్త్రవేత్త తన వ్యాసంలో జనప్రియ నమ్మకాలను, మూఢ విశ్వాసాలను ఏడు రకాలుగా విభజించాడు.

1. మానవశరీరం మరియు జానపదవైద్యానికి సంబంధించినవి.
2. జీవిత చక్రానికి సంబంధించినవి (జననం, వివాహం, మరణం మొ॥నవి).
3. ఆర్థిక మరియు సామాజిక సంబంధాలు.
4. ఇంద్రజాలం మరియు మాంత్రికత.
5. భూత ప్రేతాలు, మరణాలు – వీనికి సంబంధించిన విజ్ఞానం.
6. సంఖ్యలు మరియు ఖగోళ సంబంధాలు.
7. వ్యవసాయ సంబంధాలు. (American Folklore P. 254)

Eric Maple మూఢవిశ్వాసాలను క్రింది విధంగా విభజించాడు.

1. ఇల్లు మరియు తోట.
2. పని మరియు ప్రయాణం.
3. కాలక్షేపం మరియు వినోదం.
4. వైభవంతో కూడిన ఊరేగింపు.
5. శరీరం మరియు వస్త్రాలు.
6. నాటు మాంత్రికత.
7. వేడుకలు మరియు ప్రజలు.
8. ఆధ్యాత్మిక శక్తులు. (Superstitions and Superstitions)



జానపద నమ్మకాలు పుట్టిన సందర్భాల ననుసరించి –

1. మత సంబంధాలు లేదా ధార్మిక సంబంధాలు లేదా అతిమానుష నమ్మకాలు.
2. సాంస్కృతిక సంబంధాలు.
3. వైయక్తిక సంబంధాలు అని శ్రీ బి.ఏ. వివేకరై విభజించారు.

విషయ ప్రాధాన్యంగా శ్రీ జి.ఎస్.మోహన్ నమ్మకాలను మూడు రకాలుగా వర్గీకరించారు. అవి –

1. ఆచార నియమాలు 2. శకునాలు 3. కేవల విశ్వాసాలు.

వీటిలో ఒక్కోదాన్ని స్పష్టంగా కార్యకారణ సంబంధాన్ని నిరూపించేవి, స్పష్టంగా కార్యకారణ సంబంధాన్ని నిరూపించనివి అని రెండు ఉపవిభాగాలుగా విభజించారు. ఆచార నియమాలలోని ఈ ఉపవిభాగాలను విధి, నిషేధమనే ఉపోప విభాగాలు గాను, శకునాలలోని విధి నిషేధ ఉపవిభాగాలను శుభ, అశుభ శకునాలనే ఉపోప విభాగాలుగాను విభజించారు. ఒక్కో విభాగంలో మానుష సంబంధాలు, అతి మానుష సంబంధాలు, ప్రాణి సంబంధాలు, వ్యవసాయ సంబంధాలు, సంకీర్ణాలుగా అధ్యయనం చేయవచ్చు. సంకీర్ణాలలో జ్యోతిషం, సాముద్రికం, సంఖ్యాశాస్త్రం, వాస్తు సంబంధం, జానపద వైద్యం, బల్లిపాటు, ప్రయాణం, స్వప్నం మొదలైన అంశాలన్నీ వుంటాయి.

నమ్మకాలు మానవజీవనంలో అణువణువునా నిండి సంప్రదాయంగా ఆచరింపబడుతూ వస్తున్నట్లు పై విభజనల ద్వారా అర్థం చేసుకోవచ్చు. ఈనాడు ఈ నమ్మకాలను 'సెంటిమెంట్లు' అనే మాటతో అందరూ విస్తృతంగా పాటిస్తున్న విషయం కూడా జానపద నమ్మకాలకున్న ప్రాధాన్యాన్ని ఋజువు చేస్తున్నాయి.

**'పంది కలలోకి వస్తే శని దశ ఆరంభమైనట్లు'**
**'కాకి మనిషిని తలమీద తంతే పట్టుకున్న శని వదిలి పోతుందట'**
**'కాకి మనిషిని తంతే స్నానం చేసి శనికి దీపం పెట్టాలట'**

ఇవన్నీ నమ్మకాలే. రాబోయే కష్టాలను సూచించే వస్తువులు, జీవులు సమాజానుగుణంగా, దేశానుగుణంగా మారుతూ ఉంటాయి. ఒక దేశంలో శుభ ఫలితాన్ని ఇస్తుందని గుర్తించిన విషయం మరో దేశంలో అశుభ ఫలితాన్నిస్తుందని గుర్తించడం జరుగుతుంది. ఏవైపు పరిశోధన సాగిస్తే దానికి సంబంధించిన ఫలితం వస్తుంది. ఈ విషయంలో శుభాశుభాలు గమనించేది వ్యక్తి మనస్సే గాని వస్తువులు, జీవులు కావు. నిత్యం బురదలో తిరిగే పందిపైన, అమేధ్యాన్ని తీసుకునే పందిపై మన ప్రాంతంవారికి ఏహ్యాభావముంటుంది. వ్యక్తి నీచత్వానికి దిగజారుతుంటే పంది వంటి దుస్థితికి వెళ్ళకుండా ప్రయత్నం చేయమంటారు. అది అంతశ్చేతనలో కనిపిస్తుంటే శని వంటి గ్రహాల సంబంధమైన పీడ మొదలవుతుందని భావించడం కద్దు. ఇటువంటివి సూచనలుగా స్వీకరించడం మంచిది. కాకి విషయంలో కూడా ఇటువంటిదే. జ్యోతిశ్శాస్త్రం ప్రకారం శని వాహనం కాకి. అది తన్నిపోవడం శని వెళ్ళిపోతే స్నానం చేయడం, పీడ పోయినట్లు భావించడం నేటికీ జరుగుతుంది.

**'కాలు పూర్తిగా కడుక్కోకపోతే శని పట్టుకుంటుంది'** అనే నమ్మకం శుచి, శుభ్రతను పెంపొందించేదిగా భావించవచ్చు. ఈసామెతకు తగినట్లుగా కాళ్ళు సరిగా కడుక్కోనప్పుడే శని ప్రవేశిస్తుంది. శనిగ్రహం యొక్క కాంతి ప్రభావం కొంత తీవ్రత్వానికి సంబంధించి నప్పటికీ **'శని పట్టుకుంది'** అనే భావం మాత్రం తర్వాతి రోజుల్లోనే వచ్చింది. శని పీడాకారభావం పూర్తి శాస్త్ర సమ్మతం కాదు. జానపదుల నమ్మకమే. ఈవిధంగా శాస్త్ర విషయాలలో 'అతి' భావనలు కూడా అక్కడక్కడా నమ్మకాలలో చోటు చేసుకున్నాయి.

**'శనివారం నాడు పట్టుకున్న వాన శనివారమే వదుల్తుందట'** - అనడం కూడా వర్షం ప్రారంభమైన దినాధిపతిని, అతని నెమ్మదైన గమనాన్ని దృష్టిలో పెట్టుకుని వచ్చిన నమ్మకం. ఇటువంటి విషయాలలో పూర్తి శాస్త్రీయత కనిపించక పోయినా వారి భావాలను వ్యక్తీకరించడానికి ఉపయోగించే పరిభాష జ్యోతిశ్శాస్త్ర పరిధిలోకి వచ్చింది. లోకంలో అందరికీ అర్థమయ్యే భాషలో వారి మాటలుండడం వాటన్నింటినీ



అర్థం చేసుకోగలిగే మాధ్యమం జ్యోతిషం కావడం వల్ల జ్యోతిష సంబంధమైన అనేక రకాల అంశాలు జానపదుల నమ్మకాలలో భాగాలైనాయి.

**'కాకి అరిస్తే చుట్టాలొస్తారు లేదా ఉత్తరం వస్తుంది.**

**' కాకి గంతేస్తే చుట్టాలొస్తారు'** అనే నమ్మకాలలో కేవలం భవిష్యత్తు ఊహలు మాత్రం కనిపిస్తున్నాయి. ఇవి శకున సంబంధాలు. శకునం మనసుకు సంబంధించింది. జ్యోతిశ్శాస్త్రంలో శకునం కూడా ఒక స్కంధంగా చిట్టచివర చేరింది. ప్రపంచంలోని అన్ని దేశాలలో శకునాలున్నాయి. వాటిని గుర్తించడంలో వ్యత్యాసముంటుంది. ఈ వ్యత్యాసం ప్రాంతపరమైన భౌతిక, సామాజిక వాతావరణాన్ని బట్టి వుంటుంది. ఏ విషయమైతే పరిశీలకులు నమ్ముతారో ఆ వైపు వారికి ఫలితాలు కనిపిస్తాయి. నమ్మని వైపు వ్యతిరేక ఫలితాలుంటాయి. కాలక్రమంలో అవి సూత్రబద్ధమౌతాయి. అవి నమ్మకాలుగా, సామెతలుగా వెలుగులోనికి వచ్చి తరతరాలుగా ఒకరినుండి మరొకరు అందుకోవడం జరుగుతుంది.

**'పౌర్ణమి రోజుల్లో రోగం తిరగబడుతుందట'** అనే నమ్మకం పూర్తి జ్యోతిష విజ్ఞానానికి నిదర్శనం. అయితే అన్ని రోగాలు ఇటువంటి స్థితిని పొందకున్నా రక్తం, హృదయంతో సంబంధమున్న రోగాలన్నీ ఈవిధంగా తిరగబెట్టే అవకాశాలుంటాయి. కారణం పౌర్ణమినాడు చంద్రుడు పూర్తి బలవంతుడు. నిండుబింబంతో కనిపిస్తాడు. మిగతా రోజుల్లో చంద్రుని ఆకర్షణకు, పౌర్ణమినాటి ఆకర్షణకు వ్యత్యాసం ఉంటుంది. భూమికి ఆరోజున ఒకవైపు సూర్యుడు, మరోవైపు చంద్రుడు 180 డిగ్రీల దూరంలో ఉండడం వల్ల ఆకర్షణ శక్తి రెండువైపుల నుండి అధికమౌతుంది. అందుకే ఆరోజున సముద్రంలో ఆటుపోటులు అధికంగా వచ్చి ఆకర్షణ ప్రత్యక్షంగా కనిపిస్తుంది. సముద్రంలో నీటిని ఆకర్షించిన విధంగానే మానవ శరీరంలోని రక్తం, నీరుపై చంద్రుని ప్రభావం అధికంగా ఉంటుంది. దానిద్వారా చంద్రుడు ఒక్కోరాశిలో సరియైన స్థానంలో ఉంటే మనసుకు ఆహ్లాదాన్ని, వ్యతిరేకమైన స్థానంలో ఉంటే ఉన్మాదాన్ని కలిగిస్తున్నాడు. రోగాలు కూడా మనసు సంబంధమైనవైతే అవి పౌర్ణమి, అమావాస్య రోజుల్లో

తిరగబెడ్తాయి. జ్యోతిశ్శాస్త్రరీత్యా చంద్రుడు మనోకారకుడు. 'చంద్రమా మనసో జాతః' అని వేదం చెబుతుంది. చంద్రుడు శరీరంలో నీటిని ఆకర్షించడం వల్ల అది వేగంగా ప్రవహిస్తుంది. హృదయం ఎక్కువగా పనిచేస్తుంది. ఈ రెండింటి ప్రభావం మనసుపైన పడుతుంది. ఆలోచనాసరళిలో ఎక్కువగ మార్పు కనిపిస్తుంది. ఉత్సాహ ఉద్రేకాలకు తావు ఏర్పడుతుంది. హృదయసంబంధ రోగాలు మళ్ళీ మళ్ళీ వచ్చే అవకాశాలు కూడా ఉంటాయి. జ్యోతిశ్శాస్త్రరీత్యా చంద్రుడు హృదయ కారకుడు. అమావాస్యనాడు కూడా సూర్యచంద్రులు భూమికి ఒకేవైపున ఉండడం వల్ల ఇద్దరి ఆకర్షణ శక్తి భూమిపైనున్న జీవులపై ఉంటుంది. **'అమాస ఆడవారికి పున్నమి పురుషునికి రోగం తిరగబెడ్తాయి'** అనేది నమ్మకం. రక్తసంబంధ దోషాలున్నప్పుడు అమావాస్యనాడు చంద్రుని నిర్బలత్వం, సూర్యునివద్ద అస్తంగతత్వం పొందడంవల్ల ఆడవాళ్ళకు ఎక్కువగా ఇబ్బందులు కలుగుతాయి. మానసికవ్యాధులకు పౌర్ణమి సమయాలలో పురుషులు ఎక్కువగా బాధ పడతారు. ఈవిధంగా జానపదుల నమ్మకాలలో కొన్నిచోట్ల పూర్తిగా, మరికొన్నిచోట్ల పాక్షికంగా, ఇంకొన్నిచోట్ల ఛాయామాత్రంగా జ్యోతిర్విజ్ఞానం కనిపిస్తుంది.



# పొడుపు కథలు నేపథ్యం

జానపదవిజ్ఞానంలో ప్రముఖమైన పాత్ర వహించేవి పొడుపుకథలు. మిగతా జానపద వైజ్ఞానిక విషయాలకన్నా పొడుపుకథల్లో వ్యక్తి పరిశీలనా దృష్టి, ఆ విషయాన్ని తనదైన భాషలో వ్యక్తీకరించడం, ఎదుటివారి మేధోశక్తిని పరిశీలించడం వీటి వల్ల సాధ్యమవుతుంది.

జానపదవిజ్ఞానంలోని మౌఖిక సాహిత్యంలో పొడుపుకథలు అంతర్భాగాలు. వినోదం, విజ్ఞానం రెంటినీ పంచి ఇచ్చే ప్రక్రియల్లో పొడుపుకథను మించింది లేదు. ఇవి నిత్యజీవితంలో భాగాలైనాయి. ఆర్వీయస్ సుందరం గారు జానపద సాహిత్యంలో పొడుపుకథ కూడా ఒకటిగా చేర్చారు. పొడుపుకథలు జానపదగేయ రూపంలో, కథాగేయరూపంలో, కథారూపంలో, సామెతల రూపంలో కూడా కనపడడం వల్ల ఈ రకమైన విభజన చేయడం జరిగింది.

పొడుపుకథలకు జీవితమే మూలధనం. అనేకరకాలైన నిత్యజీవిత సమస్యలను క్షణాల్లో విడగొట్టడానికి మనిషి యొక్క ప్రయత్నం వీటికి ప్రేరణనిస్తుంది. వ్యక్తుల బుద్ధికుశలతకు ఇవి తార్కాణాలు. అనేక రకాలైన విషయాలను చాతుర్యంతో, హాస్యంతో చెప్తూ సమస్యాపరిష్కారాలు చూపించేవిగా పొడుపుకథలు చెప్పబడతాయి. "ప్రత్యుత్తరం తెలియని వారి బుద్ధికుశలతను పరీక్షించడానికి, వారిని తికమక పెట్టడానికి తయారు చేసిన ప్రశ్నలు - పొడుపు కథలు" అన్నారు రోగర్ డి. అబ్రహమ్స్, అలన్‌డండస్ (Richard M. Darsan 1972 - 130)

**పొడుపుకథ నిజమైన అర్థాన్ని కప్పిపుచ్చేదిగా ఉండవచ్చు. ప్రశ్నరూపంలో ఉండవచ్చు. కాని ఇది జవాబును నేరుగా సూచించదు.** (The new popular Encyclopaedia - P. 112) పొడుపుకథలో ఒక వస్తువుకు సంబంధించిన ఆలంకారిక వివరణ, సాహిత్యవివరణ ఉంటాయి. అవి వినేవారిని తికమక పెట్టేవిధంగా ఉంటాయి - అని టేలర్ నిర్వచనం. పొడుపుకథ అర్థస్పష్టతలేని రూపకం లేదా రూపకసమాసం. (Encyclopaedia of Religion and Ethics - P. 765) అనడం పొడుపుకథ ఆలంకారిక గుణాన్ని తెలుపుతుంది. పొడుపుకథకు, రూపకానికీ ఉండే సంబంధాన్ని గుర్తించిన వారిలో మొదటివాడు అరిస్టాటిల్. పొడుపుకథలో ఉపమాన ఉపమేయాలనే రెండు భాగాలుంటాయి. ఉపమానం వాచ్యంగా, ఉపమేయం సూచ్యంగా ఉంటుంది. ఉపమానాల సహాయంతో ఉపమేయాన్ని తెలుసుకోవలసి ఉంటుంది. పొడుపుకథల్లోని ఉపమానాలు నిత్యజీవితంలో పరిచితమైనవై ఉంటాయి. కొన్ని కథలు అశ్లీలార్థక ద్యోతకాలౌతాయి. అది పదాల వరకే పరిమితం గాని, అర్థంలో కనిపించదు. వ్యంగ్యరీతి కూడా పొడుపుకథల్లో కనిపిస్తుంది.

బ్రిటానికా విజ్ఞాన సర్వస్వం **'పొడుపుకథలు బహుశః హాస్యగుణం కలిగిన ప్రక్రియల్లో చాలా ప్రాచీనమైనవి'** (Vol. XX - P. 649) అని చెపుతుంది. ప్రకృతితో సంబంధం కలిగి ఉండడం పొడుపుకథల ప్రత్యేకలక్షణం. ప్రకృతి, అందులోని వస్తువులు జానపదుల పొడుపుకథల్లో ఉపమానాలుగా, ఉపమేయాలుగా కనిపిస్తాయి. వీటిలో కూడా



సార్వజనీన గుణం కనపడుతుంది. **చాతుర్యంతో కూడిన, కళాత్మకమైన, లయబద్ధమైన సంక్షిప్త గూఢోక్తి పొడుపుకథ** అని ఆర్వీయస్ సుందరం గారి అభిప్రాయం.

అతి ప్రాచీనమైన ఋగ్వేదంలో, మహాభారతంలో యక్షప్రశ్నల రూపంలో పొడుపుకథలు కనిపిస్తున్నాయి. తెలుగులో పొడుపుకథలను వరంగల్, కరీంనగర్ ప్రాంతాలలో 'శాస్త్రం' అని కూడా అంటారు. శాస్త్ర రహస్యాలు విప్పి చెప్పడమంత కఠినమైనదీ పొడుపుకథ అనిపిస్తుంది. దీనికి ఒక సూత్రప్రాయమైన ముగింపు కూడా వుంటుంది. ఈ పొడుపుకథలకు వివిధభాషల్లో వేరు వేరు పేర్లున్నాయి. ప్రాంత భేదానుసారంగా తెలుగులో పర్యాయపదాలు కూడా ఉన్నాయి. అవి పొడుపుకథ, విడుపు, తట్టు, మారుతట్టు, మారుకథ, శాస్త్రాలు, సమస్యలు (సమిచ్చలు), చిటుకులు, చిట్కాలు, చిక్కుముళ్ళు, యక్షప్రశ్నలు, వేసే కథలు - విప్పేకథలు, అడ్డుకథ, ఒడ్డుకథ మొదలైనవి.

సంస్కృతం - ప్రహేళిక, ప్రవల్హిక, ప్రశ్న, ప్రత్యుత్తర కూడ, బ్రహ్మోవయ, వివాద, సమస్యాగూఢ, హృదయాలిక.

ప్రాకృతం - పహేలి, హిఅలిఆ.

కన్నడం - ఒగటు లేక వగటు, ఒంటు, ఒడగతె, ఒడకతె, ఒడ్డకతె, ఒగణు.

మళయాళం - ఖిడికర, కటకద, కటంకథ.

హిందీ - పహేలీ, బుజువల్, ఘర్‌ఘులైయా, ముకరియా.

మరాఠీ - ఉఖాణా, ఆహణా, ఉమణా, కోహడా, కులంగాదె, కోడే, బయాణా.

బెంగాలీ - పహేలీ, దాంధా, పియ్.

గుజరాతీ - ముఖాణో, ఉఖాల్‌చా, కొహియడో, అభియాణు, కోడు.

సింధి - ఉఖాణీ.

పంజాబీ - పహేలీ, భుజాత్.

బీహారి - బాహ, పహేలీ.

ఉర్దు - పహేలీ, ఛుట్‌కులే.

గురుబాలప్రబోధకారుని ప్రకారం అభిప్రాయాన్ని సూచించేది ప్రహేళిక. పొడుపుకథలకు కొన్ని ప్రత్యేకలక్షణాలుంటాయి. అవి సంక్షిప్తత, గూఢత, అపార్థ ద్యోతకత, కథాత్మకత, కథారహితాత్మకత, ప్రతీకాత్మకత, ఘటనావిశిష్టత, విధి నిషేధాత్మకత, లోకోక్తి రామణీయకత, రామణీయకత, చమత్కారచారుత, దృశ్యాత్మకత, ఆలంకారికత, సమస్యాత్మకత, రసాత్మకత, సాంప్రదాయికత, కవితాత్మకత అనేవి అష్టాదశ లక్షణాలు.

డా॥ కసిరెడ్డిగారు వీటిని 1. గృహజీవన ప్రహేళికలు 2. శ్రామికజన ప్రహేళికలు, 3. ప్రకృతి సంబంధ ప్రహేళికలు, 4. తిర్యక్ సంబంధి ప్రహేళికలు, 5. క్రీడా వినోద ప్రహేళికలు, 6. తాత్త్విక ప్రహేళికలు, 7. అస్పష్ట ప్రహేళికలు, 8. ఆత్మాశ్రయ ప్రహేళికలు, 9. శాస్త్రవిజ్ఞాన ప్రహేళికలు అని విభజన చేసినారు.

జానపదుల ఈ పొడుపుకథలు కేవల వినోదార్థమే కాక విజ్ఞానార్థంగా కూడా ఎంతగానో ఉపయోగపడతాయి. నూతనమైన ఆలోచనావిధానాన్ని కలిగిస్తాయి. ప్రయోజనాలు ఎన్నో ఉన్నాయి. అవి 1.లోకజ్ఞానం ఏర్పడడం 2. శాస్త్రవిషయ పరిజ్ఞానం 3. క్రీడాసక్తి 4. ఆలోచనాశక్తి 5. జ్ఞాపకశక్తి 6. వాచకశక్తి 7. సమన్వయశక్తి 8. జిజ్ఞాస 9. ఏకాగ్రత 10. విచిత్ర వాగ్వ్యవహారం 11. మానసికవికాసం 12. రహస్యగోపనం మొదలైనవి.

వ్యక్తి సమాజంలో ఎదుగుతున్నపుడు రావలసిన ప్రయోజనాలన్నీ పొడుపు కథల ద్వారా తెలుసుకుని అనుభవించడం జరుగుతుంది.

ఈ ప్రకృతిని మొదటి నుండీ పరిశీలిస్తున్న జానపదుల దృష్టిలో ప్రతివిషయం ఎదుటి వారి మేథోశక్తిని పరీక్షిస్తూ చెప్పడానికి ప్రయత్నం చేసింది. నిత్య జీవితంలో వాటికి సామ్యమైన ఉపమానాలను తీసుకుంటూ ఆ వస్తువును, జీవిని ఊహించమని ఎదుటి వారిని పొడుస్తుంటారు.



**'చాపచుట్టనూ లేము- చంకను బెట్టనూ లేము'**- అనే ప్రహేళిక ఆకాశాన్ని అరచేతిలో చూపించినట్లుగా కనిపిస్తుంది.

జ్యోతిశ్శాస్త్ర ఫలితాలను చెప్పేటపుడు ఆకాశంలో గ్రహస్థితి మొత్తం కూడా కుండలిలో వేసుకుంటారు. ఆకుండలి పూర్తి ఆకాశానికి, సౌరకుటుంబంలోని గ్రహవ్యవస్థకు నక్షత్రమండలాలకు సంకేతం. వానిలో పన్నెండు విభాగాలతో కూడిన చక్రం లాంటి నిర్మాణం. ఒక్కోవిభాగంలో ఏయే గ్రహం ఉందో వేస్తుంటారు. భూమిపైన నివసించే పరిశీలకుని పరంగా ఆకాశంలో ఉన్న గ్రహం ఏ నక్షత్రం వరుసలో కనిపిస్తుందో చూసి దానిని ఆ రాశిలో ఆ నక్షత్రమున్న ప్రదేశంలో వేస్తారు. ఫలితాలు చెప్పే విషయంలో భూకేంద్రకసిద్ధాంతాన్ని పాటిస్తారు. ఈ చక్రం కూడా పొడుపుకథల లాగానే కనిపిస్తుంది. కొండను అద్దంలో చూపించినట్లు సర్వ నక్షత్ర గ్రహ మార్గాన్ని చిన్న కుండలిలో చూపించగలగడం ఆశ్చర్యకరమైన విషయమే. జ్యోతిషసంబంధమైన మేథోశక్తికి ఇది ప్రతీకగా కనిపిస్తుంది.

| | | | |
|---|---|---|---|
| మీనం | మేషం | వృషభం | మిథున |
| కుంభం | రాశిచక్రం 360 డిగ్రీలు | | కర్కటక |
| మకరం | | | సింహ |
| ధనుస్సు | వృశ్చికం | తుల | కన్య |

ఈవిధంగా పొడుపు కథల్లో జానపదులు జ్యోతిష సంబంధ విషయాలలో కేవలం జ్యోతిస్సులు, వాటి ఉనికి గూర్చి మాత్రమే పొడుపుకథలు ఎక్కువగా ఉన్నాయి. ఫలిత జ్యోతిషం రూపు రేఖలు మార్చుకుని కనపడుతుంది.

# జానపదవిజ్ఞానం మనస్తత్వశాస్త్రం

జానపద విజ్ఞానంలో మనస్తత్వశాస్త్రానికి పెద్ద పీటవేయాలి. మంచి-చెడ్డ, పాపం-పుణ్యం, శుభం-అశుభం, ఇవన్నీ గుర్తించేది, ఆచరించేది, అనుసరించేది, మనస్సే. ఇటువంటి మనసు యొక్క ఆలోచనలు, పరిశీలనలు, పరిశోధనలు, విశ్లేషణలు, వివేచనలు, నూతనదృక్పథాలు, అన్నీ సామెతలు- పొడుపు కథలు, నమ్మకాలుగా కనపడుతున్నాయి. మనస్సే ఈశక్తి కలిగియుండక పోయినట్లయితే ఎంతో విజ్ఞానం మరుగున పడిపోయేది. ఒక్కొక్కరూ ఒక్కో విధమైన మనస్తత్వం కలిగి ఉంటారు. అందుకే **'లోకో భిన్నరుచిః'** అని ఆర్యోక్తి. **'జిహ్వకోరుచి, పుర్రెకో బుద్ధి'** అని తెలుగు సామెత చెపుతుంది.

జ్యోతిశ్శాస్త్రం ప్రకారం మనసు యొక్క స్థితి, ఆలోచన, ప్రవర్తనలను ప్రత్యేకంగా ఆవిష్కరించి చూపించవచ్చు. సూర్యునికాంతి జీవుల్లో చైతన్యం కలిగిస్తుంది. సూర్యకాంతికి పరవశింపని జీవి ఉండదు. ఈ కాంతిలో ఏడురకాల రంగులున్నట్లు ఇంద్రధనుస్సు ద్వారా తెలుస్తుంది. లేదా సూర్యకాంతికి పట్టకం ద్వారా పంపిస్తే



తెలుస్తుంది. మనం తీసుకునే ఆహారం వృక్షాలనుండి లభ్యమవుతుంది. దానికి కూడా సూర్యకాంతి అవసరం. సూర్యకాంతిని మొక్కలలోని పత్రహరితం గ్రహించి కిరణజన్య సంయోగక్రియ జరుపుతుంది. ఫలితంగా పిండి పదార్థాలు ఏర్పడతాయి. ఆవిధంగా ఏర్పడిన పూవులు, కాయలను, ఫలాలను, వ్రేళ్ల ను, ఆహార పదార్థాలుగా వినియోగిస్తాం. సూక్ష్మీకృతమైన కాంతి ఆహారరూపంలో శరీరంలోనికి చేరుతుంది. తీసుకున్న ఆహారాన్ని బట్టి శరీరంలోని వివిధాంగాల ప్రేరణ జరుగుతుంది. శారీరకమైన వివిధరోగాలను అధిగమించేందుకు వివిధ ఆహరపదార్థ గ్రహణం అవసరమని వైద్యశాస్త్రం చెపుతుంది. ఆహార మీ విధంగా జీర్ణమై శక్తిరూపంగా మారుతుంది. ఈ శక్తి ఉంటే మనసు ఒకరకంగా, శక్తి లేకుంటే మరో రకంగా పనిచేస్తుంది. మనసు ప్రేరేపణ శారీరకశక్తియే. శరీరానికి ఆహారం, యోగం ప్రేరేపణలు, ఆహారం సూర్యకాంతి ప్రభావమే. ఈ విధంగా ఆలోచిస్తే సూర్యకాంతి సూక్ష్మీకృతరూపమే మనసు. కాంతులశాస్త్రం ద్వారా గమనించగలిగే భూత భవిష్యద్విషయాలు, మనసు ద్వారా గుర్తించవచ్చు. మనసుకున్న ఈ విశిష్ట శక్తివల్ల ప్రకృతిలోని వివిధాంశాలను తాను గుర్తించగల్గి మంచి మార్గం వైపు వెళ్తూ ప్రమాదాలు లేని మార్గాలను ఎంచుకోవడానికి ప్రయత్నం చేస్తుంటాడు. జీవితాన్ని ఆనందమయం చేసుకోవాలనే ఆలోచనలో నిమగ్నమవుతాడు. తీసుకునే ఆహారం పరోక్షంగా 'మనసు'గామారి సాత్విక, రాజస, తామస ప్రవృత్తులు ఏర్పడుతున్నాయి. ఇవి మనఃప్రవృత్తులు. అందుకే ఆహారపదార్థాల నియంత్రణ వల్ల మనసులోనూ, అది గుర్తించే వివిధ శక్తుల విషయంలోనూ మార్పు వస్తుందని ఆయుర్వేద వైద్యుల అభిప్రాయం. విభిన్న మనస్తత్వాలు వేరువేరు వ్యక్తుల్లో కనిపించడానికి కారణాన్ని ఈవిధంగా శాస్త్రీయంగా చూపవచ్చు.

శంకరాచార్యులవారిని కుష్టువ్యాధిగ్రస్తుడు "అయ్యా! తమరు ఆనందాన్ని అందిస్తారని విన్నాను. ఇహలోకంలో సుఖమెరుగని నేను తమరందించే ఆనందం కోసం ఎదురుచూస్తున్నాను" అని అడిగితే – శంకరులవారు ప్రశ్నాత్మక ధోరణిలో జ్యోతిస్వరూపాన్ని వివరిస్తారు.

"కిం జ్యోతిస్తవ భానుమానహని మే రాత్రౌ ప్రదీపాదికం
స్యాదేవం రవిదీప దర్శన విధౌ కింజ్యోతి రాఖ్యాహిమే
చక్షుః తస్యనిమీలనాది సమయే కిం ధీః ధియోదర్శనే
కిం తత్రాహమతో భవాన్ పరమకం జ్యోతిః తదస్మి ప్రభో"

కిం జ్యోతిస్తవ? = నీకు కాంతి ఏమిటి?
భాను మానహనిమే = పగటివేళ సూర్యుడు
రాత్రౌ? = రాత్రివేళ?
ప్రదీపాదికం స్యాత్ = దీపాలు మొదలైనవి అవుతాయి
ఏవం రవి దీపదర్శన
విధే కిం జ్యోతిరాఖ్యాహిమే? = ఇలా సూర్యుని చూసే సమయంలో కాంతి గుర్తించడానికి ఉపకరించే కాంతి ఏమిటి?
చక్షుః = కన్నులనే కాంతి
తస్య నిమీలనాది సమయే? = కన్నులు మూసుకున్న సందర్భంలో కాంతిని దర్శించగల కాంతి ఏది?
ధీః = మనసు
ధియోదర్శనే? = మనసును దర్శించేదేది?
కింతత్రాహం = ఇంకేమున్నది నేనే
అతోభవాన్ పరమకం జ్యోతి = అందువల్ల నీవే శ్రేష్ఠమైన జ్యోతివి
తదస్మి ప్రభో = ప్రభూ! అది నేనే

ఈ సంభాషణలో సచ్చిదానంద స్వరూప కాంతి విశేషమే పరమాత్మ అన్న అంశం వ్యక్తమవుతుంది.

కాంతి స్వరూపమే మనసు. అదే అన్నింటినీ గుర్తించగల శక్తిని కలిగి ఉందని తెలుస్తుంది. ఈ కాంతి ప్రభావాలు వేరు వేరుగా ఉండడం వల్ల మనస్తత్వాలలో



భిన్నత్వం ఏర్పడుతుంది. ఆ మనసు గుర్తించే గ్రహించే అంశాలలో వ్యక్తి నుండి వ్యక్తికి మార్పు ఉంటుంది. మనుషుల సాంఘిక జీవితంలోని పలు సంఘటనలు, సన్నివేశాలు వివిధ సామెతలుగా, నమ్మకాలుగా మారినాయి.

వ్యక్తి, కుటుంబం, సమాజం సక్రమంగా నడవాలంటే సత్కర్మలు ఆచరించాలంటే కొన్ని కట్టుబాట్లుండాలని సామాజికశాస్త్రవేత్తలైన కొందరు దార్శనికులు నీతి నియమాలు రూపొందించినారు. ఇవి మనిషి స్వేచ్ఛా లైంగిక జీవనానికి అడ్డం పడి, వాంఛలు తీర్చుకోకుండా చేసినాయని అందువల్ల మనోవ్యథకు గురైన మనిషి ఆటలూ-పాటలూ-కళలుగా రూపొందాయని సిగ్మండ్ ఫ్రాయిడ్ భావించాడు. తీరని కోరికల కారణంగానే 'జానపదవిజ్ఞానం' ఆవిర్భవించిందని, అలా ఆవిర్భవించిన వాటిలో లైంగిక గుర్తులను ఆధారంగా చేసుకుని ప్రతి మనిషిలో చేతనంగా ఉన్న కోరిక చేతన స్థితిని పొందుతుందని, జానపద విజ్ఞానవేత్తలు పరిశోధనలు ప్రారంభించినారు. ప్రయోగాత్మకంగా అనేకాంశాలను నిరూపించినారు.

పురాణగాథల మీదనే ఈ పరిశోధనలు జరిగినా, ఇందులో వ్యక్తి స్వప్నాలకు కూడా అధిక ప్రాధాన్యమిస్తూ వచ్చారు. అచేతనం నుండి చేతనానికి రావడానికి కోరికకు అడ్డంగా సంఘం నీతినియమాలు నిలుస్తాయని, అప్పుడది తననే అణచబడుతుందని, ఆ అణచివేతను అధిగమించడం చేతగాక మరోరకంగా లైంగిక ప్రతీకలను సృష్టించుకోవడం జరిగిందని జానపద విజ్ఞానవేత్తలు అభిప్రాయపడ్డారు. ఈ అణచివేత స్థితినే సుప్త చేతనం లేదా ఉప చేతనం (sub-concious) అని అంటారు.

అచేతనం, ఉప(సుప్త) చేతనం, స్వప్నం మొదలైన అంశాలు ప్రధానంగా తీసుకుని జర్మన్, ఆస్ట్రియన్ మనోవిశ్లేషణ జానపద శాస్త్రవేత్తలు ఈవాదానికి బలం చేకూర్చినారు.

మనసుకు జ్యోతిశ్శాస్త్రరీత్యా ఇచ్చిన నిర్వచనం ఆధారంగా దాని స్థితిపరంగా ఆలోచిస్తే ఈ సూత్రాల ప్రాముఖ్యం కన్నా మనస్సుకు ఉన్న అత్యంత గొప్పనైన శక్తి అర్థమవుతుంది. అది గుర్తించలేని విషయం, ఊహించలేని విషయం ఉండవు. కేవలం

10 శాతం మాత్రమే మనశ్శక్తిని వినియోగించుకుంటున్నామని విజ్ఞుల అభిప్రాయం. ఆ మనసును పూర్తిగా వినియోగించుకోగలిగితే ఎన్నో అద్భుతాలు సృష్టించగలం. యోగశాస్త్రం ద్వారా ఈ అంతశ్చేతనలో వ్యర్థమైన పరంపరను ధ్యానం ద్వారా తొలగించి ప్రశాంతతను పొందవచ్చు. వేద ఋషుల ధ్యానం ప్రకృతిని సూక్ష్మాతిసూక్ష్మంగా పరిశీలించగలిగింది. ప్రశాంతతని మనసు పొందలేనపుడు ఫ్రాయిడ్ లాంటి వారి పరిశోధనలు సత్యమనిపిస్తాయి. మనసుపై నియంత్రణ ఉంటే కోరికలు దాగి ఉంటాయి. నియంత్రణ లోపిస్తే స్వేచ్ఛావిహంగంలా మారి సమాజానికి ఇబ్బందిని కలిగిస్తుంది. యోగశాస్త్రం ప్రకారం మనోలయం జరిగినపుడు జీవితం ఆనందాత్మకమవుతుంది.

జానపదుల సామెతలు, నమ్మకాలు, అన్నీ మనస్సంబంధ నియంత్రణకు సంబంధించినవే. ఆకాశంలోని గ్రహనక్షత్రాదుల కాంతుల ద్వారా ప్రేరేపింపబడిన మనసును తమకు అనుకూలంగా మలచుకోవడం ద్వారా అభివృద్ధిని, వ్యతిరేకమైతే బాధను పొందుతారు. మనసు గుర్తించగలిగే అంశాలు కేవలం లైంగిక సంబంధాలు మాత్రమే ఉండవు. ఎన్నోవిషయాల సమాహారాలను మనసు గుర్తించి ఆవిష్కరిస్తుంది. ఇవి ప్రతీకలుగా ఉంటాయి. స్వప్నంలో కనిపించే ఎన్నో అంశాలను భవిష్య సూచకాలుగా, మార్పుపొందే రీతిలో ప్రయత్నించి పరిశోధనలు చేస్తే ఎన్నో ఉపయోగకరమైన పనులు చేయవచ్చు. ఇబ్బందులనుండి తప్పించుకోవచ్చు. చివరగా కాంతి పరమలక్ష్యమైన ఆనందాన్ని పొందవచ్చు.

వివిధ మానవ స్వభావాలను వివరించు సామెతలు ఎన్నో ఉన్నాయి. 'చెప్పేవి **శ్రీరంగనీతులు- దూరేవి దొమ్మరి గుడిసెలు'** అని తాను అందరికీ మంచిని చెపుతూ తాను చెడ్డమార్గంలో వెళ్లేవాని పని. **అందరికీ శకునం చెప్పే బల్లి తాను పోయి కుడితి కుండలో పడ్డ** రీతిలో ఇది ఉంటుంది. ఈ బల్లి శకునం గుర్తించేది మనస్సే. మనసు వంకరగాఉంటే అదిప్రతి పనిలోను కనబడుతుంది.**'కుక్క తోక వంకర' 'కుక్క తోక గట్ట కుదురునా చక్కగా'** అని అందుకే అన్నారు. **'తాను వలచింది రంభ, తాను మునిగింది గంగ'** అంటూ మొండి పట్టు గలవారు **'తాపట్టిన కుందేటికి మూడేకాళ్లు'** అని వాదించేవారూ ఉన్నారు.



మనసుపై కాంతి ప్రభావం అధికం. వివిధ రకాల మనస్తత్వాలు ఏర్పడానికి కూడా తీసుకునే ఆహారం, నివసించే ప్రదేశం, చుట్టూ ఉన్న సామాజిక పరిస్థితులు కారణమవుతాయి. చంద్రుడు మనసును నియంత్రిస్తున్నాడు. ఒక్కోసారి అదుపు తప్పిస్తాడు. సూర్యుని వివిధ కాంతులు మనసులో వేరువేరు భావాలకు ప్రేరకాలవుతున్నాయి. కుజుడు కోపానికి, శుక్రుడు కామానికి, గురుడు నిర్భయత, విజ్ఞానం, లోకోపకారానికి, చంద్రుడు భయానికీ, ప్రేమకు, శని బద్ధకానికి, మొండితనానికి, బుధుడు లౌకిక వ్యవహారాలకు కారకులవుతున్నారు. ఈ మనస్థితులు వారివారి కాంతులు శరీరంపై పడడం వల్ల మారుతున్నవే. ఇవి కాక స్వప్నం, శకునం మొదలైన అంశాలలో శుభాశుభాలను మనసు గుర్తిస్తుంది.

మనసును అది సూచించే విషయాలను దృష్టిలో పెట్టుకొని సమాజానికి ఉపయోగపడే విధంగా ముందుకు సాగడం మనిషి కర్తవ్యం. భయపడుతూ ఉండడం, మనోదౌర్బల్యం గలవారి లక్షణం. ఈ వేరువేరు మనస్తత్వాలను జాతకం ద్వారా గుర్తించి సరియైన విధంగా దాన్ని ప్రేరేపించగలిగితే వ్యక్తికి సౌఖ్యం, ఆనందం కల్గి దానినుండి సమాజం పురోభివృద్ధిని ఆనందాన్ని పొందుతుంది.

# జానపదుల జ్యోతిర్విజ్ఞానం

జ్యోతి అంటే కాంతి. జ్యోతిష విజ్ఞానం కాంతి ఉన్న అన్ని ప్రదేశాలలో ఉంటుంది. ఆయా ప్రదేశాలలోని భౌగోళిక, ప్రాకృతికపరమైన తేడాల ననుసరించి వాటి ప్రభావాలలో మార్పులు కనపడుతుంటాయి. వాటిని అధ్యయనం చేస్తూ వచ్చిన సామెతలు మొదలైన విషయాలు పరిశీలించడానికి అనేక రకాల విశేషాలు తెలుసుకుని ఉండాలి. ఆయా ప్రాంతాలలోని వాతావరణం, భూగోళం, పెరిగేమొక్కలు, లభ్యమయ్యే నీరు, సూర్యుని వెలుతురు మొదలగు అన్ని విశేషాల సంపూర్ణ పరిశీలన ద్వారా జానపద సాహిత్య విశ్లేషణ సాధ్యమవుతుంది. దీనిలో ఏ విషయం పూర్తిగా తెలియకపోయినా విజ్ఞానంలో సంపూర్ణత్వం లోపిస్తుంది.

ఒక ప్రాంతంలోని వాతావరణ పరిస్థితుల ననుసరించి అక్కడి ఆచార వ్యవహారాలు, సంప్రదాయాలు ఉంటాయి. అవి పాటిస్తుంటే వాటి ఆచరణకు సంబంధించి ఇతరమైన ప్రభవాలననుసరించి సామెతలు చాలా వస్తుంటాయి. నమ్మకాలు పుడుతుంటాయి. పొడుపులు పొడవబడతాయి. రాత్రి- పగలు రోజూ వస్తుంటాయన్న



ఆలోచన ధ్రువప్రాంతంలో రాదు. కార్తెల్లో పంటలు విత్తుకునే అంశాలు ఎడారి ప్రాంతం వారికి తెలియవు. ఉష్ణ, సమశీతోష్ణ, శీతల మండలాలు, పర్వతప్రాంతాలు, సముద్ర గర్భ దీవులు ఇలా ఒక్కోప్రాంతంలోని శీతోష్ణస్థితి సూర్య సంచారాదుల వల్ల వారి నిత్యజీవితంలోని ఆచార వ్యవహారాలలో మార్పు కనిపిస్తుంది. సంఘ, సాంస్కృతిక జీవితాలలో మార్పు వస్తుంది.

నదులు ఎక్కడో పుడతాయి. ఎక్కడికో ప్రవహిస్తుంటాయి. మధ్యలో వాటికి ఆనకట్ట వేస్తాం. నీరంతా నిలిచి కనపడుతుంది. అక్కడినుండి పెద్ద కాలువలు త్రవ్వతాం. తూములు ఏర్పాటు చేస్తాం. చిన్న కాలువగా ప్రవహిస్తుంది. పంట కాలువ లేర్పడతాయి, బోదెలలోకి వెళ్తాయి. పంటలు పండుతాయి. జానపదుడైన వ్యావసాయికునికి పంట పండడమనే విషయం మాత్రమే అవసరం కాని అతనికి ఈ నీరు ఎక్కడినుండి వస్తుంది? దానికి సంబంధించిన సాంకేతిక విధానాలన్నీ అవసరం లేదు. తనవరకు తాను ఆలోచించుకుంటూ ఒక పరిధి వరకే ఉంటాడు. అదేవిధంగా విద్యలు ఒకచోట పుడతాయి. ఎన్నో శాఖలుగా మారుతాయి. ఉపశాఖలవుతాయి. కాలానుగుణంగా కనుక్కున్న నూతన విశేషాలు అందులో చేరుతాయి. వాటిలో తమ పరిధికి, తమ వ్యావసాయిక జీవనానికి లేదా వివిధ వృత్తులకు, వివిధ పశుపక్ష్యాదులకు, సంబంధించిన అంశాలు మాత్రమే తనకు అవసరంగా జానపదుడు భావిస్తాడు. అతనికి జ్యోతిషశాస్త్రంలోని విశేషాలు, సూర్య చంద్రుల్లోని మార్పులు, వివిధ గ్రహాల ప్రభావాలు తనమీద ఏవిధంగా ఉన్నాయి? నక్షత్రాల ఫలితాలు, భూమి ఆత్మ పరిభ్రమణాలు మొ॥న విశేషాలన్నీ అవసరం లేదు. తాను గమనించిన తన జీవనానికి అవసరమైన అన్ని విశేషాలు తన భాషలో జీవితంతో తులనాత్మకంగా పరిశీలించి తెలియజేస్తాడు. వెనుక నున్న శాస్త్రీయాంశాలు అర్థం చేసుకోవడం ద్వారా జానపదుల విజ్ఞానానికి, శాస్త్రీయమైన విజ్ఞానానికి మధ్య సంబంధం దొరుకుతుంది. ఈ పరిస్థితులనన్నింటినీ దృష్టిలో పెట్టుకుంటే వివిధ వ్యక్తుల మనస్తత్వాలు, వివిధ ప్రకృతులకు స్పందించే రీతులు అర్థమవుతాయి.

జ్యోతిష విజ్ఞానానికి సంబంధించిన సామెతలు నమ్మకాలు, పొడుపుకథలకు జన జీవితంలో వాటికున్న ప్రాధాన్యాన్ని అనుసరించి కొన్ని విభాగాలు చేసి అధ్యయనం చేయవచ్చు. అవి- 1. గృహ జీవనం 2. వ్యవసాయం జీవనం 3. వైద్యం 4. ప్రకృతి పశు పక్ష్యాది జంతువులు 5. పొడుపుకథలు- జ్యోతిర్విజ్ఞానం.

## 1. గృహ జీవనం :

జానపద గృహజీవనంలో కుటుంబంలోని వివిధ వ్యక్తుల మధ్య సంబంధాలు, వివాహాదులు, వివిధ కాలాలలో విధిగా నిర్వహించే కార్యక్రమాలు ఇల్లు, సఖ్యం కోపం, ప్రేమ మొదలైన గుణాలు, దానధర్మాలు అన్నీ ప్రత్యేకంగా కనిపిస్తాయి.

### 1. గృహం :

మనిషి దిగ్దేశకాలాలు గమనిస్తూ తనను ఇతరులనుండి రక్షించుకోవడం మొదలైనప్పటినుండి గృహావసరం ఏర్పడింది. వివిధ రకాలైన గృహాలు నిర్మించుకున్నాడు. ఇవి నిర్మించుకునేటప్పుడు ప్రకృతి ఆధారంగా నిర్మించాలి. సూర్యుని కిరణాలు ఇంటిలో పడాలి. వెలుతురు ధారాళంగా ఉండాలి. వివిధ అవసరాలు తీర్చుకోవడానికి అధికమైన శ్రమ లేకుండా ఉండాలి.

సూర్యునిచుట్టూ భూమి తిరుగుతుంది. భూమి తనచుట్టు తాను తిరుగుతుంది. ఈ రెండు అంశాలు పరిగణనలోనికి తీసుకొని వివిధ కాలాలలో ఆరోగ్యకరమైన గాలి, వెలుతురు ఇంటిలోనికి ప్రవేశించే విధంగా గృహాలు నిర్మించడం 'వాస్తుశాస్త్రం'గా మారింది. భూపరిజ్ఞానం కూడా ఇందుకు ఉపయోగపడుతుంది. భూమిని సూర్యకాంతులను ఆధారంగా చేసుకుని గృహనిర్మాణం వారి వారి ప్రాంతాలకు అనుకూలంగా చేసుకుంటారు. సమాజంలో జనం పెరుగుతున్న కొద్దీ నిర్దిష్టావసరాలు తీర్చుకోవడం కోసం గృహనిర్మాణం ఒకానొక పద్ధతిలోకి వచ్చింది. ఈ క్రమ విధానం అనుసరించేటపుడు తమ నామ నక్షత్రాలకు ఏ దిశ, ఏ మూలలు మంచివనే విషయాలను వాస్తుశాస్త్రం నిర్దేశిస్తుంది.



"పునాది వేయడానికి ముందు పూజ చేయాలి'

**"పునాదులు తవ్వేముందు నాగుపాము కనిపిస్తే మంచిదికాదు"** – ఇవి నమ్మకాలు. మొదటి ప్రయత్నం సుగమంగా ఉండాలనే భావంతోను, మానవప్రయత్నం కన్నా ప్రకృతి పరమైన రక్షణ, దైవానుగ్రహం ఉండాలని చేసే ప్రయత్నం కనపడుతుంది. అందుకే పునాదులు వేయడానికి ముందు పూజ చేస్తారు. పునాదులు తీస్తుంటే పాములు కనపడితే అక్కడ పుట్టలున్నాయని అర్థం. ఆ పుట్టలను తొలగించి తగు జాగ్రత్తలు తీసుకోకపోతే ఇల్లు మొత్తం కట్టిన తర్వాత క్రుంగిపోయే ప్రమాదం ఉంది.

**'ఇంటికి ఈశాన్యం వైపు పునాది వేయాలట'** అనే నమ్మకం ఉంది.

**"ఉత్తరపూర్వే కోణే కృత్వా పూజాం శిలాన్యసేత్ ప్రథమం।**
**శేషాః ప్రదక్షిణేన స్తంభాశ్చైవం సముద్ధాప్యాః ॥"**

ఉత్తర పూర్వకోణమంటే ఈశాన్యం. ఇటువైపు పూజచేసి శిలాన్యాసం చేయాలి. తరువాత ప్రదక్షిణక్రమంలో మిగిలిన శిలలను అమర్చి కట్టాలి. ఈవిధంగానే స్తంభాలను కూడా ప్రతిష్టించాలి అని బృహత్సంహిత వాస్తువిద్యాధ్యాయం 112వ శ్లోకంలో చెప్పబడింది. ఇది శాస్త్రోక్తమైన నమ్మకమే.

**"ఇండ్ల స్థలాలు దక్షిణ పడమరలు ఎత్తుగాను, ఉత్తరం తూర్పు దిక్కులు పల్లంగాను ఉన్నట్లయితే అందున్నవారికి గానీ, అది కలవాళ్లకు గానీ అనేక తరాల వరకు సంపదలు కలిగి ఉంటాయట"** –

భూమి పడమరనుండి తూర్పుకు తిరుగుతుంది. తూర్పువైపు ఇల్లు పల్లంగా ఉంటే ప్రకృతికి అనుగుణంగా, దేశంలో ప్రవహించే నదులకు అనుగుణంగా ఇంటి వాతావరణం ఉంటుంది. దానికి వ్యతిరేకమైతే అయస్కాంత వ్యతిరేక తరంగాల ప్రభావం ఇంటిపైన, ఇంట్లో నివసించే వ్యక్తులపైన ఉంటుంది. దీనిద్వారా మానసికంగా, శారీరకంగా ఇబ్బందులు కలుగుతుంటాయి. భూమి కొంత తన మార్గంలో వంగి

తిరగడం వల్ల ఈశాన్యం వైపు వంపు ఉన్నట్లు కనిపిస్తుంది. సూర్యకిరణాలు భూ-అయస్కాంత కిరణాల ప్రభావాలననుసరించి వాస్తుశాస్త్ర నిర్దేశాలు జరిగాయి.

**'కాలిన చెట్లు, ముండ్లు గల చెట్లు, ఫలవృక్షాలు ఇంటివద్ద ఉండరాదు'**– కాలిన వృక్షాలు ధననాశనాన్ని, ముండ్లు గల చెట్లు శత్రు భయాన్ని, ఫల వృక్షాలు ప్రజా నాశనాన్ని చేస్తాయట – మామూలుగా ఆలోచిస్తే కాలిన ముండ్లు గల వృక్షాలు ఇబ్బందులు కలుగజేస్తూ అన్నింటికీ అడ్డంగా ఉంటూ గృహంలోనివారిని ఇబ్బంది పెడతాయి. ఫలవృక్షాలుంటే వాటి కొరకు ఇతరులు రాళ్లు వేస్తే దానివల్ల కూడా ఇబ్బందులు ఎదుర్కొనే అవకాశం ఉంది.

ప్రశస్తమైన భూమి పుట్టలు, పనికిరాని ముళ్ల చెట్లు లేకుండా ఉండాలి. పుట్టలు లాంటివి ఉండకూడదు.

> **"శస్తౌషధి ద్రుమలతా మధురా సుగంధా**
> **స్నిగ్ధా సమాన సుషిరాచ మహీ నరాణామ్।**
> **అప్యధ్వని శ్రమ వినోద ముపాగతానాం**
> **ధత్తే శ్రియం కిముత శాశ్వత మందిరేషు॥"**

ఔషధ గుణాలు గల్గి, యజ్ఞ సమిధలుండే వృక్షాలు కూడుకుని తీగలు, మధురమైన వృక్షాలు, నిర్మలం, సమానం, ఛిద్రం లేనిది, మార్గం సుగమంగా ఉన్నటువంటి ప్రదేశంలో కొద్దిసేపు విశ్రమించినా ఆనందప్రదంగా ఉంటుంది. అటువంటి ప్రదేశంలో నిర్మించిన గృహంలో ఎల్లప్పటికీ సంతోషం, ధనం ఉంటాయని వరాహమిహిరుని బృహత్సంహిత వాస్తువిద్యాధ్యాయం 77వ శ్లోకంలో చెప్పబడింది.

ఇటువంటి ప్రదేశంలో ప్రకృతికి అనుకూలంగా ఉండడం వల్ల అన్ని పనులు శుభకరంగా జరుగుతాయని, జీవన వ్యవహారాలు సుగమంగా సాగుతాయని చెప్పబడింది.



**'గోవుల మందలుండే స్థలంలోనూ, స్మశానభూమి దగ్గర, ఉప్పునేలలోనూ ఇల్లు కట్టరాదట. అలాకడితే ఆ ఇంట్లో నివశించేవారు నశిస్తారట.** ఈ విషయం సాధారణంగా చెప్పవచ్చు. గోవులకు ఇబ్బంది కలిగించవద్దు. స్మశానభూమి, ఉప్పునేలల్లో ఇండ్లు క్రుంగిపోతాయి. స్మశానభూమి అయితే ఎముకలుంటాయి. ఇటువంటి ప్రభావాలు ఇంటిలోని వారి శారీరక, మానసికస్థితులపై పడకుండా మంచి ప్రదేశంలో ఇళ్లు నిర్మించాలి. దిక్కులు సరిగా చూసుకుని ఇళ్లు నిర్మించాలి. లేకుంటే ప్రకృతి తరంగాలు, శక్తి వ్యతిరేకమై కనపడతాయి.

**'దిక్కు లేనింటికి దిక్కుండదు'** అనే సామెత వాస్తుశాస్త్ర విషయాన్ని చెప్పేదే. విదిక్కులలో గాకుండా సరియైన దిక్కుల్లో ఇళ్లు నిర్మించడం వల్ల శుభమవుతుందని, ప్రకృతి శక్తి వినియోగమై జీవనవృద్ధికి పాటుపడుతుందని, తద్వ్యతిరేకమైతే ఆ గృహంలో కాపాడే దిక్కు కూడా ఉండదని సామెత చెపుతుంది. భగవంతుడు కూడా రక్షించలేడనే భావం కూడా వ్యక్తీకరింపబడుతుంది. **'దిక్కు లేని వారికి దేవుడే దిక్కు'**– ఈ దిశపదం చివరకు భగవంతుని గూర్చి చెప్పేదిగా కూడా మారిం దంటే జానపదుల్లో వాస్తుశాస్త్ర విజ్ఞానం అర్థం చేసుకోవచ్చు. **'దిక్కులేని యింట్లో దయ్యాలు కాపురం చేస్తాయట'** అనే నమ్మకం కూడా ఈ విషయాన్నే తెలియజేస్తుంది. ఇంటిలోని వివిధ మూలలలో వేరువేరు సౌకర్యాలు ఏర్పాటు చేసుకోవాలని వాస్తుశాస్త్ర నియమం. ఆయా మూలలకు అనుసరంగా దిక్పాలకులను నియమించారు. వారు ఉన్న తీరును బట్టి మన సౌకర్యం ఏర్పరుచుకుంటాం.

**"ఉత్తరపు ముఖంగా ఇల్లు కట్టకూడదు" "ఉత్తరపు వాకిలి ఊరకే ఇచ్చినా వద్దు"** అనే సామెతలు– నమ్మకాలు ఉన్నాయి. ఉత్తరం వైపు ద్వారముందంటే ఇల్లు దక్షిణం వైపు ఉన్నట్లు. దక్షిణస్థానం యమస్థానంగా నిర్ణయించబడింది. ఈ యమస్థానం అనే అర్థంలో వైజ్ఞానిక అంశాలు అనేకం ఉన్నాయి. సూర్యుని కిరణజాలం దక్షిణ దిశలో సరిగా ఉండదు. భూమి పడమర నుండి తూర్పు వైపుకు తిరుగుతూ కొద్ది ఉత్తరం వైపు వంగి ఉంటుంది. భూమి ఏవిధంగా ఉంటుందో భూమి చుట్టూ తిరిగే అయస్కాంత

తరంగాలు, అదేవిధంగా తిరుగుతుంటాయి. ఇల్లు కట్టుకుంటే ఈనియమాన్ని గుర్తుంచుకోవాలి. చేసే వివిధ పనులు ఈ తరంగానుకూలంగా ఉండాలి. దక్షిణం వైపు ఇల్లుండి ఉత్తరం పూర్తి వాకిలి ఉంటే కొన్ని ఇబ్బందులు ఎదురవుతాయి. అయితే వాస్తుశాస్త్రంలోని అ,క,చ,ట,త,ప,య,శ అనే వర్గులననుసరించి వేరు వేరు నామాక్షర వర్గుల వారికి వేరు వేరు దిక్కులు స్వస్థానాలౌతాయి. వాటిని ఐదవ స్థానాలు వ్యతిరేక స్థానాలు, శత్రుస్థానాలౌతాయి. వాటిని గుర్తిస్తూ ఉత్తరపు వాకిలి, దక్షిణ గృహ సంబంధమైన గృహాలు ఎవరికి సరిపోవో చూసుకొని వారు మాత్రం ఆ దిశలో వాకిలిని పెట్టుకోకపోవడం మంచిది. సరియైన విధంగా వాకిలిని పెట్టుకోని వారికి ఫలితం ఈవిధంగా ఉంటుంది.

"బధ బంధో రిపువృద్ధిః సుతధనలాభః సమస్తగుణ సంపత్
పుత్ర ధనాప్తి ర్వైరం సుతేన దోషాః స్త్రియాసైః స్వమ్॥"

మృత్యువు, బంధనం, శత్రువృద్ధి, సుతధనలాభం, సంపూర్ణశౌర్యం, గుణసంపత్తి, పుత్రుని నుండి ద్వేషం, స్త్రీ ద్వారా దోషం, నిర్ధనం ఒక్కోద్వారం తరువాత ఒక్కోభాగానికి ప్రాప్తిస్తాయి. వీటిలో వాస్తుపదవిన్యాసం ఆధారంగా మంచిభాగంచూసి ద్వారం నిర్ణయించాలి. లేకుంటే అన్ని విధాలా నాశనమవుతుందని శాస్త్రానుసారంగా చెప్పబడింది.

'ఇంటికి ఆగ్నేయ దిశలో బావి త్రవ్వరాదు'– ఆగ్నేయం అగ్ని సంబంధమైన విషయం. ఈ దిశలో అగ్నిస్థాపన చేయాలి గాని నీరు కోసం బావి త్రవ్వితే అది విషమవుతుందని భావన. అంతేగాదు 'బావి ఇంటికి ఈశాన్య దిశలో త్రవ్వితే మేలు' అనే నమ్మకం గూడా హేతువుగా ఉంది. ఆ మూలకు పడిననీరు కూడా ఈశాన్యం నుండి వెళ్లడం మంచిది.

ఇంటిలో పొయ్యి వేసుకోవడం పూర్వకాలపు గృహాల లక్షణం. 'కొత్త పొయ్యి ఉత్తర దిక్కు, తూర్పు దిక్కుల్లో వేయాలి' ఆగ్నేయం అగ్ని స్థానం కాబట్టి మూలకు క్రొత్తపొయ్యి వేయడం శుభదం.



'శని, కుజ, ఆదివారాలలో శుభ గ్రహ లగ్నాలలోను కొత్తగా పొయ్యి కట్టాలట. కర్కాటక లగ్నంలో కట్టకూడదట'.

శని, కుజ, ఆదివారాలు అశుభ గ్రహాధిపత్యం ఉన్న వారాలు. వేసే పొయ్యి మంటలు కూడా కక్కాలి గావున ఆ రోజుల్లో శుభగ్రహలగ్నాలపుడు కట్టడం వల్ల అగ్ని బాగా ఉండి అది సక్రమ వినియోగమవుతుంది. కర్కాటక లగ్నం జల లగ్నం. నీటికి సంబంధించిన పూర్ణ జలరాశిలో 'అగ్ని సంబంధమైన పొయ్యి కడితే ఫలితం బూడిదలో పోసిన పన్నీరవుతుంది'. ఈ విషయాలకు సంబంధించి సామెతలు ఏర్పడ్డాయి.

"పొయ్యిలు చెడ్డ దినంలో, పెండ్లిండ్లు మంచి దినంలో చేయాలి" "చెడ్డ రోజుల్లో పొయ్యి వేస్తే ఇంటికి బంధువులు అధికంగా రారట." పై విషయాలు ఒకదానికొకటి వ్యతిరేకంగా ఉన్నాయి. అయినా చెడ్డ రోజుల్లో పొయ్యి వెయ్యడం శాస్త్ర సమ్మతమే.

వాస్తుశాస్త్రం అనేక భాగాలుగా విభజింపబడింది. వాటిలో ఆలయ, గృహ, యంత్ర, శిల్ప(విగ్రహ) వాస్తు భాగాలు ముఖ్యమైనవి. వీటికి సంబంధించిన సామెతలు, నమ్మకాలు కనపడుతున్నాయి.

'శివుని గుడికి ముందు నూరు బారల దూరం లోపల, విష్ణుగుడికి ఇరవై బారలదూరంలోపల, శక్తి గుడికి ఇరువైపులా మిక్కిలి దూరంగాను ఇల్లు కట్టకూడదు. అలా కడితే ఇల్లు క్షీణిస్తుందట. సంపద పోతుందట'. అనేది నమ్మకం. వాస్తు శాస్త్ర, ధర్మశాస్త్రాలననుసరించి ఈ ధర్మం ఇదేవిధంగా పల్లెల్లో కొనసాగుతుంది. వివిధ ప్రత్యేక దేవతలు గల ఆలయాలకు వాస్తునిర్మాణ విధులు కొంత మారుతాయి. భగవంతునిపై భక్తి వంటి అంశాలు ఇందుకు కూడుతాయి. శివాలయానికి ఎదురుగానూ, విష్ణు ఆలయానికి వెనుకగానూ, శక్తి ఆలయాలకు ఇరువైపులా గృహాలు ఉండకూడదనేది నియమంగా ఏర్పరచారు. దేవాలయాలకు శిఖరాల నీడలు ఎంతదూరం వరకు విస్తరిస్తాయో అంతదూరం గృహనిర్మాణాలు పనికిరావని చెప్పబడింది. అంతదూరం

లోపలే గృహం నిర్మిస్తే సాధారణ భక్తబృందం యొక్క కార్యకలాపాలు, ప్రదక్షిణాదులు, ఆలయంలోని వేరు వేరు భాగాల నిర్మాణాలు సరియైన విధంగా ఉండవు. అందుకే ఇటువంటి నియమాలు బాగా ఏర్పడినాయి.

**'ఇంటికి వెన్నుపోటు, మనిషికి పైపోటు'** అనేది సామెత. ఇది ఫలితాంశానికి సంబంధించింది. ఇండ్లు ఒకక్రమంలో ఉండకుండా ఒకరింటి కప్పు వెన్ను మరో ఇంటి ద్వారాభిముఖంగా ఉండడం వెన్నుపోటు అవుతుంది. ఒకానొక క్రమంలో ఇండ్లు కట్టబడితే సరియైనవిధంగా ప్రకృతి తరంగాలు సహకరిస్తాయి. లేకుంటే అన్ని విధాలుగా ఇబ్బందులు ఎదురవుతాయి. రహదారులు కూడా ద్వారానికి అభిముఖంగా ఉండడం వైజ్ఞానికం కాదు. రవి కిరణ ప్రసారాలకు విఘాతం, రహదారి వల్ల అనేక ప్రమాదాలు ఏర్పడడం, ప్రకృతి తరంగాలు ఎటు సక్రమంగా వినియోగించుకోలేక పోవడం జరుగుతుంది. సరియైన ఇంటిలో లేనివారికి సరియైన ఆలోచనలు ఉండక నిత్యం బాధపడుతూ ఉంటాడు. అందుకే సరియైన గృహాన్ని నిర్మించుకోవాలని జానపదుడు అందరికీ తెలియజేసే తన శాస్త్ర అనుభవసారం ఇటువంటి సామెతల్లో కనిపిస్తుంది.

**'ఇంటికి ఆడపిల్ల ముప్పు, దొడ్డికి వారసప్రం (ఏటవాలు వసారా) ముప్పు'**- ఆడపిల్లలు తమకు భారమైన రోజుల్లో వచ్చిన భావం ఈ సామెత రూపంలో వ్యక్తీకరించ బడింది. అదేవిధంగా-

**'ఇల్లు ఇందువారం, పొయ్యి బుధవారం కట్టాలట' 'గృహప్రవేశం నాడు ఇంటికి శాంతి చేయించాలట'** అనే భావం కూడా అందరూ ప్రస్తుతం తెలుసుకున్నదే. శాంతి ప్రక్రియలో అందరూ సామూహికంగా చేరడం, చేరే సమయం శుభ ముహూర్తం చూసుకుని ఆసమయంలో ప్రవేశించడం వల్ల జీవితం సఫలంగా ఉంటుందన్న జ్యోతిష భావన స్థిరంగా ఉంది. కొన్ని దృష్టిదోషాలు తొలగడానికి, కడుతున్న సమయంలో ఇంటిని ఆశ్రయించుకొని ఉన్న జీవజాలాలను చంపిన దోషాల నివారణకు ఆ యింట్లో భూతబలి జరగవలసిన అవసరం ఉంటుంది. భూతబలి అంటే అందరినీ పిలిచి



విందులు, భోజనాలు ఏర్పాటు చేయడమే. దానివల్ల శాంతి జరగడం, తరువాత ఆ యింట్లో నివసించే వారికి ఆనందం కలగడం జరుగుతాయి.

## 2. వివాహం :

గృహజీవనవ్యవస్థకు వివాహం మొదటిదిగా భావిస్తాం. ఇదో పవిత్రమైన బంధం. హైందవ ధర్మసూత్రాలలో విధింపబడిన షోడశసంస్కారాలలో వివాహం ఒకటి. ఇది అధిక ప్రాధాన్యం కలిగింది. సంఘ జీవనాన్ని క్రమబద్ధం చేస్తూ కుటుంబ ప్రయోజనదృష్టితో ఏర్పడింది. ఈ వివాహం మంచి ముహూర్తంలో జరగాలని జ్యోతిశ్శాస్త్రం తెలియ జేస్తుంది. ఈముహూర్తం అన్ని గ్రహాలు శుభఫలితాలను, మంచి కాంతులను ప్రసరించే సమయంలో ఉంటే అది పవిత్రమై ఆ సమయంలో జీవితాలను ఒకరితో మరొకరికి ముడి వేసుకున్న దంపతుల జీవితమంతా ఆనందంగా సాగుతుందని శాస్త్రం చెపుతుంది.

**'అదృష్టం చాలని ఆడుబిడ్డను, అక్కరలేని అల్లునికిచ్చి, అమావాస్య ఆదివారం నాటి అర్ధరాత్రి ఆరుద్రనక్షత్రాన అతి వైభవంగా వివాహం జరిపించినట్లు'** అనేది సామెత. వివాహం ఎన్ని అవలక్షణాలున్న ముహూర్తంలో జరుగుతుందో ఈ సామెత చెబుతుంది. తిథులలో అమావాస్య శుభకార్యక్రమాలన్నింటికీ నిషిద్ధం. ఆరోజు చంద్రుడు అస్తంగతుడైతే బలహీనుడవుతాడు. చంద్రుడు మనఃకారకుడు. శుక్లపక్షసప్తమినుండి బహుళసప్తమి వరకు చంద్రుడు పూర్ణ బలవంతుడు. అందుకే ఆ సమయంలో ముహూర్తం నిర్ణయిస్తారు. వారాలలో ఆదివారానికి అధిపతి సూర్యుడు. సూర్యుడు లోకమంతా మేలు చేసేవాడు అయినప్పటికీ జ్యోతిషం రీత్యా అశుభగ్రహాలలో ఒకడు. ఈ ఆదివారం అమావాస్య అర్ధరాత్రి సమయంలో క్షుద్రకర్మలపై ఆసక్తి కలిగినవారు ఆ సమయం వినియోగించుకుంటారని భూతవైద్యులు చెపుతుంటారు. ఆర్ద్ర రుద్ర నక్షత్రం. ఈ నక్షత్రంలో ఎటువంటి శుభకార్యాలు చేయరు. కుటుంబ జీవనవ్యవస్థలో తల్లి, తండ్రి చూసేవారు లేని ఒక కన్య స్థితి ఈ విధంగానే ఉంటుంది. ఆమెను వివాహం పేరుతో వదిలించుకొనేవారే ఉంటారు. అందుకే ఆమె అదృష్టం చాలనిదైనది.

ఆమెకు కాబోయే భర్త అక్కరలేని వాడైనాడు. **'గంతకు తగ్గ బొంత'** ను కట్టినా ముహూర్తం మంచిది చూడాలనే భావన ఉన్నా ఈరోజుల్లో ఆత్మీయులై కరువైనారు. కనీసం ముహూర్తం మంచిది చూడడం వల్లనైనా ఆ అమ్మాయి వైవాహిక జీవనం ఆనందంగా ఆత్మీయంగా సాగుతుంది.

**'ముహూర్తం మంచిదైతే ఎట్లా ముండమోసెరా'** అనేది సామెతగా మారింది. నిజానికి జ్యోతిశ్శాస్త్రంలో జాతకానికి ప్రాముఖ్యం అధికం. జాతకంలోని వివిధ దశలలో వ్యక్తుల ప్రయత్నాలు మొదలైనవి ఆధారం చేసుకొని జీవితాన్ని ఒక క్రమగతిలో నడిపిస్తే ఉత్తమమైన సమాజం ఏర్పడుతుంది. దీనిలోని ఒక భాగమే వివాహం. కాబోయే భర్తయొక్క లేదా భార్య యొక్క జాతకాదులలోని మనస్తత్వం, శారీరక తత్వాలు, ధనం, కుటుంబం, సంతానం, ఆధ్యాత్మికాది అన్ని అంశాలలో సమత్వాన్ని చూసుకొని వివాహం చేయాలి. ఇంకా ఇద్దరూ వివాహం చేసుకొనే ముహూర్తంలో ఉండే బలంవల్ల వారి దాంపత్యం బాగా సాగుతుంది. **'అయం ముహూర్తః సుముహూర్తో అస్తు'** అనే మంత్రోక్త విధానం ఈ విషయాన్నే తెలియజేస్తుంది. అయితే వారి వారి జాతకాలలోని అవయోగాలు, మరణయోగాలు తీవ్రంగా ఉంటే ముహూర్తాలు ఎక్కువగా అడ్డుపడలేకుండా ఉన్నాయి. జాతకాదుల్లోని అవయోగాలు కొన్ని ముహూర్తాలు మంచివి పెట్టడం ద్వారా తొలగించుకునే అవకాశం ఉన్నప్పటికీ బలీయమైన అవయోగాలు తొలగించలేము. ముహూర్తాలు మంచివి పెట్టినా వాటిని అనుసరించి సరియైన సమయాలకే వివాహం చేసుకొనేవారూ తక్కువై పోయారు. ఎక్కువ వివాహాలు చేసుకోవడం హైందవ సంప్రదాయం కాదు. ప్రస్తుతం అది నేరంకూడా. అందుకే **'మూడోపెళ్ళివాడికి ముహూర్తం కూడానా'** అనే భావం సామెతల్లో కనబడుతుంది.

**'యూనాది లగ్గానికి ఏనాడైతే నేమి?'** అని కొన్ని పనులను ప్రారంభించేటపుడు ఏదో ఒకసమయం తనకు కలిసి వస్తుందనే భావం అధికంగా ఉండి ముందుకు సాగిపోతుంటారు. యూనాదులు గిరిజనులు. వీరికీ జ్యోతిషజ్ఞానం ఉంది. వారు



సంచారజాతులు వారవడం వల్ల జ్యోతిష్కుణ్ని కలవడం మంచీ-చెడూ అడగడం వంటి సంప్రదాయాలకు దూరంగా ఉంటారు. అయితే సూర్యుడు కచ్చితంగా నడినెత్తిమీదికి వచ్చినపుడు వారు నేలమీద నిట్టనిలువుగా ఒక గడ్డపార పాతుతారు. గడ్డపార నాడ దానిమీదికే ఉన్నప్పుడు వెంటనే ముహూర్తం జరిపిస్తారు. అభిజిన్ముహూర్త మని దీనినే అంటారు. ముహూర్తాన్నింటిలో దోషాలుంటే ఈ ముహూర్తాన్ని దైవజ్ఞులు సూచిస్తుంటారు.

**'సూర్యోదయానికి మాంగల్యధారణ, శుక్రోదయానికి మాంగల్యవిసర్జన'** అని పెళ్లైన కొద్దిరోజులకే విడిపోయినవారిని దృష్టిలో పెట్టుకొని వచ్చినసామెత. రాశులలో సూర్యునికి దాదాపు 60 డిగ్రీలకన్నా ఎక్కువ దూరంలో శుక్రుడుండడు. అందువల్ల శుక్రుడు తెల్లవారుఝామున 4-5 గంటల ప్రాంతంలో ఉదయిస్తాడు. అదికూడా సూర్యుడున్న రాశి కంటే ముందురాశుల్లో ఉంటేనే కనబడుతుంది. లేకుంటే అదికూడా కనిపించదు. ఒకవేళ సూర్యునికి వెనుక డిగ్రీల్లో ఉంటే సూర్యాస్తమయం కాగానే శుక్రుడు పశ్చిమాకాశంలో కనిపిస్తాడు. ఉదయం వివాహమై తెల్లవారుఝాముకల్లా విడిపోవడం లేదా సాయంకాలం కల్లా అభిప్రాయభేధం రావడమనే భావనే ఈ సామెతగా స్థిరపడింది. త్వరలో విడిపోయే జంటలను చూసి జ్యోతిజ్ఞులైన జానపదులు చెప్పిన సామెత ఇది. జ్యోతిషంలోని గ్రహాల ఉదయాస్తమయాలు ఈ సామెతలో చోటుచేసుకున్నాయి.

వివాహంలో చివరితంతుగా అరుంధతీ నక్షత్రాన్ని చూపిస్తారు. ఆకాశంలోని గ్రహ నక్షత్రాలను పరిశీలించగలిగి జీవితంలో వాటి సహాయంతో మంచి భవిష్యత్తును పొందుమని, ఆ సమయంలో ఇచ్చే దీవెన ఉంటుంది. **'పెళ్ళైన తర్వాత వధూవరులకు అరుంధతీ నక్షత్రాన్ని చూపించాలనేది'** నమ్మకంగా మారింది. ఈ నమ్మకం సూచించే విషయం ప్రస్తుతం జనజీవితంలో కనిపించడం లేదు. ఆకాశంలో సప్తర్షి మండలం ఉంటుంది.

"కశ్యపోఽత్రిభరద్వాజ విశ్వామిత్రోథ గౌతమ
వశిష్ఠ జమదగ్నిశ్చ సప్తైతే ఋషయ స్తథా"

అంటూ ఏడునక్షత్రాలకు ఋషుల పేర్లు పెట్టుకొని సప్తర్షిమండలంగా పిలుస్తున్నారు. భాద్రపదశుద్ధపంచమి నాడు ఈనక్షత్రాలలోని మొదటి రెండు సూర్యోదయానికి ముందుగా తూర్పు ఆకాశంలో ఉదయిస్తాయి. అందుకే ఆరోజున **'ఋషిపంచమి'** అని అంటారు. ఆ నక్షత్రాలలో వశిష్ఠ నక్షత్రం ప్రక్కనే మినుకుమినుకు మంటూ వస్తూపోయే చిన్న నక్షత్రం అరుంధతి. నూతన దంపతుల కంటిచూపుశక్తిని పరీక్షించే ప్రక్రియకూడా ఇది. **'చనిపోయేవారికి ఆరునెలల ముందు అరుంధతి కనబడదట'** అనే నమ్మకం కూడా ఉంది. దీనికి కారణం వయసు పెరిగి దృష్టిలోపం ఏర్పడుతుందనే కాని, ఇతర కారణాలేవీ కావు. **'అరుంధతీ, గిరుంధతీ కనబడ్డంలేదు గాని, ఆరువందల అప్పుమాత్రం కనబడుతుంది'** అనే సామెత పెండ్లి కుమారుడు వివాహార్థం పెట్టిన ఖర్చుకు బాధపడిన సమయంలో వచ్చినది.

### 3. అల్లుడు - భర్త :

వివాహం తర్వాత అల్లుడు ఇంట్లో నూతనవ్యక్తి అవుతాడు. సాంఘిక ధర్మాల ప్రకారం వరకట్నాలు తీసుకున్న అల్లుడు అత్తామామలను, భార్యను వేధిస్తున్న సందర్భాలు అధికమైనాయి. అందుకే అల్లుడు అనేవాడు వివిధకాలాలలో అప్పుడప్పుడు పీడాకారుడైన నవగ్రహాల సరసన చేసి వివాహానంతరం జీవితమున్నంతవరకు దశమగ్రహమైనాడు.

'జామాతా దశమగ్రహః' అని లోకోక్తి. అయితే అన్నీ ఉన్నా అల్లుని గొంతెమ్మ కోర్కెలు తీర్చలేక బాధపడేవారు కొందరైతే బీదస్థితిలో మరికొందరుంటారు. **'అంగట్లో అన్నీ ఉన్నా అల్లునినోట్లో శని ఉంది'** అని, **'అంగట్లో అష్టభాగ్యం-అల్లుని నోట్లో శనేశ్వరం'** అని శనిగ్రహ ప్రతీకగా అల్లుణ్ణి చెపుతారు. 'శని' గ్రహాలలోకెల్లా అతి నెమ్మదిగా తిరిగే గ్రహం. దీనిపైనుండి ప్రసారమయ్యే కాంతులు కూడా ఎక్కువశాతం శుభఫలితాలు ఇవ్వవు. శనిగ్రహానికి సంబంధించిన అశుభఫలితాలు పూర్వకాలంలోని



వారికంటె ప్రస్తుతకాలంలోని వారు అధికంగా భావిస్తున్నారు. క్రమక్రమంగా జానపదుల్లో, శిష్ట వ్యవహారంలో 'శని' చేరిపోయినాడు. నష్టాలు, కష్టాలు, ఆలస్యాలు, బాధలన్నింటికీ శని ప్రతీక. **'రామేశ్వరం పోయినా శనేశ్వరం తప్పలేదు'** వ్యక్తి జన్మరాశి అతని మనఃస్వభావాన్ని తెలియజేస్తుంది. జన్మరాశికి 12,1,2 స్థానాలలో శనిగ్రహం సంచారం చేస్తుంటే దానిని **'ఏలినాటిశని'** అని అంటారు. ఇది మొత్తం ఏడున్నర సంవత్సరాలు ఉంటుంది. ఈకాలంలో వ్యక్తి మానసికంగా అధికంగా బాధపడి, ఒక్కోసారి పూర్తి అవమానం ఇతర దీర్ఘరోగాలకు గురయ్యే అవకాశం ఉంటుంది. అందుకే **'ఎక్కడ ఉన్నా ఏలినాటిశని తప్పదు'** అనే సామెత వచ్చింది. **'శని పడితే ఏడేండ్లు నేను పడితే పద్నాలుగేండ్లు'** అనే సామెత అత్యంత ప్రమాదకరమైన వ్యక్తులు బెదిరించే మాటగా స్థిరపడింది. దీనిలో గ్రహసంచార సమయం ఏలినాటిశనికి సంబంధించిన జ్యోతిష పరిభాష ఉపయోగించడం వారి విజ్ఞానానికి నిదర్శనం.

వ్యక్తులలో బద్ధకం పెరిగితే పెద్దలు మందలించడం మనం గమనిస్తూనే ఉంటాం. వారిని శనితో పోలుస్తాం. **'శనేశ్వరానికి నిద్ర ఎక్కువ దరిద్రానికి ఆకలెక్కువ'** అనే తిట్టు సామెత కూడా సర్వ సాధారణంగా వింటుంటాం.

అత్తింటి కలిమి లేములు అల్లుడెరుగడు కదా! అందుకే **'అత్తకు లేక అటుకులు నాకుతుంటే అల్లుడొచ్చి దీపావళి పండగ'** అన్నాడట. ఇది బీద ఇంటి స్థితిగతులు చూపిస్తుంది. కొందరల్లుళ్ళు **'అత్త సొమ్ము అల్లుడు దానం చేసినట్లు'** ఖర్చు చేస్తుంటారు.

ఈవిధంగా జ్యోతిష పరిభాష జానపదుల నిత్య జీవనంలో వేరు వేరు అంశాలలో వ్యక్తమై కనపడుతుంది.

**'నవరత్నాలున్నా నర రత్నముండా'**లని ప్రతి స్త్రీ కోరుకుంటుంది. భారతీయ స్త్రీలు పతిని ప్రత్యక్ష దైవంగా భావించి కొలుస్తారు. "కార్యేషు దాసీ - కరణేషు మంత్రీ ....." లాగా భర్త సేవకు తన జీవితాన్ని అంకితం చేస్తుంది. తొమ్మిది రకాల రత్నాలు ఉన్నా లేకున్నా భర్త అనేవాడు రత్నం కన్నా అధిక గుణ సంపన్నుడై ఉండాలని సగటు

భారతీయ మహిళ కోరుకుంటుంది. 'నవ రత్నాలున్నా నారీ రత్నముందా'లని కూడా ప్రతి భర్తా కోరుకుంటాడు. ఏ గ్రహకాంతుల వల్ల శరీర మనః ప్రవృత్తుల్లో మార్పులు వస్తున్నాయని భావిస్తున్నామో ఆ కాంతుల దుష్ఫలితాలను అత్యంత సూక్ష్మమైన తేజోవంతమైన కిరణ సముదాయాన్ని కూడగట్టి అందజేసే రత్నాల ద్వారా తొలగించాలి. ఇది జ్యోతిర్వైద్యంలో భాగం. ముల్లును ముల్లుతోనే తీసే భావన దీనిలో కనబడుతుంది.

జ్యోతిశ్శాస్త్రంలోని సంహితా విభాగంలో ఈ రత్నధారణ ప్రత్యేకంగా చెప్పబడింది. వీనిలో వేరు వేరు గ్రహాల కాంతులను వెదజల్లగలిగే రత్నాలను మనవారు ప్రకృతినుండి, భూమినుండి గ్రహించి వాటిని శుద్ధి చేసి ధరిస్తున్నారు. వానిలో భాగంగా రవికి - కెంపు, చంద్రునికి - ముత్యం, కుజునికి - పగడం, బుధునికి - పచ్చ, గురునికి - పుష్యరాగం, శుక్రునికి - వజ్రం, శనికి - నీలం, రాహువుకు - గోమేధికం, కేతువుకు - వైడూర్యం అనే రత్నాలను సూచించారు. ఈ రత్నాలు ఆ యా గ్రహాల ప్రభావాలు శరీరంపై తక్కువగా ఉన్నట్లు భావించినపుడో, అనారోగ్యాలు కలుగుతున్నప్పుడో జ్యోతిష్కుని సలహాతో ఉత్తమమైన వానికి ఎన్నుకొని ధరించడం ఆరోగ్య, ఆనంద, అభివృద్ధి ప్రదాలవుతాయి.

రత్నధారణ అందంగా కూడా ఉంటుంది. తన భర్త ఈ రత్నాల కన్నా శ్రేష్ఠమైన వాడుగా ఉండి సకల వ్యతిరేక భావాలను తీసివేసి ఆనందసాగరంలో అనుక్షణం ఓలలాడాలని, తాను ఆ మాధుర్యంలో నిండిపోవాలని స్త్రీ కోరుకోవడంలో తప్పు లేదు. ఆవిధంగా పురుషుడు కూడా కోరుకుంటాడు.

తనకు మంచిమొగుడు దొరకని ఒక స్త్రీ **'దశకొద్దీ దొరికాడు. దిసమొల మొగుడు'** అంటూ బాధ పడింది. 'దశ' అనే భావం కూడా జ్యోతిషానికి సంబంధించిందే. జాతక గ్రహ చక్రంలో చంద్రుడున్నా నక్షత్ర పాదమాధారంగా దశలు నిర్ణయిస్తారు.

**"ఇన శశి కుజ రాహుర్జీవ మందజ్ఞః కేతుః**
**భృగు ఇతి నవానాం కృత్తికాది క్రమేణ"**



అంటూ కృత్తికా నక్షత్రం మొదలుగా వరుసలో రవి - చంద్ర - కుజ - రాహు - గురు - శని - బుధ - కేతు - శుక్ర దశలు **'వింశోత్తరీదశ'** ప్రకారంగా పరాశరుని గ్రంథంలో వివరించబడినాయి. వీని ప్రకారం జీవనం 120 సంవత్సరాలు. అందులో రవి - 6, చంద్రుడు - 10, కుజ - 7, రాహు - 18, గురు - 16, శని - 19, బుధ - 17, కేతు - 7, శుక్ర - 20 సంవత్సరాల దశాప్రమాణం కలిగి ఉన్నారు. వ్యక్తులు వారివారి రాశిచక్రాలలో ఉన్న గ్రహాల స్థితిగతుల ఆధారంగా ఆయా దశల శుభాశుభ ఫలితాలుంటాయి. ఈ కాలగణనలో మహాదశ - అంతర్దశ - విదశ - సూక్ష్మదశ - ప్రాణదశ అంటూ సూక్ష్మాతిసూక్ష్మంగా విభజిస్తూ ఫలితగణనం చేస్తుంటారు. వ్యక్తి యొక్క దశ బాగా లేనపుడు ఎటువంటి ఇబ్బందులు ఎదురౌతాయో ఆయా గ్రహాలను బట్టి, రాశిచక్రాన్ని బట్టి ఉంటుంది. ఇవన్నీ ఫలిత జ్యోతిష భావనలే. ఈ భావనలు అధికంగా ఉన్న జానపదులు తమ జీవితాలకు దశలను అన్వయించుకొన్నారు.

తమ దశ బాలేనపుడు అసమర్థుడైన భర్త దొరికినాడని బాధ పడడంలో ఆ స్త్రీ జ్యోతిష సంబంధమైన దశలనే భావాన్ని వ్యక్తీకరించింది. పూర్వజన్మలో చేసిన కర్మల ఆధారంగా ఈ జన్మలో కష్టసుఖాలు కలుగుతాయని, వాటి ప్రకారమే దశలుంటాయన్న భావనలు, విశ్వాసం జ్యోతిశ్శాస్త్ర - కర్మసిద్ధాంత సంబంధాన్ని తెలియజేస్తుంది. ఈ సిద్ధాంతం ఆధారంగానే కాలంపై ఆధారపడతారు. తమవల్ల కాని పనులన్నీ కాలానికి ముడిపెడతారు. **'కాలంతో కరువు లేదు - మగనితో దరిద్రం లేదు'** అనే సామెత ఈ సిద్ధాంతపరంగా పుట్టిందే.

**'దశకొద్దీ పురుషుడు - దానం కొద్దీ బిడ్డలు'** అని సామెత. తమకు సుఖజీవనం కలగాలంటే చిన్నప్పుడు తల్లితండ్రులు, యవ్వనంలో భర్త, వృద్ధాప్యంలో పిల్లలు సహకరించాలని భారతీయ మహిళ భావిస్తుంది. ఒక జన్మలో సత్కార్యాలు చేయడం వల్ల దానధర్మాలు చేయడం వల్ల తరువాతి జన్మలలో సుఖవంతమైన జీవితం గడపడానికి భర్త, పిల్లలు తోడుండాలి. దీనిపరంగా 'దశ' భావాన్ని ఈ సామెత తెలుపుతుంది.

## 4. అత్త - కోడలు :

అత్తా - కోడలు సంబంధాలు సమాజంలో అత్యధికంగా ప్రచారంలో ఉండి పేరెన్నిక గన్నాయి. **'కోడలు వచ్చిన వేళ - కోడెలు వచ్చిన వేళ', 'గొడ్డు వచ్చినవేళ - కొమ్ము వచ్చిన వేళ'** అంటూ నూతనంగా అత్తింట్లో అడుగుపెట్టే అమ్మాయిని ఉద్దేశించి అంటారు. ఈ వేళ అనే పదం కాలానికి సంబంధించిన విషయం. దీన్నే ముహూర్తంగా శాస్త్రపరిభాషలో చెపుతారు. ఒక్కో సమయంలో ఒక్కో వ్యక్తి తాను పొందాల్సిన కష్టనష్టాలను సమిష్టిగాను తాను ఎవరి మీదనైతే ఆధారపడి ఉంటాడో వారితో పంచుకోవాల్సి వస్తుంది. అందుకే వచ్చినవేళ మంచిదైతే సుఖాలు లేకుంటే కష్టాలు తప్పవని భావన. అదీ కాకుండా ఈ కాలంలో కూడా అమ్మాయితో సంబంధం కలుపుకోగానే తమ గ్రహచారం బాలేకున్నా దోషం మాత్రం అమ్మాయిదేనని నిందిస్తున్నారు. **'క్రొత్త కోడలు కెపుడు కత్తి సాము - కాపురంబున కత్తింట కాలుబెట్ట'** అనే విధంగా అత్తింటి కాపురం కత్తిమీద సాములాగా తయారయింది. అత్తింటికి వెళ్లడంతోనే మంచో - చెడో మొదలవుతుంది. అత్తా కోడళ్ల మధ్య 'మగడు' **'అడకత్తెరలో పోక'** లాగా నలిగిపోతాడు. చివరకు **'అత్తలేని కోడలుత్తమురాలు - కోడలు లేని అత్త గుణవంతురాలు'** అని నిర్ణయించినారు.

**'అత్త ఏలిన కోడలు-చిత్త పట్టిన వరి'** అని చిత్తకార్తెలో వర్షం పడగానే వరినాటితే పంట అధికంగా వస్తుందనే భావాన్ని అత్త దగ్గర మెలిగిన కోడలుతో పోల్చి చెప్పారు. **'ఆషాఢ మాసంలో కొత్తగా పెళ్ళైన స్త్రీ అత్తగారింట ఉండకూడదని, ఆషాఢ మాసంలో అత్తగారింటికి అల్లుడు పోకూడదు'** అనే నమ్మకాలున్నాయి. సూర్యుడు ఒక్కో రాశిలో నెలరోజులు ఉంటాడు. మేషం నుండి మీనం వరకున్న $360^0$ ఆకాశాన్ని 12 భాగాలుగా విభజించారు. ఒక్కోరాశి $30^0$ ఉంటుంది. భారతీయ జ్యోతిషశాస్త్రవేత్తలు ఈ రాశుల కనుగుణమైన పేర్లు పెట్టినారు. తూర్పున భూమి ఆకాశాలు కలుసుకున్నట్లు కనిపించే ప్రదేశమే ఆ ప్రాంతానికి లగ్నమవుతుంది. ఇది వేరువేరు ప్రాంతాలకు మారుతుంది. రాత్రిపూట నక్షత్రాల సమాహారం కనిపించిన విధంగానే పగటిపూటకూడా ఉంటుంది.



ఈ రాశులు ఒక్కొక్కటి సూర్యోదయ కాలంలో ఉదయిస్తున్నప్పుడు ప్రకృతిలో అనేక రకాల మార్పులు కనబడుతుంటాయి. ఈ మార్పులను ఆధారం చేసుకుని నక్షత్ర మండలాలను కలిపి పేర్లు పెట్టడం జరిగింది. వీటిలో మిథునం, కన్య, ధనుర్మాసాలు ప్రత్యేకమైనవి. సౌరమానంలో మిథునమాసం, చాంద్రమానంలో ఆషాఢమాస సమయంలో ఉంటుంది. చాంద్ర సౌరమానాలలో ముందు వెనుకలు కొంతసమయం ఉండడం వల్ల జ్యేష్ఠ, ఆషాఢాల మధ్యకాలంలో మిథునమాసమై పోతుంది. ఇంగ్లీషు నెలల ప్రకారం దాదాపు జూన్ 15 నుండి జులై 15 వరకు మిథునమాసం. శరీరంలో ఏదైనా ప్రత్యేకమైన మార్పు, ఆలోచనలు రావాలంటే ప్రకృతిసహకారం కూడా ఉండాలి. వసంతం, హేమంతం మనిషికి ఏవిధంగా ఆహ్లాదాన్ని కలిగిస్తున్నాయో అదేవిధంగా ఒక్కోరకమైన మనస్తత్వ ప్రేరణకు కాలం ఒక్కోవిధంగా ఉండాలి.

మిథునరాశి ఆకాశంలో ఉదయించినన్ని రోజులు శరీరంలో మైథునపరమైన ఆలోచనలు సక్రమంగా ఉంటాయి. అదే రాశిలో సూర్యుడు ప్రతిరోజు ఉదయిస్తుంటే రాశిప్రాధాన్యం తగ్గి అస్తంగత మవుతుంది. మైథునపరమైన ఆలోచనల్లో కూడా వక్రత ఏర్పడుతుంది. నూతనంగా వివాహమైన జంటలకు వారి కోరికలకనుసారంగా ఇది ప్రతిబంధకమవుతుంది. దాని ద్వారా శరీరాల్లో ఏవైనా జబ్బులు వచ్చే అవకాశాలుంటాయి. చాంద్రమానం ప్రకారం ఆషాఢం మిథునమాసానికి సమానమవడంవల్ల కొత్తగా పెళ్ళైన కోడళ్ళు, అల్లుళ్ళు అత్తవారిండ్లలో ఆషాఢమాసంలో ఉండకూడదని నియమం ఏర్పాటు చేశారు. ఇదే సమయంలో మిథునం ఉదయిస్తుండడంతో దానికి 180 డిగ్రీల దూరంలో ఉన్న ధనుస్సురాశి అస్తమిస్తుంది. మిథున ఉదయం, ధనురస్తమయం ఆ మాసం మొత్తం ఉంటుంది. ధనుస్సు మన్మథునికి ప్రతీక. శారీరకోద్రేకాలకు ఇది తోడ్పడుతుంది. మిథునభావనల సంబంధ రాశి సంధ్యాకాలంలో కనిపించడం వలన వీటిని శూన్య మాసాలుగా నిర్ణయించారు. కన్యామాసం కూడా వివాహాది కార్యాలకు నిషిద్ధం చేశారు. ఆకాశంలో నక్షత్ర మండలాలను కలుపుతూ భారతీయులు పెట్టిన పేర్లు ఈ విశేషాంశాలను తెలియజేస్తున్నాయి.

ఆషాఢంలో పెళ్ళిళ్ళు చేయరాదన్న నమ్మకం కూడా పై భావనలకు సంబంధించినదే. **'పెళ్ళైన మొదటి సంవత్సరం అత్తాకోడళ్ళు ఒకేవాకిలిలో తిరగరాదట'** అనే నమ్మకం ఉంది. ఇది భార్యాభర్తల మధ్య అతిప్రవర్తన ఉండకూడదని చేసిన నియమం. **'అతి సర్వత్ర వర్జయేత్'** అనేది ఆర్యోక్తి. ప్రస్తుత కాలంలో పూర్వపు శాస్త్రీయభావనకు స్వస్తి చెప్పి నూతనదంపతులు వేరే ఇల్లు తీసుకొని ఇష్టారాజ్యంగా ఉంటున్నారు. ఇది హర్షించదగిన విషయం కాదు. వారు సంయమనం పాటించడం మంచిదని కాలానుగుణంగా చెప్పవచ్చు.

**'ఆడపిల్ల నక్షత్రం ఆశ్లేషా నక్షత్రమైతే అత్తలేని వారింటికి పిల్లనిచ్చి పెళ్ళి చేయాలట'** అనేది ఒక నమ్మకం. మనకు భారతీయ జ్యోతిశ్శాస్త్రరీత్యా నక్షత్రాలు 27. వీటిని మూడుభాగాలుగా విభజించారు. ఒక్కోభాగంలో తొమ్మిది నక్షత్రాలుంటాయి. మొదటి వరుసలో తొమ్మిదవ నక్షత్రం - రెండవ వరుసలో మొదటి నక్షత్రం సంధులుగా ఉండడం వల్ల వీటిని గండాంత నక్షత్రాలన్నారు. వాటిలో ముఖ్యంగా ఆశ్లేష-మఖ, జ్యేష్ఠ-మూల, రేవతి-అశ్వినిలు ప్రత్యేకమైనవి. మిగిలిన నక్షత్రాలలో వాటివాటి దైవతాలకు సంబంధించిన విధంగా శుభాశుభాలు నిర్ణయించబడినాయి. ఈ నక్షత్రాలలో పుట్టుక కూడా దోషంగా భావించబడుతంది. ఆశ్లేషలో పుట్టినవారి మేనత్త లేదా వివాహమైన తర్వాత అత్తగారు మరణిస్తారని, అందువల్ల అత్తలేనింటికి ఇచ్చి పెళ్ళి చేస్తే అమ్మాయిపై అపవాదు రాదని భావించారు. నిజానికి ఈ భావన పూర్తిగా సమ్మతం కాదు. అది నమ్మకంగా స్థిరపడి ఉండవచ్చు. ఒక్కరిద్దరి విషయంలో ఇది జరిగి ఉండి అందరికీ అన్వయం చేయబడి ఉండవచ్చు. కాని అనుభవంలో పూర్తిగా సరిపోవడం లేదు. **'ఆడపిల్ల మూలా నక్షత్రంలో పుడితే మామలేనింటికి ఇచ్చి పెళ్ళి చేయాలనుకోవడం'** కూడా ఇటువంటి నమ్మకమే. మూల కూడా సంధి నక్షత్రాలలో ఒకటి. **'ఆడపిల్ల జ్యేష్ఠానక్షత్రమైతే జ్యేష్ఠునికే ఇచ్చి పెళ్ళిచేయాలనేది'** నమ్మకంగా స్థిరపడింది. జ్యేష్ఠ అన్ని నక్షత్రాలలోకి పెద్దది. దీనికి ఇంద్రుడు అధిదైవం. ఈ నక్షత్రంలో చంద్రుడున్నపుడు పుట్టిన వారికి తాము పెద్దవారమనే భావనలు, ఆధిపత్య భావనలు



ఉంటాయి. అటువంటి వారికి సరియైనవారు తోడుంటే మంచిదనే అభిప్రాయం నమ్మకంగా మారింది. జ్యేష్ఠ కూడా సంధి నక్షత్రాలలో ఒకటి కనుక దోషనక్షత్రంగా భావించబడుతుంది. దరిద్రానికి దేవతను ఏర్పాటు చేసుకొని జ్యేష్ఠాదేవి అని పిలుచుకోవడం జానపదులలో పరిపాటే. **'వివాహానికి త్రిజ్యేష్ఠలు కలువకూడ'**దనే నమ్మకం ఉంది. అబ్బాయి, అమ్మాయి ప్రథమసంతానాలైతే వారు జ్యేష్ఠులు. జ్యేష్ఠమాసంలో వివాహం చేయకూడదు. ఇవి త్రిజ్యేష్ఠలనిపించుకుంటాయి. ఇద్దరిదీ జ్యేష్ఠానక్షత్రమైతే జ్యేష్ఠమాసంలో వివాహం కూడదని మరికొందరి నమ్మకం.

**'వివాహమైన రోజు మొదలుకొని 6-8-12 మొదలైన సమదినాలలో కొత్తకోడలు అత్తవారింట ప్రవేశిస్తే ఐశ్వర్యం, ఆరోగ్యం కలుగుతుందట'** అనే నమ్మకం కూడా ఉంది.

> **"షష్ఠాదా సమవాసరే నవవధూ సద్మప్రవేశశ్శుభః**
> **స్యాదా షోడశ వాసరాత్పరిణయాత్పంచాంగశుద్ధిం వినా**
> **ఉద్వాహద్య సమాబ్ద ఏవ నియమస్త్వా పంచమాబ్దాత్తులా**
> **కన్యాకర్కట చాపగో ఝషనృయుక్కుంభా నిషేకే శుభాః"**

అనే కాలామృతం, 150వ శ్లోకం ఆధారంగా స్త్రీ అత్తవారింట ప్రవేశించే విషయం సూచించబడింది. ధర్మ సింధువులో కూడా ఈ విషయాన్ని గూర్చి విపులమైన వివరణ ఉంది.

### 5. పిల్లలు :

**'పుణ్యం కొద్దీ పురుషుడు, దానం కొద్దీ బిడ్డలు'** అని పూర్వజన్మలోని మంచి చెడులను బట్టి ఈ జన్మలో వాటికి తగిన ఫలితాలు వస్తాయని అనుభవపూర్వకంగా చెప్పిన మాటలు. ఆ పిల్లలు పుట్టడం కూడా వారివారి పూర్వజన్మల ఆధారంగా ఉంటుంది. ఈ విషయం కర్మసిద్ధాంతం-జ్యోతిశ్శాస్త్రం చెపుతున్నాయి. స్త్రీ గర్భంలో ఉన్నది ఆడపిల్లా, మగ పిల్లవాడా అన్న విషయం ఈనాటికీ ముందుగా తెలియని,

అంతుబట్టని విషయమే. స్కానింగ్‌లు ఎన్ని వచ్చినా అనుమానాలకు, అనారోగ్యాలకు హేతువులవుతున్నాయి. జ్యోతిష భావాల రీత్యా ఈ విషయాన్ని కొంతవరకు గణన చేసి చెప్పవచ్చు. సమాజ ధర్మాలాధారంగా చిట్టచివరకు ఒకరు పాప కావాలని మరికొందరు బాబు కావాలని కోరుకుంటారు. ఒక్క పాపకోసమో లేదా ఒక్క బాబు కోసమో ఎక్కువమందిని కనేవారున్నారు. పుట్టేవారు తప్పకుండా ఆడో మగో అయ్యుంటాడు. ఈ సందర్భంలో భవిష్యత్తు చెప్పడం సులభం. **'అయితే ఆడుబిడ్డ – లేకుంటే మగబిడ్డ'** చాలా చాకచక్యంగా తప్పించుకునే మాట ఇది. **'అయితే ఆదివారం– లేకుంటే సోమవారం'** కూడా ఇటువంటిదే. విద్యార్థులకు మల్టిపుల్ ఛాయిస్ లాంటి వీ విషయాలు.

స్త్రీ గర్భందాల్చినపుడు సీమంతం చేస్తారు. **'దుష్టగ్రహ నివారణకోసం గర్భిణీ స్త్రీలకు సీమంతం చేయాలి'** అనేది నమ్మకం. దీనికి కూడా కాలమానాలు సూచించబడినాయి. భారతీయుల జీవనక్రమంలో షోడశ సంస్కారాలకు ప్రాధాన్య మధికం. అందులో పుట్టుకనుండి మరణం వరకు నిర్వహించే పదహారు కర్మలుంటాయి. వీటిలో పురుషులకు చేసే కర్మలకు స్త్రీలకు చేసే కర్మలకు తేడాలున్నాయి. ఈ సీమంతం స్త్రీలకు సంబంధించిన విషయం. స్త్రీ గర్భం ధరించిన తర్వాత 5,7,9 మాసాలలో శుభ నక్షత్ర, శుభ వార, శుభ తిథులలో ఈ **'సీమంతోన్నయనం'** జరుపుతారు. దీని పరంగా వైదికకర్మలేవీ లేకున్నా ఈనాటికీ దీన్ని పెద్ద వేడుకగా జరుపుకుంటున్నారు. సీమంత సమయంలో గర్భిణి దంతపు దువ్వెనతో తలదువ్వి పాపట తీయడం ఆచారం. **'పాపట వంకరగా తీస్తే బ్రతుకు వంకరవుతుంద'**న్న విశ్వాసం కూడా ఉంది. అందుకే **'పాపిట వంకరైతే బతుకు వంకర'** అనే సామెత వచ్చింది.

పుట్టిన తర్వాత జాతకర్మ, నామకరణ, అన్నప్రాశన, చౌలం, ఉపనయనాది కర్మలు శాస్త్రోక్తంగా నిర్వహిస్తుంటారు. దీనిలో జాతకర్మ పిల్లవాడు పుట్టగానే చేసే కర్మ. ఆ తరువాత మిగిలినవి వరుసలో చేస్తుంటారు. వీటినే పంచదశకర్మలు అంటారు. ఈ కర్మలు జీవితంలో ఒక క్రమగతిని, పద్ధతిలో జీవించాల్సిన విధానం తెలియజేస్తాయి.



**"పుత్రేజాతు పితుస్నానం సచైలంతు విధీయతే**
**యావన్నచ్ఛిద్యతే నాళం తావన్నాప్నోతి సూతకం**
**ఛిన్నే నాళం తతఃపశ్చా త్సూతకంతు విధీయతే"**

అని ధర్మశాస్త్ర వచనం. ప్రస్తుత కాలంలో బిడ్డపుట్టిన తర్వాత మొదటి పదకొండు రోజులు 'పురుడు'(సూతకం) గా భావించే సంప్రదాయం మిగిలింది. పుట్టగానే సచేలస్నానం చేసే అలవాటు మాత్రం పోయింది. పుట్టిన తర్వాత 21వ రోజునుండి 30వ రోజు లోపల బేసిసంఖ్య రోజుల్లో నామకరణోత్సవం చేస్తారు. దీనినే బాలసారె (బారసాల) అని అంటున్నారు. పుట్టిన పిల్లవాని జన్మనక్షత్రం బాలారిష్టాల ఆధారంగా జపతపాలు, గ్రహశాంతులు చేయించే సంప్రదాయం ఉంది.

**'శిశువు నక్షత్రం మంచిది కాకపోతే మేనమామకు మంచిది కాదు. అందువల్ల బాణలిలో ఆముదం వేసి అందులో పసికందు ముఖాన్ని మేనమామకు చూపిస్తే ఆ దోషం పోతుంది'** అనే నమ్మకం ఉంది. శాంతికర్మ చేసే సందర్భంలో పిల్లవాని జన్మనక్షత్రానుసారం దోషం ఎవరికో నిర్ణయించి వారికి మొదటిసారి చూసేటపుడు మంచిముహూర్తంలో నూనెలో చూపించే సంప్రదాయం ఉంది. దీన్నే **'ముఖావలోకనం'** అని అంటారు. **'జాయాపత్యో శిశోశ్చ త్రయాణాం దోషనివారణార్థం'** అనే సంకల్పంతో ఈ కర్మ ఆచరిస్తారు.

నక్షత్రాలకు అధిదైవాలరీత్యా మంచిచెడులు ఉన్నాయి. వానిలో అశ్విని – అశ్వినులు, భరణి – యముడు, కృత్తిక – అగ్ని, రోహిణి – బ్రహ్మ, మృగశిర – చంద్రుడు, ఆరుద్ర – శివుడు, పునర్వసు – అదితి, పుష్యమి – గురువు, ఆశ్లేష – సర్పం, మఖ – పితరులు, పుబ్బ – భగుడు, ఉత్తర – అర్యమా, హస్త – సూర్యుడు, చిత్త – విశ్వకర్మ, స్వాతి – వాయువు, విశాఖ – ఇంద్రాగ్నులు, అనూరాధ – మిత్రుడు, జ్యేష్ఠ – ఇంద్రుడు, మూల – నిర్ఋతి, పూర్వాషాఢ – జలం, ఉత్తరాషాఢ – విశ్వేదేవ, అభిజిత్ – విధి, శ్రవణం – విష్ణువు, ధనిష్ట – వసువులు, శతభిషం – వరుణుడు, పూర్వాభాద్ర – అజచరణ, ఉత్తరాభాద్ర – అహిర్బుధ్న్య, రేవతి – ఉషా.

వీనిలో సంధి నక్షత్రాలైన ఆశ్లేషా - మఖలు, జ్యేష్ఠా - మూలలు, రేవతి - అశ్వినులు శాంతి చేయదగినవి. అదేవిధంగా యముడు వంటి అధిపతులున్న భరణీ నక్షత్రాలు శాంతి చేయదగినవి. ఆధిపత్యం ప్రకారం దోషులైతే శాంతికర్మలు ఆయా నక్షత్రాలలో పుట్టినవారికి చేయాలి.

జాతకంలో పుట్టుక సమయంలో వివిధ గ్రహాలున్న ప్రదేశాలననుసరించి బాలారిష్టాలుంటాయి.

"చంద్రాష్టమంచ ధరణీసుత సప్తమంచ
రాహూర్నవంచ శనిజన్మ గురుస్తృతీయే
అర్కస్తు పంచ భృగు షట్క బుధశ్చతుర్థే
కేతుర్వ్యయస్తు జనితో మరణాయ సద్యః"

పుట్టిన సమయంలో గ్రహస్థితులాధారంగా వేయబడేది కాబట్టి అది జాతకమైంది. (జ= పుట్టుక) జాతకంలో ఎనిమిదవ స్థానంలో చంద్రుడు, ఏడవస్థానంలో కుజుడు, తొమ్మిదవ స్థానంలో రాహువు, లగ్నంలో శని, మూడింట గురువు, ఐదింట రవి, ఆరింట శుక్రుడు, నాలుగింట బుధుడు, పన్నెండింట కేతువుండగా పుట్టినవాడు అరిష్టంతో మరణిస్తాడు. అన్ని గ్రహ అశుభస్థానాలు ప్రతీ జాతకంలో ఉండవు. ఒకటో, రెండో ఉంటుంటాయి. ఈ సందర్భాలలో ఆయా గ్రహాలకు సంబంధించిన శాంతి ప్రక్రియలు జరుపుతుంటారు. ఒక్కో గ్రహానికి ఒక్కో రకమైన వృక్షసమిధలతో హోమం చేయడం, మంత్రోచ్చారణ, దానాది ప్రక్రియల వల్ల మానసిక, శారీరక సంబంధ అనారోగ్యాలు తొలగిపోతాయి. ఇవి వైద్య ప్రక్రియలు. ఈరోజుల్లో వీటి ప్రయోగ పద్ధతులలో మార్పులు, స్వార్థాదులు కనబడుతున్నాయి.

నక్షత్రాల శుభాశుభ ఫలితాలు నమ్మకాలుగా సామెతలుగా కనపడుతున్నాయి. **'భరణిలో పుట్టినవారు ధరణినేలుతారట'** - ఇది దోషనక్షత్రమైనా ఈ నక్షత్రంలో పుట్టిన పురుషుడు విద్యావంతుడు, ఆరోగ్యవంతుడు, బుద్ధిమంతుడు, యధార్థం మాట్లాడువాడు,



దృఢమైన వ్రతం కలవాడు అవుతాడు. స్త్రీ పుడితే మిక్కిలి సుఖపడేది, హాస్యంగా మాట్లాడేది, తల్లిదండ్రులను పూజించేదవుతుంది. భరణి నక్షత్రం దశలప్రకారం శుక్రునిది. శుక్రుని ప్రభావం వ్యక్తిలో తక్కువశక్తి ఉన్నా దాన్ని బాగా వెలికి తీసి చూపిస్తుంది. అందువల్ల ఈ రకమైన సామెత వచ్చింది.

**'మూలా నక్షత్రంలో పుడితే మంచిది కాదని, జ్యేష్ఠా నక్షత్రంలో పుడితే శాంతి జరిపించాలని'** నమ్మకాలున్నాయి. ఇవి గండాంత నక్షత్రాలు. **'మూలా నక్షత్రంలో పిల్లవాడు పుడితే మూల పీకివేసుకుపోతాడు'** అనే సామెత ఇటువంటిదే. ఆ నక్షత్రంలో పుట్టుక జరిగితే, శాంతి జరిపితే దోషాలుండవని - ఎదుగుదల, అభివృద్ధి బాగా జరుగుతాయని నమ్మకాలుండడం శాస్త్రసమ్మతమైన విషయాలైనప్పటికీ కొన్ని సమాజపరమైన హేతువులు కూడా కనపడుతున్నాయి. వీటి ప్రభావం అందరిమీదా సమానంగా కనిపించకపోయినా ఇతర విషయాలలో లోపాలు ఉంటే ఇవి పెద్దవవుతాయి.

**'పుట్టబోయే శిశువులు బొగ్గిలు పేగును జందెంగా వేసుకొని పుడితే మేన మామకు కీడు. ఆ కారణంగా మేనమామ తొమ్మిదిరోజులు శిశువు వంక చూడకూడదట'** ఆ దోషం పోవడానికి శాంతి ప్రక్రియలు నిర్వహిస్తారు. ఈ శాంతిప్రక్రియలు సామాజికంగా కౌటుంబికవ్యవస్థను పటిష్టం చేయడంకోసం ఏర్పాటు చేయబడినవి. వీటిలో జ్యోతిషాంశాలు, శాస్త్రీయవివరణ కూడా ఉంది. మూలా నక్షత్రసంబంధంగా చంద్రహాసుని కథలవంటివి సుప్రసిద్ధాలు.

తిథులపరంగా వివిధరోజుల్లో పుట్టినవారి మనస్తత్వాలు కూడా జానపదుల సామెతలు, నమ్మకాలలో కనిపిస్తున్నాయి. సూర్యునికి చంద్రునికి మధ్య ఉన్న దూరాన్ని తిథి అని అంటారు. నంద, భద్ర, జయ, రిక్త, పూర్ణ అంటూ ఐదు రకాలుగా ఇవి ఉన్నాయి. **'అమావాస్యనాడు పుట్టిన పిల్లలు దొంగలవుతారట'** - అమావాస్యనాడు సూర్యచంద్రులు ఒకే డిగ్రీలో ఉంటారు. చంద్రునియొక్క మంచిఫలితం ఆ రోజు శూన్యమవుతుంది. అందువల్ల మనసు సంబంధమైన ఎదుగుదల మిగతా ఎన్నో

ప్రభావాలు తోడైతే తప్ప మనసు పరిణామం పొందదు. అమావాస్యనాడు పుట్టినవాడు తన స్వప్రయత్నం లేకుండా బతకడానికి ప్రయత్నం చేస్తాడని శాస్త్రోక్తం. సన్యాసులు, దొంగలు, రాజులు ఈ తిథిలో పుట్టినవాళ్ళై ఉంటారు. వారికి మనస్సంబంధమైన ఆలోచనలు అధికంగా ఉండవు. చంద్రుడు అమావాస్యనాడు అస్తంగతుడు. మనసుకు సంబంధించిన అంశాలు లోపిస్తే వ్యక్తి పోయేమార్గం ఈవిధంగానే ఉంటుంది. **'అమ్మాయి పుట్టింది అమావాస్య నాడు - అసలైన గజదొంగ అవుతుంది చూడు'** అనే సినిమాపాట కూడా ఈవిషయాన్ని నిర్ధారిస్తుంది.

**'పౌర్ణమిరోజు పుడితే మంచిబుద్ధి కలవారవుతారు'** అనే విషయం ప్రకారం చంద్రబలం అధికంగా ఉన్నపుడు పుట్టినవారి మనసు వృద్ధిపొందడం, మంచి బుద్ధి ఏర్పాటు కావటం జరుగుతుందని ఈ సామెత-జ్యోతిష ఫలితాంశాన్ని తెలియజేస్తుంది.

**'రోహిణీ నక్షత్రం మేనమామకు గండం', 'ఎనిమిదవ గర్భంలో మగపిల్లవాడు పుడితే మేనమామకు గండం'** అనే నమ్మకాలు అత్యధికంగా శ్రీకృష్ణుని నుండి ప్రచారంలోకి వచ్చినాయి. శ్రీకృష్ణునిది రోహిణీనక్షత్రం. అతడు ఎనిమిదవ గర్భంలో పుట్టినవాడు. కృష్ణకథ విస్తరించినప్పటినుండి ఈ నమ్మకానికి ప్రాధాన్యం పెరిగింది. నిజానికి అష్టమి తిథుల్లో జయతిథి కూడా. తదియ, అష్టమి, త్రయోదశులు జయతిథులు. కాని కృష్ణుడు పుట్టగానే అతన్ని చంపడానికి అనేకరకాల ప్రయత్నాలు జరగడం, పుట్టగానే వేరేవాళ్ళింట్లో పెరగవలసి రావడం, అనేకులు రాక్షసులను ఎదుర్కోవలసి రావడం వంటి భావాల వల్ల రోహిణీ నక్షత్రం, అష్టమీతిథులు ఇబ్బందికరాలైనవని గుర్తించడం జరిగింది.

**'ఆడపిల్ల శుక్రవారం పుడితే భాగవ్యంతురాలు'** అనే భావం కూడా పూర్తి ప్రాచీనమైనది కాదు. శుక్రవారానికి అధిదైవం లక్ష్మి. ఆరోజు పుడితే భాగ్యవంతురాలవుతుందన్న అంశం ఆధునికమైనదే. లక్ష్మీ (ధన) ప్రాధాన్యం అధికమైనప్పటి నుండి ఈ రకమైన అంశాలకు ప్రాధాన్యం పెరిగింది.



**'శిశువుకు నక్షత్రం ఆధారంగా పేరు పెట్టాలట - లేకుంటే బిడ్డ వృద్ధిలోకి రాదట'** అనే అంశం పూర్తి జ్యోతిశ్శాస్త్ర ఆధారమైంది. ఒక్కో నక్షత్రానికి నాలుగు పాదాలుంటాయి. ఆ పాదాలకు నామాక్షరాలుంటాయి. ఈవిధంగా 27+4=108 అక్షరాల ప్రారంభాలు ముహూర్తభాగంలో సూచించబడ్డాయి. చూ-చే-చో-ల = అశ్విని, లీ-లూ-లే-లో భరణి . . . . మొదలైనవి. పిల్లవాడు పుట్టింది ఏనక్షత్ర పాదమో చూసి దానిప్రకారం పేరు నిర్ణయించడం మంచిది. అధికంగా మననం చేయడం వల్ల మాటలే మంత్రాలు అవుతాయి. బాగా అనుభవంలోకి వస్తే అదే శాస్త్రమవుతుంది.

**'అనుభవమే శాస్త్రం మాటలే మంత్రాలు'** అనే భావన అందుకే వచ్చింది. ప్రస్తుతాంశంలో నక్షత్రపాదం సూచించిన అక్షరం ద్వారా పేరుపెట్టడంవల్ల జీవితంలో జరుగబోయే సంఘటనల సమతుల్యతను ఒకేసారి పరిశీలించడానికి హేతువవుతుంది. జన్మనక్షత్రమొకటి, నామనక్షత్రమొకటి ఉండడం వల్ల ఒకటి ఒక పనికి సహకరిస్తుందని ఉపక్రమిస్తే మరొకటి దానిని విఫలం చేస్తుంటే జీవితం అస్తవ్యస్తమవుతుంది. జానపదులు ఈ అంశాలు దృష్టిలో పెట్టుకొని వాటిని అనుసరించడానికి ప్రయత్నం చేస్తుంటారు.

## 6. శరీరం :

**'శరీరమాద్యం ఖలు ధర్మసాధనం'** అని ఆర్యోక్తి. సకల ధర్మసాధనలకు శరీరం సహకరించాలి. ఆ విధంగా లేకపోతే సత్కర్మలు, సమాజసేవలకు శరీరం ఉపయోగపడక పుట్టుక పరమార్థాన్ని కోల్పోతుంది. అయితే శరీరాన్ని రక్షించుకోవలసిన బాధ్యత, ఆరోగ్యంగా ఉంచుకోవాల్సిన విధి మనకున్నాయి. శరీరం ఏవిధంగాను మనం తయారు చేసేది కాదు. ఒక్కొక్కరూ ఒక్కోవిధంగా ఉంటారు. ఒక కన్నతల్లి పిల్లలకు ఎంతో వ్యత్యాసముంటుంది. కవలపిల్లల్లో కూడా గుర్తింపదగినన్ని తేడాలుంటాయి. వివిధ లగ్నాలు, అంశలు, షష్ట్యంశలలో తేడాలవల్ల ఈ మార్పులుంటున్నాయి. శరీరాన్ని దాని స్థితిగతులను ఆధారంగా చేసుకొని చెప్పే శాస్త్రం సాముద్రికం. ఈ సాముద్రికంలో హస్త, అంగ, తిలక, ముఖ, పశు అనే రీతులుగా విభజిస్తారు. జానపదుల్లోకి శాస్త్రీయమైన

అంశాలు అధికంగా ఉండే సాముద్రికాదులు తక్కువగా వచ్చాయి. కాని తిలక సంబంధమైన పుట్టుమచ్చల వివరం మాత్రం జానపదుల సామెతలలో అధికంగా కనిపిస్తున్నాయి. వివిధ ప్రదేశాలలో పుట్టుమచ్చలుండడం వేరువేరు ఫలితాలనిస్తుందని జానపదుల నమ్మకం. ఒకచోట పుట్టుమచ్చ ఉంటే రాజవుతాడని, మరోచోట ఉంటే దరిద్రుడౌతాడని నమ్ముతారు. మగవాళ్ళకు కుడివైపు, ఆడవాళ్ళకు ఎడమవైపు పుట్టుమచ్చ ఉండాలని వారు చెపుతారు. వీటన్నింటికి జ్యోతిష శాస్త్రాధారాలున్నాయి.

జనన కాలానికి ఏదో ఒక లగ్నం ఉదయిస్తుంటుంది. దీని పూర్తి ప్రమాణం 30 డిగ్రీలు ఉంటుంది. దీనిలో మూడవభాగాన్ని 'ద్రేక్కాణ'మని అంటారు. జాతకుడు ఏ ద్రేక్కాణంలో పుట్టాడో చూసి దాని ప్రకారం వివిధ శరీరభాగాల విభజన చేస్తారు. తరువాత ఆయా ప్రాంతాలలో మచ్చలు ఏర్పడే విధానం వివరిస్తారు. బృహత్పరాశర హోర తనుభావాధ్యాయంలో 15వ శ్లోకంలో ఈ వివరణ ఉంది.

"యస్మిన్వంగే స్థితః పాపః వ్రణం తత్ర సమాదిశేత్
నియతం స బుధైః క్రూరైః సైమ్యైః దా లక్ష్మవదోద్బుధః॥"

జననకాలంలో పాపగ్రహాలు ఏరాశుల్లో ఉంటాయో, ఆ రాశులకు ఏయే అంగాలు చెప్పబడినాయో ఆ అవయవాలపై వ్రణాలు, శస్త్రాలవల్ల ఏర్పడ్డ గుర్తులు ఉంటాయి. పాపగ్రహాలు బుధునితో చేరితే తప్పక వ్రణాల గుర్తులు శరీరంపై ఉంటాయి. శుభగ్రహాలున్న అంగాలలో పుట్టుమచ్చల వంటివి మాత్రం ఉంటాయి. వరాహమిహిరుడు బృహజ్జాతకం సూతికాధ్యాయం 25వ శ్లోకంలో ఈ విషయం వివరించాడు.

"తస్మిన్ పాపయుతే వ్రణః శుభయుతేచ లక్ష్మాదిశేత్
స్వర్‌క్షాంశ స్థిరసంయుతేచ సహజః స్యాదవ్యదాగంతుకః।
మందేऽశ్మానిలజోऽగ్ని శస్త్ర విషజో భౌమే బుధే భూభువః
సూర్యే కాష్ఠ చతుష్పదేన హిమగౌ శృంగ్యబ్జజోऽన్యై శ్శుభః॥"



ద్రేక్కాణవిభాగమాధారంగా ఏ ద్రేక్కాణంలో పాపగ్రహముంటుందో ఆ ప్రదేశంలో వ్రణముంటుంది. శుభగ్రహ యుతి, దృష్టులుంటే తిలకాది చిహ్నాలుంటాయి. ఆ గ్రహం స్వక్షేత్ర, స్వాంశ, స్థిరరాశులందుంటే జన్మంతోనే ఉంటాయి. కాకుంటే అవి జన్మించిన తరువాతి కాలంలో ఏర్పడతాయి. ఈ వ్రణగుర్తులకు శని కారకుడైతే రాళ్ళవల్ల, వాయువు వల్ల, కుజుడైతే – అగ్ని, శస్త్రం, విషాదుల వల్ల, బుధుడైతే – భూ సంబంధ హేతువుల వల్ల వ్రణ చిహ్నాలుంటాయి. సూర్యుడైతే కర్రలతో గాని, చతుష్పాద జీవులతో గాని, చంద్రుడైతే– కొమ్ములుగల ఆవులు, గేదెలు మొదలగు జంతువులవల్ల, జలచరాల వల్ల వ్రణాలుంటాయి. ఇతర శుభగ్రహాలైన పూర్ణచంద్ర, పాపయుతిలేని బుధ, గురు, శుక్రుల వల్ల సంభవించే గుర్తులు శరీర సౌష్ఠవంగా కాని అలంకార ప్రాయంగా కాని, అదృష్టసూచకాలుగా కాని ఉంటాయి. వ్రణాలు మొదలైన గుర్తులు సహజాలు, ఆగంతుకాలని రెండువిధాలు. ఈ విషయం తెలిసి ఆగంతుక వ్రణాలను ఆయాదశల కాలవిశేషాలను బట్టి పరిశీలించాలి.

వివిధగ్రహాల ప్రభావాల వల్ల పుట్టుమచ్చలు, వ్రణాల రంగులు ఉంటాయని కూడా నిర్ణయించినారు. ఇవన్నీ శాస్త్రసంబంధమైన ప్రమాణాలు. జానపదులకు ఈ శాస్త్రవిశేషాలు అవసరం లేవు. వారికి శరీరపరిశీలన వల్ల, శరీరంపై ఉండే వేరువేరు గుర్తుల వల్ల వ్యక్తులు పొందే యోగం గమనించగలరు. అత్యంత పూర్వకాలంలో వారి పరిశీలనలు, వారికి తెలిసిన జ్యోతిషాంశాలు రెండింటినీ మేళవించుకున్నారు. శరీరంలోని ఒకభాగంపై మచ్చ కనబడితే ఆ మచ్చ ఏర్పడడానికి అతని జాతకంలోని అంగ విభజనల ప్రకారం శుభగ్రహమో, అశుభగ్రహమో ఉండి ఉండాలి. అది మంచి కలుగజేసేదా? చెడు కలుగజేసేదా? అన్న ఆలోచన వచ్చిన తరువాత మాత్రమే ఫలితం తెలియజేస్తారు. ఈ విధంగా పుట్టుమచ్చలను అధ్యయనం చేయడానికి ఒక శాస్త్రం ఏర్పడింది.

పుట్టుమచ్చలు శరీరంలోని వివిధ భాగాలపై ఉంటే వాటిని వివిధ గుణాలకు ప్రతీకలుగా భావించి ఫలితం చెపుతారు. ఇది సాముద్రికంలో ఒక భాగమైంది.

సాముద్రిక శాస్త్రంలో తిలక, ముఖ, అంగ, హస్త సాముద్రికాలని నాలుగు భాగాలు. తిలక సాముద్రికం పుట్టుమచ్చల శాస్త్రం. ఇది శరీరపరంగా పుట్టినపుడు గ్రహాలు ఎక్కడున్నాయో వాటి ఫలితాలు ఏమిటో తెలియజేస్తాయి. అందరికీ ఒకేరకమైన ఆకారం ఉండదు. వేరువేరు ఆకారాలను సర్వసాధారణంగా గమనిస్తాం. కవలపిల్లల్లోనే తేడాలుంటాయి. దీనికి కూడా వివిధ లగ్నగతులలోని సూక్ష్మభాగాల తేడా అని జ్యోతిష్కులు వివరిస్తారు.

'**పొట్టివానికి పుట్టెడు బుద్ధులు**' అనేది సామెత. ఈ విషయాన్ని అంగ సాముద్రికం ధ్రువీకరిస్తుంది. కొన్ని లగ్నాలు వాని కనుగుణమైన నవాంశలలో పుట్టినవారు పొట్టిగానే ఉంటారు. వారు అధికమైన జ్ఞానం కలిగి చక్కని విశ్లేషణాత్మక బుద్ధిని ప్రదర్శిస్తారు. కన్య, తుల, మీనం, ధనుస్సు వంటి లగ్నాలు ఇటువంటి ఫలితాలనిస్తుంటాయి. వీటిలో కూడా కొన్ని భేదాలుండి మళ్ళీ అంశల పరంగా మారుతుంటాయి.

హస్తసాముద్రికం ప్రస్తుతం బాగా ప్రచారంలో ఉంది. శరీరాంగాల ననుసరించి వేరువేరు వ్యక్తులు సాముద్రిక శాస్త్రాలు వ్రాసినారు. ఒక్కో జాతకునికి ఒక్కో విధమైన శరీరం ఉంటుందని వారి జీవితంలో ఉన్నతి, అధోగతులకు శరీరం కూడా కారణమని చెపుతుంటారు. దీనికి ఆధారమైంది కూడా జ్యోతిషమే. ఆజానుబాహుత్వాల వంటి లక్షణాలు అందరికీ ఉండవు. ఉంటే వారివారి రంగాలలో శ్రేష్ఠులవుతారు.

వరాహమిహిరుడు పురుష - స్త్రీ లక్షణాధ్యాయాలు, వివిధ జంతువుల విశద వివరణలు వారి గ్రంథాలలో చేసినారు. బృహత్సంహిత పురుష లక్షణాధ్యాయం 54వ శ్లోకం ఈ విధంగా ఉంది.

**"వక్త్రం సౌమ్యం సంవృతమమలం శ్లక్ష్ణం సమంచ భూపానామ్**
**విపరీతం క్లేశభుజాన్ మహాముఖం దుర్భగాణాంచ ॥"**

సుందరమైనది, గుండ్రనిది, నిర్మలమైనది, సమానమైన అంగాలు కలిగినది, మొదలగు లక్షణాలున్న ముఖం రాజలక్షణాలు కలిగి ఉంటుంది. దీనికి వ్యతిరేకంగా



కురూపం, వక్రం, మలినం, వంకరగా ఉన్న అంగాలు భాగ్యహీనత్వాన్ని సూచిస్తాయి. ఈ ఫలితాలు చెప్పేముందు అనేక రకాల అంశాలు దృష్టిలో ఉంచుకుంటూ చెప్పాలని నియమం చేశారు. బృహత్సంహిత పురుషలక్షణాధ్యాయం 1వ శ్లోకం ప్రకారం-

**"ఉన్మానమాన గతి సంహతి సారవర్ణ స్నేహ స్వర ప్రకృతి సత్యమనూక మాదౌ।**
**క్షేత్రం మృజాంచ విధివత్ కుశలోవలోక్య సాముద్ర విద్వదతి యాత మనాగతంవా॥"**

అనే శ్లోకంలో ఎత్తు, మానం, గమనం, ధనం, రంగు, శరీర లావణ్యం, స్వరం, ప్రకృతి, సత్యము, శరీర వివిధ భాగాలను క్షుణ్ణంగా అధ్యయనం చేసి సాముద్రిక పండితులు మనుష్యుల శుభాశుభాలు నిర్ణయించాలని చెప్పారు. నేడు జ్యోతిష సాముద్రికం (Astro Pamistry)లో పరిశోధనలు అధికంగా జరుగుతున్నాయి. జ్యోతిషమంటే హస్త సాముద్రికమేనేమో అని చాలామంది అభిప్రాయ పడుతున్నారు.

వివిధ గ్రహాలు ఉండే రాశుల భేదం వల్ల ఒక్కొక్కరి జన్మలగ్నాలకు సంబంధించి వారి శరీరాలు, వానిలో మచ్చలు అధికంగా ఏర్పడుతుంటాయి. జానపదులు ఫలిత సంబంధం మాత్రమే పరిగణనలోకి తీసుకుని పరిశీలించారు. వారికి శాస్త్రీయమైన విషయం అవసరం లేదు. ఈ రకంగా పరిశోధించిన విషయ విశ్లేషణ సమాహారాలే నేడు నమ్మకాలుగా, సాముద్రికాలుగా, స్వప్నశాస్త్రాలుగా, వాస్తుశాస్త్రాలుగా అధ్యయనం చేయబడుతున్నాయి. వీటికి అత్యంత ప్రాచీనమైన చరిత్ర కనపడుతుంది.

'**మధ్యవేలికి ఉంగరం పెట్టుకోరాదట**' - హస్త సాముద్రికం ప్రకారం మధ్యవేలు శని గ్రహానికి సంబంధించింది. 'నీలం' రత్నముతో కూడిన ఉంగరమైతే మాత్రం ఆ వేలుకు పెట్టుకోవాలి. లేకుంటే పెట్టుకోకూడదు. ఏదిఏమైనా '**అరచేయి చూపించి అవలక్షణమనిపించు**' కోవద్దు. చూపించుకోకుండా ఉంటె తనకు మనసులో అటువంటి సంకోచాలేవీ ఉండేవి కావు. చేయి చూడగానే ఒక సాముద్రికుడు బాగా లేదని, అరిష్టమని చెప్పినాడు. ఆ విషయం అతని మనసుపై ప్రభావం కలుగజేస్తుంది. జ్యోతిష్కుడు, సాముద్రికుడు చెప్పే విషయాలు భవిష్యత్తును ప్రోత్సహించేవిగా ఉండడం,

నిర్ణయాత్మక లక్ష్యాలను సూచించేవిగా ఉండడం జరగాలి. కాని అందుకు వ్యతిరేకంగా కేవల ధనార్జన కొరకు ఈనాటి జ్యోతిష్కులు కొందరు తప్పు మార్గంలో సూచనలు, నిర్ణయాలు చేస్తూ సమాజం భయపడడానికి కారణమవుతున్నారు. వీళ్ల చేసే ప్రయత్నాన్ని ప్రోత్సహించకుండా వారి స్వ నిర్ణయాదులతో శాస్త్రం తెలియనివారి మనస్సుపై ప్రభావం కలిగించి, తద్వారా లాభం పొందుతున్నారు. తాము పట్టుకున్న కుందేటికి మూడే కాళ్ళన్న ధోరణిని వీరు విడనాడి సమాజవృద్ధికి తోడ్పడడం ఎంతో మంచిది. వీరి మొండితనం కూడా 'అబద్ధాల పంచాంగానికి అర్ధ్వె ఘడియలు త్యాజ్యం' అన్నట్లుంటుంది. ఇది 'చచ్చిపోయిన బర్రె పగిలిపోయిన ముంతెడు పాలిచ్చేది' అనే విషయానికి సామ్యంగా ఉంటుంది.

**సాముద్రికానికి సంబంధించిన కొన్ని నమ్మకాలు :**

'మగవాళ్లకు కుడి చెయ్యిమీద పుట్టుమచ్చ ఉంటే ధైర్యం, బలం ఉంటాయట'

'స్త్రీలకు కనుబొమలు కలుసుకుంటే మంచిది కాదు'

'స్త్రీకి కడుపుమీద పుట్టుమచ్చ ఉంటే అధిక స్త్రీ సంతానం'

'రొమ్ముమీద మచ్చ ఉంటే అదృష్టం'

ఇలాంటి నమ్మకాలు కోకొల్లలుగా ఉన్నాయి. వీటిని ప్రత్యేకంగా అధ్యయనం చేయాల్సిన అవసరం ఉంది. శరీరానికి సంబంధించి అనేక రకాల అంశాలు ఈ సాముద్రికాంశాలలో ప్రస్తుతం శాస్త్రీయంగా కూడా వివరిస్తున్నారు. పాశ్చాత్య దేశాలలో కూడా ఈ ప్రయత్నం అధికంగా జరుగుతుంది.

## 7. పండుగలు :

భారతీయుల జ్యోతిష విజ్ఞాన వేదికలు పండుగలు. భారతీయ జీవనమంతా జ్యోతిషంతోనే ముడివడి ఉంది. అయితే సమగ్ర పరిశోధన లోపించడంవల్ల నాస్తికవాదాలు అపనమ్మకాలు ఏర్పడుతున్నాయి. నిద్రలేచినప్పటి నుండి నిద్రించేంత వరకు స్వప్నాలకు సంబంధించి కూడా జ్యోతిషం తన ప్రాముఖ్యాన్ని చూపిస్తుంది.



పండుగల పరమార్థాన్ని కేవలం జ్యోతిషమొక్కటే పరిపూర్ణంగా చూపించగలదు. ఋగ్వేదంలో 'ప్రాతర్యావాణా ప్రథమాయజధ్వం' - 'నోతన సాయమస్తి దేవాయా అజుష్టమ్' అనే వాక్యాలు సూర్యోదయానికి పూర్వం ఉదయించే నక్షత్రాలను ఆరోజు పూజించాలని చెపుతున్నాయి. ఆకాశంలో కేవలం 27 నక్షత్రాలే గాక ఇతరాలైన వివిధ నక్షత్ర మండలాలున్నాయి. అవి వినాయక మండలం, సప్తర్షి మండలం, వీణా మండలం, గరుడ మండలం, గోమండలం మొదలైనవి.

**ఉగాది :**

'యుగాది' ప్రతి సంవత్సరం చైత్ర శుద్ధ పాడ్యమినాడు వస్తుంది. యుగ శబ్దం పంచవర్షాత్మకయుగమనే భావంతో యుగ్మం-జంట అనే అర్థంలో ఉపయోగించారు. సౌరమానానికి చాంద్రమానానికి రోజులు తేడా ఉంటాయి. ఈ చాంద్రమానాలు సౌరమానంతో కలపడంతో అధిక మాసాలు ఏర్పాటు చేశారు. ఈ అధికమాసాలు ఐదు సంవత్సరాలకు రెండు వస్తాయి. ఈ యుగశబ్దం కృతయుగం, త్రేతాయుగం, ద్వాపరయుగం, కలియుగమంటూ పెద్ద కాలం కొలిచే ప్రమాణమైంది. ఈ యుగ శబ్దం క్రమంగా కాలశబ్దవాచిగా సంవత్సరాదిగా కూడా ఉపయోగింపబడి యుగాది ఉగాదిగా మారింది. ఈరోజు చాంద్రమానం ప్రకారం సంవత్సర ప్రారంభదినం ఈనాడు పంచాంగ శ్రవణం చేయడం సంప్రదాయం. ఆ సంవత్సరానికి తమకు జరుగబోయే మంచి-చెడు గోచార విశేషాలు ఆనాడు తెలుసుకుంటారు. అనేక రకాల రుచులు కలిగేవిధంగా ఉగాది పచ్చడి చేసుకుని శరీరారోగ్యం కాపాడుకోవాలని సూచించడమే గాక, జీవితంలో సుఖదుఃఖాలు, కష్టసుఖాలు, శుభాశుభాలు, పాపపుణ్యాలు అన్నింటిని అనుభవించగలిగే ధైర్యమేర్పడాలని సూచించడం కూడా కనపడుతుంది.

పంచాంగం అనగా ఐదు అంగములు కలది. తిథి, వార, నక్షత్ర, యోగ, కరణాలు పంచాంగాలు. సూర్యునికీ చంద్రునికీ మధ్యనున్న దూరం ఆనాటి తిథి చెపుతుంది. దినమునకు 24 గంటలు. సూర్యోదయంతో ప్రారంభమయే గంటకు

ఎవరైతే అధిపతులుగా ఉంటారో వారు ఆ వారానికి అధిపతులు. చంద్రుడు ఏ నక్షత్రంలో కనిపిస్తే అది నిత్య నక్షత్రం. యోగ, కరణాదులు కూడా సూర్యుడు చంద్రుని మధ్య దూరంపై ఆధారపడి మాత్రం ఉంటాయి. పంచాంగ శ్రవణం ముందు పురోహితులు దాని ఫలితం చెపుతారు. ఐదు అంగాలు తెలుసుకోవడం వల్ల ఫలితం వివరిస్తారు.

"తిథేశ్చ శ్రియమాప్నోతి వారాదాయుష్య వర్ధనం ।
నక్షత్రాదర్హరతే పాపం యోగాద్రోగ నివారణం
కరణాత్కార్య సిద్ధిస్యా త్పంచాంగ ఫలముత్తమం॥"

తిథి వల్ల శ్రేయస్సు, వారం వల్ల ఆయుర్వృద్ధి, నక్షత్రం వల్ల పాపహరణం, యోగం ద్వారా రోగవిముక్తి, కరణం ద్వారా కార్యసిద్ధి జరుగుతాయని ఫలం చెపుతారు.

ఉగాది పచ్చడి కూడా శరీరానికి ఉత్తమమైన ఫలితాన్ని ఇస్తుందని చెపుతారు. నూతనంగా అప్పుడప్పుడే ఫలవంతమవుతున్న వస్తువులతో చేసుకునే పచ్చడి ఆరోగ్యవృద్ధి కరంగా భావిస్తారు.

శ్లో॥ వర్షాదౌ నింబకుసుమం శర్కరామ్లఘృతైర్యుతం।
భక్షితం సర్వయామేచ తద్వర్షం సౌఖ్యదాయకం॥
శ్లో॥ శతాయుర్వజ్రదేహాయ సర్వసంపత్కరాయచ।
సర్వారిష్ట వినాశాయ నింబకుసుమ భక్షణం ॥

వేపపూవు పచ్చడి శరీరానికి కల్గించి ఆరోగ్యాన్ని పైవిధంగా పురోహితులు వివరిస్తారు.

'ఉంటే ఉగాది– లేకుంటే శివరాత్రి' అనే సామెత జానపదులకు సుపరిచితం. ఉగాది నాడు భక్ష్యభోజ్యాదులు అధికంగా చేసుకొని తినడం అలవాటు. శివరాత్రి నాడు రాత్రిపూట కొంత ఉపాహారం తీసుకుని ఉపవాసం ఉంటారు. భోజనపరంగా,



వ్యక్తుల ఖర్చులపరంగా, పర్వదినాలకు సంబంధించిన సామెతలు వచ్చినాయి. **'ఉగాదినాడు వేపపూవు తినాలి'** అనేది నమ్మకం. **'ఊరు పుట్టినపుడే ఉగాది పుట్టింది'** అనేది ఒక పొడుపు సామెత. జీవితం పుట్టినపుడే కష్టసుఖాలు కలిసి పుడతాయని దీని భావం. ఉగాది భావం ఆనాడు మంచి చెడ్డలు తెలుసుకునే రోజుగా, వివిధ రుచులుగల పచ్చడి తినేరోజుగా, సంవత్సర ఆరంభ దినంగా సూచించబడుతుంది. **'ఊరుపుట్టినప్పటి నుండి ఉగాదులెన్ని రాలేదు? పోలేదు?'** అనడం కూడా కష్టసుఖాల సంగమమైన ఈ జీవితంలో గెసుపు ఓటముల దోబూచులాటలు ఎన్ని జరగలేదు? అనే భావానికి స్థిరమైన నమ్మకాలుగా ప్రాముఖ్యాన్ని పొందినాయి. వీటికి 'ఉగాది' అనే జ్యోతిష పరిభాష ప్రతీకగా మారడం జానపదుల జ్యోతిర్విజ్ఞానానికి నిదర్శనం.

**'కొత్తసంవత్సరం (ఉగాది)నాడు మంచిచేస్తే ఆ సంవత్సరమంతా మంచి జరుగుతుంది. చెడు చేస్తే ఆ సంవత్సరమంతా చెడు జరుగుతుంది. ఆ రోజు ప్రభావం సంవత్సరమంతా ఉంటుందట.'**

ఏదైనా పని ప్రారంభం గాని, విషయ ప్రారంభం గాని శుభంగా జరగాలని, మంచిగా ఉండాలని కోరుకోవడం సహజం. ఆ పని ప్రారంభంలో తాము చేసే పూజా సమయంలో–

**"తదేవ లగ్నం సుదినం తదేవ తారాబలం చంద్రబలం తదేవ।
విద్యాబలం దైవబలం తదేవ లక్ష్మీపతే తేంఘ్రి యుగంస్మరామి॥"**

అంటూ ప్రార్థిస్తారు. దీనిలో లగ్నం, దినం, తారాబలం, చంద్రబలం, విద్యాబలం, దైవబలం అటూ జ్యోతిషాదుల భావాలే కనిపిస్తున్నాయి. భారతీయ జ్యోతిషం కూడా ఈ విషయమే వివిధ సందర్భాలలో చూపిస్తుంది.

భారతీయుల వారాలన్నీ ఈ అంశం ఆధారంగా పెట్టబడినవే. వారంలోని మొట్టమొదటి వార ప్రభావం ఆ రోజు మొత్తంపై ఉంటుంది. ముహూర్తాలు పెట్టడం, శుభగ్రహ సంపత్తి చూసి వివాహాది శుభకార్యాలు చేయడంలోని కారణమిదే. ఆ

నూతన విషయం ప్రారంభంలో, శుభకార్య ప్రారంభంలో మంచిగా ఉంటే ఆ విషయ సంబంధమైన జీవితానుభవం శ్రేష్టంగా ఉంటుందని నిర్ణయం. అందుకే ముహూర్త నిర్ణయం జరుగుతుంది. అదేవిధంగా సంవత్సరారంభం నాటి ఫలితం ఆ సంవత్సరమంతా ఉంటుంది. ఆ రోజు మంచి చేస్తే సంవత్సరమంతా మంచి, ఆ రోజు చెడు చేస్తే సంవత్సరమంతా చెడు జరుగుతుంది. ఇది జ్యోతిష మూలభావాలకు దగ్గరగా ఉన్న నమ్మకం.

మనిషి పుట్టినపుడు చంద్రుడున్న నక్షత్రం తమ జన్మనక్షత్రంగా జీవితాంతం ఉంటుంది. పుట్టినపుడు వివిధ గ్రహాల సమూహపు పరస్పర దృష్టి, యుతి, స్థితి వల్ల చూపించే ప్రభావం జీవితాంతం ఉంటుంది. ఈ భావనే ఫలిత జ్యోతిష ఆరంభానికి హేతువై నేడు వివిధ శాఖలుగా విస్తరించింది.

**వినాయక చవితి :**

ఈ రోజుల్లో సామూహికంగా చేసుకునే పెద్ద పండుగ. మహారాష్ట్రులనుండి తెలుగువారికి ఇది ఎక్కువ వ్యాప్తిలోకి వచ్చింది. గణపతి మాత్రం భారత దేశంలోనే గాక వివిధ దేశాలకు కూడా ఇక్కడినుండి ప్రయాణం చేసినాడు. ఒకానొక అనిర్దిష్ట ఆకారం, పెద్దతొండం, బానపొట్ట, దొప్పచెవులు, ఏనుగుముఖం, మనిషి శరీరం, ఎలుక వాహనం – ఈ రకమైన శరీరాకృతి గల్గినవాడు భారతీయుల ప్రథమ పూజనీయ దైవమైనాడు. చక్కని శరీరపుష్టి, దేహదారుఢ్యం కల్గిన వీర, ఆదర్శ పురుషులు తరువాత కాలంలో పూజనీయులైనారు.

భాద్రపదశుద్ధచవితి నాడు 'వినాయకచవితి' వస్తుంది. ఈ రోజున సూర్యోదయానికి ముందు వినాయక మండలంలోని నక్షత్రాలు తూర్పున ఉదయిస్తాయి. ఈ నక్షత్రాలన్నింటినీ కలిపితే విఘ్నేశ్వరుని రూపం ఏర్పడుతుంది. క్రిందికి మరో నక్షత్ర మండలంలో మూషికామండలం- ఎలుకరూపం కనిపిస్తుంది. సూర్యుడు ఈమాసంలో సింహరాశిలో ఉదయిస్తాడు. అంతకన్న ముందు కర్కటక రాశి ఉదయిస్తుంది. దానిలో



చివరినక్షత్రం ఆశ్లేష. ఆశ్లేష సర్పదైవతం. అందుకే వినాయకునికి సర్పం చుట్టబడి ఉంటుంది. ఈ మండలానికి చేసే పూజ వినాయకపూజ. ఈ విధంగా వినాయకోద్భవం గూర్చిన వివిధ కథలకు, వినాయక చవితినాడు చదువుకునే కథలకు జ్యోతిషార్థాలు చెప్పుకోవచ్చు.

**'వినాయకచవితినాడు చంద్రుని చూస్తే నీలాపనిందలు వస్తాయట-అవి పోవాలంటే వినాయకపూజ చేసి కథ చదువుకోవాలట'** – ఇది జ్యోతిషసంబంధంగా ఆకాశపరిచయం చేయడానికి నిర్దిష్టమైన నమ్మకంగా కనిపిస్తుంది. దీనికి పౌరాణిక కథ వేరుగా కనిపిస్తుంది. దాని ప్రకారం ఆలోచించినా ఆ రోజున చంద్రకిరణాలలో కొంత వ్యత్యాసం ఉంటుందని కొందరి అభిప్రాయం. దాని దోషం పోగొట్టుకోవడానికి వినాయకపూజల రూపంలో ప్రకృతికి సంబంధించిన వివిధ ఆకులతో పూజలు చేస్తూ, కాలయోగ్యమైన ఉండ్రాళ్ళు ఆరోగ్యం కోసం తీసుకుంటూ, మనోనిశ్చలతకోసం ఆధ్యాత్మిక భావాలలో మునిగి ఉంటారు. మరికొందరు జానపదులు ఆ నీలాపనిందలు రాకుండా అప్పటికప్పుడే ఆ తిట్లు పడదామని ఇండ్లమీద రాళ్ళు వేసి తిట్టించుకోవడం **'గుండ్రాళ్ళ పండుగ – ఉండ్రాళ్ళ పండుగ'**గా భావించడం కనిపిస్తుంది.

**'వినాయకచవితి నాడు 27 గుంజిళ్ళు 27 ఇండ్లలో చేస్తే శుభం'** వినాయకచవితి ఖగోళానికి చెందింది. కథల్లోని వివిధాంశాలు కూడా ఖగోళప్రతీకలే. ఈ 27 నక్షత్రాల సంఖ్య ఆకాశంలో ఉన్నాయి. భగవంతుని ముందు తాము అల్పులమని భావించే విధానం దీంట్లో కనపడుతున్నా 27 ఇళ్ళలో గుంజిళ్ళు తీయమనడం 27 నక్షత్రాల పరిచయాన్ని సాధించడమనే విషయాన్ని సూచిస్తుంది. ఇతర శారీరక దుష్ప్రభావాలు నశించి శరీరంలో నూతనత్వం కలుగడానికి చేసే శారీరక వ్యాయామ ప్రక్రియలలో ఇది ఒకటి. ఎవరికి ఏది తోస్తే అది చేయవచ్చనే అంశం నుండి అన్నీ అందరూ ఆచరించాలన్న స్థితికి మధ్యకాలంలో చేరి క్రమంగా నేడు ఆర్భాటాలు మాత్రం అధికంగా కనిపిస్తున్నాయి.

## గోకులాష్టమి :

శ్రావణ బహుళ అష్టమి నాడు శ్రీకృష్ణుడు పుట్టినరోజున ఈ పర్వం జరుపుకుంటాం. ఆ రోజు రోహిణీ నక్షత్రం ఉంటుంది. అది కృష్ణుడు పుట్టిన నక్షత్రం. కృష్ణాష్టమినాడు సూర్యాస్తమయం తరువాత మకరరాశి ఉదయిస్తుంది. దానిలో శ్రవణానక్షత్రం ఉంటుంది. శ్రవణం విష్ణుదైవత్వం. శ్రవణం ముందుగా ఉన్న ధనిష్టా నక్షత్ర ప్రాంతంలో 'గోలోకం' ఉంది. ఇది నక్షత్రాల సమూహం. ఈ నక్షత్రానికి అధిపతులు వసువులు. మకరరాశిలోని ఈ నక్షత్రం ఉదయిస్తున్నపుడు సింహరాశి అస్తమిస్తుంది. అదే ప్రదేశంలో అశ్వినులు వారి వాహనమైన గాడిదల ఆకారం గల నక్షత్రాలు అస్తమిస్తుంటాయి. □ Â E ¤ '**గ్రహచారం చాలకపోతే వసుదేవుడు గాడిద కాళ్లు పట్టుకున్నాడు**' అనే సామెత వచ్చింది. ఆకాశంలోని గోలోకం ఉదయించినపుడు చేసుకునే పండుగ గోకులాష్టమి. '**పుట్టినిల్లు ఏకాదశి, మెట్టినిల్లు గోకులాష్టమి**' అనే సామెతలు కూడా కనపడుతున్నాయి.

## దసరా :

ఆశ్వీజశుద్ధదశమి నాడు ఇది వస్తుంది. ఇది క్షత్రియులు యుద్ధాలకు ముందు శక్తి పూజ, ఆయుధపూజ చేసే పండుగ. సామూహికమైనది. జమ్మి పత్రానికి ఆ రోజు ప్రాధాన్యమెక్కువ. దేవీనవరాత్రులు జరుపుతుంటారు. దసరానాడు జమ్మి వృక్షం దగ్గరకు వెళ్లేముందు పాలపిట్టను దర్శిస్తారు. '**పాలపిట్ట దర్శనం – కడుపు నిండ భోజనం**' అని అనుకుంటారు. జమ్మిచెట్టు వద్ద –

> "శమీశమయతే పాపం శమీశత్రువినాశనం
> అర్జునస్య ధనుర్ధారీ రామస్య ప్రియదర్శనమ్"

అంటూ భారతసంబంధకథను గుర్తుజేస్తుంటారు. సమైక్యతకిది ప్రతిబింబం. నేలంతా అప్పుడే చిత్తడి తగ్గుతుండడం, నూతనమైన ఋతు ఆగమనం వలన పరిసరాలలో సూక్ష్మక్రిమి ప్రవేశం జరుగకుండా, వాటిని నాశనం జేయడానికి బాణసంచా



కాలుస్తారు. ప్రకృతి సంబంధమైన వేరువేరు పూలు బాగా పూసే కాలం ఇది. అందుకే భాద్రపద బహుళ అమావాస్య– పితృ అమావాస్య (పెత్తరమాస) నాడు మొదలుపెట్టి తొమ్మిది రోజులు తెలంగాణా ప్రాంతాలలో బతుకమ్మ పండుగ జరుపుతారు. వివిధ పూలు పేర్చి అందంగా తయారుజేసి అన్నీ ఒకదగ్గర పెట్టి సామూహికంగా అందరూ వాటి చుట్టూ తిరుగుతూ, పాటలు పాడుకుంటూ చేసుకునే పండుగ ఇది. తొమ్మిదవ నాడు '**సద్దుల బతుకమ్మ**' అంటారు. అనేక రకాలైన సద్దుల వలన శరీర ఆరోగ్యం పెరగడానికి దోహదమౌతుంది. ఈ మాసంలో సూర్యుడు కన్యారాశిలో ఉంటాడు. 'కన్య' కు ప్రతీకగా దుర్గారాధన జేస్తూ దేవీనవరాత్రులు – దసరా జరుపుకుంటారు.

## దీపావళి :

ఆశ్వీజబహుళఅమావాస్య నాడు జరుపుకునే పండుగ ఇది. ఈ లోకం యమలోకం. ఒక నియమానుసారంగా నడుస్తుంది. ఆ నియమం తప్పినే చాలా కష్టం. అప్పుడు అదే నరకమవుతుంది. 'నరకుడు' అదేవిధంగా ఏర్పడినాడు. ఈ నరకుని రాజ్యం ప్రాగ్జ్యోతిషపురం. అంటే పూర్వమున్న జ్యోతిషపురం. ప్రస్తుతం ఆ ప్రదేశంలో ధ్రువుడుంటున్నాడు. ఈ ప్రదేశం మారడానికి 26000 సంవత్సరాలు పడుతుంది. జ్యోతిశ్శాస్త్రంలో ఇది ఒక అద్భుతమైన అంశం. అయనాంశ అని ప్రత్యేకంగా చెప్పబడే ఈ విషయాన్ని మొట్టమొదట భారతీయులే గుర్తించి ధ్రువకథ, నరకాసుర వధ అనే కథలరూపంలో వ్యక్తీకరించారు. ఈ కథ పూర్వజ్యోతిస్సులు వెలిగినప్పటి కథ. ఆ నక్షత్రం చుట్టూ సప్తర్షి మండలాలవంటి అన్ని నక్షత్రాలు పరిభ్రమిస్తాయి. వారినందరినీ నరకుడు బంధించినట్లు సాహిత్యంలో కనపడుతుంది. జ్యోతిష, పర్యావరణ విషయాలు అత్యధికంగా కూర్చుకున్న పండుగ ఇది. సూర్యుడుదయించే కన్యారాశి సత్యభామకు ప్రతీక. ఈ పండుగ నుండి కొంత చలి మొదలవుతుంది. జానపదులు ఈ విషయాన్ని కూడా గమనించారు. '**దీపావళికి దీపమంత చలి**'. వర్షాలు ఆసమయంలో పడితే అత్యంతతీవ్రంగా ఉంటాయి. '**దీపావళికి వర్షాలు ద్వీపాంతరాలు దాటుతాయి**' ఈ రకమైన సామెతలు పండుగల ప్రాధాన్యం దృష్టిలో పెట్టుకుని ప్రకృతిని వివరించాయి.

సంక్రాంతి :

ఇది భూమి తన దీర్ఘవృత్తాకార కక్ష్యలో ఉత్తరం వైపు ప్రయాణించే సమయం. క్రాంతి అంటే మార్పు. సూర్యుడు ఒక్కోరాశిలో ప్రవేశించేటపుడు వానిని సంక్రాంతులు అని అంటారు. వాటిలో మేష -కర్కటక -తులా- మకర సంక్రాతులు ప్రత్యేకమైనవి. వీటన్నింటిలోనూ 'మకర సంక్రాంతి' పుణ్యదినమని భారతీయుల భావన. భూమిపై ఉత్తరధృవంపై మొదటిసారి సూర్యోదయం ఈ రోజున జరుగుతుంది. అదేవిధంగా భూమి ఉత్తరం వైపు ప్రయాణం చేయడం ప్రారంభిస్తుంది. ఉత్తరం వైపు నక్షత్ర మండలాలు, ధ్రువుడు, సప్తర్షిమండలాలున్నాయి. ఈ కాలం కూడా బాగా ఉండడంవల్ల, అన్ని పనులకు యోగ్యంగా ఉండడం వల్ల దీన్ని శుభకాలంగా పరిగణించారు. భీష్ముడు ఉత్తరాయణం వరకు వేచి మరణించాడని భారతం చెపుతుంది. జ్యోతిస్సుల ప్రభావంతో ప్రకృతి ఏవిధంగా మార్పు చెందుతుందో దానిఫలితాలను విశేషించే పర్వమిది.

**'సంక్రాతికి చంకలెత్తకుండా చలి' 'సంక్రాతినాడు చలి చంకలెత్తనీయదు'** అనే సామెతలు ఆ కాలస్థితిని చెపుతున్నాయి. దీర్ఘవృత్తాకారకక్ష్యలో భూమి సూర్యునికి దగ్గరగా చేరినపుడు ఎండ, దూరమైనపుడు చలి పెరుగుతున్నాయి. సంక్రాంతి వరకే బాగా పెరుగుతున్న చలి అప్పటికే మరింత ఎక్కువవుతుంది. భోగి మంటలు మనకు అలవాటే. గొబ్బెమ్మలు, ముగ్గులు పెట్టడం, పిల్లలకు పండ్లతో భోగి పండ్లు పోయడం, కుండల నోములు అన్నీ ఈ రోజుల్లో చేస్తుంటారు. కనుము పశువులకు సంబంధించిన పండుగ. మూడవరోజు కనుము ప్రయాణానికి పనికిరానిది.

**'కనుమునాడు కాకిని అయినా కదలనీయరు'**

**'కనుము నాడు కాకి కూడా మునుగుతుంది'** అనే సామెతలు ఉన్నాయి.

శివరాత్రి :

ప్రతినెల బహుళ పక్షంలో త్రయోదశి వెళ్ళి చతుర్దశి వచ్చేరోజు శివరాత్రి. అన్నింటిని 'మాస శివరాత్రులు' అన్నా మాఘమాసంలోని శివరాత్రిని 'మహాశివరాత్రి'



పర్వదినంగా జరుపుతారు. శివుని పరంఅ ప్రత్యేకతను సంతరించుకోవడం వల్ల ఇది శివరాత్రి అయింది. సంక్రాంతి వరకు తీవ్రంగా ఉన్న చలి శివరాత్రికి తగ్గిపోయి ఎండలు మొదలవుతాయి. ఈ ఎండ, చలి, వానలు జ్యోతిషసంబంధ అంశాలే.

**'శివరాత్రికి చలి శివశివా! అని పోతుంది', 'శివరాత్రికి చింతగింజలంత చలి' 'శివరాత్రికి చింతాకంత చెమట'** - అంటూ చలి- ఎండల విషయాలు సామెతలలో కనిపిస్తున్నాయి. **'శివరాత్రికి జీడిపిందె ఉగాదికి ఊరగాయ', 'శివరాత్రికి శివలింగాలంత మామిడికాయలు'** అనే సామెతలు మామిడికాయల సందర్భంలో శివరాత్రిని ఉపయోగించి చెప్పినవి. ఇంకా **'శివరాత్రి వాడింటికి ఏకాదశి వాడొచ్చినట్లు'** అంటూ అసలు లేనివాడు కొద్దిగా ఉన్నవాని వద్దకు చేరినట్లు చెప్పుకుంటాయి. ఏకాదశి పూర్తి ఉపవాసం, శివరాత్రి ఒకపూట ఉపాహారంచేసే సంప్రదాయంవల్ల ఈ సామెతలు వచ్చాయి.

అంతేకాక వేరు వేరు పండుగల విషయంలోనూ జానపదులు ఆచరించే విధానాల ప్రకారం పండుగలకు సంబంధించిన అనేక సామెతలు ఏర్పడినాయి. **'శయనైకాదశి తెలిసినవాడే శాస్త్రకారుడు'** ఆషాఢశుద్ధఏకాదశి శయనైకాదశి. ఈరోజు సూర్యోదయ సమయంలో మకరరాశి పశ్చిమంవైపు అస్తమిస్తుంటుంది. మకరంలోని శ్రవణానక్షత్రం విష్ణువుకు సంబంధించింది. ఆరోజును 'శయనైకాదశి'గా భావిస్తారు. మళ్ళీ కార్తీకశుద్ధఏకాదశినాడు ఈ మండలం కనపడడం వల్ల ఉత్థాన ఏకాదశిగా భావిస్తారు. విష్ణువు మేలుకొన్న భావం దీనిద్వారా తెలుస్తుంది. విష్ణుమండల ప్రాధాన్యమైనది. ఈ విషయాలు పూర్తిగా నక్షత్రాలను పరిశీలించ గల్గినవానికే తెలుస్తాయి. అందుకే అతడే శాస్త్రకారుడని సామెత.

ఇంకా నాగులచవితి శ్రావణశుద్ధచవితినాడు జరుపుకుంటారు. ప్రకృతిలో భాగమైన పాములను పూజించే పండుగ ఇది. **'నాగ ప్రతిష్ఠరోజు, నాగులచవితిరోజు పొట్లకాయ, సేమియా వంటివి తినకూడదు'** అనే అంశాలు పాములాంటి ఆకారమున్న వానిని ఆ రోజు తినకూడదనే నమ్మకంతో ఏర్పడినాయి.

భారతీయుల పండుగలు జ్యోతిషవిషయాలను వివరించేవిగా ఉన్నాయి. వీనిని పరిశీలించగలిగితే జానపదుల జ్యోతిర్విజ్ఞానం అర్థమవుతుంది. పండుగల ఆవిర్భావం జ్యోతిష సంబంధమే. దానిలోని అనుసరణ ధర్మశాస్త్ర సంబంధం. అయితే ధర్మశాస్త్రం కూడా జ్యోతిష ప్రాతిపదికలతోనూ, ప్రకృతికి సంబంధించిన అంశాలను కూర్చుకొని ఏర్పడినదే. అందుకే శిష్టుల ఆచరణలకు, జానపదుల ఆచరణలకు పండుగల విషయంలో తేడాలు లేవు. ఈ పండుగలకు సామాజిక అంశాలు కూడా జోడించడం వల్ల మూలాన్ని మరచిపోయి కేవలం కొన్ని సంప్రదాయాల రూపంలోనే పాటిస్తుంటారు. అయినా ఆ మూలాల పునాది గట్టిది. అందువల్ల ఆ ఆధారంతో ముందుకు వెళ్లగలం.

## 8. ప్రయాణం :

నిత్య జీవితంలోని జ్యోతిష సంబంధ అంశాలలో ప్రయాణం ప్రధానపాత్రను కలిగి ఉంది. ఏ పనిని మొదలు పెట్టాలన్నా ఒక మంచి సమయం ముహూర్తం అవసరం. ఎక్కడికైనా ప్రత్యేక సందర్భంలో కార్యార్థులై వెళ్లడంలో మంచి జరగాలంటే మంచి సమయం చూసుకుంటూ వెళ్లడం మంచిది. సమయం, రోజు మంచిది కాకుంటే పని సరిగా కాదని అపసవ్యం, ఆలస్యమవుతుందని భావన. నాలుగుదిక్కులు, వివిధ ప్రాంతాలు అన్ని వైపులా వెళ్లడానికి రోజులు సూచించబడినాయి.

'అమావాస్యనాటి రాత్రి, ఒంటరిగా ఎక్కడికీ వెళ్లగూడదు'

'అమావాస్య పౌర్ణమి రోజుల్లో ప్రయాణం చేయరాదు'

చంద్రుని పూర్ణత్వం అస్తంగతత్వమాధారంగా మనసు ఉద్రేకంగాను, నీరసంగానో ఉండడంవల్ల ప్రయాణ సమయాలలో అవకతవకలు, కార్యనాశం జరిగే అవకాశముంటుంది. మనస్సంబంధ హృదయ సంబంధ అనారోగ్యాలుంటే ఆ రోజుల్లో వెళ్లకపోవడం ముందు జాగ్రత్త చర్య అవుతుంది. 'అమావాస్య పౌర్ణమి రోజుల్లో చెట్లెక్కరాదు'. అని కూడా అంటారు. ఈ రోజుల్లో చెట్లమీదనుండి పడే అవకాశం ఉంది. ముఖ్యంగా మనోభ్రమణానికి అవకాశం ఎక్కువ. అందువలన ఇటువంటి జ్యోతిష నియమాలు చేయబడినాయి.



'ఆదివారం శుక్రవారం పడమర దిక్కుగా పోరాదు'

'గురువారం దక్షిణదిక్కుగా ప్రయాణం చేయరాదు'

'బుధవారం ఉత్తరదిశగా ప్రయాణం చేయరాదు'

'శనివారం తూర్పుదిశలో ప్రయాణం చేయరాదు'

'సోమవారం తూర్పుదిశగా ప్రయాణం చేయరాదు'

అనే నమ్మకాలు సామెతలున్నాయి. జ్యోతిశ్శాస్త్రరీత్యా ప్రయాణాలకు వార దోషాలున్నాయి. 'మందామరేజ్య భూపుత్రసూర్య శుక్రేందు జేందవః' అనే వరుసలో శని, గురు, కుజ, రవి, శుక్ర, బుధ, చంద్ర గ్రహాలున్నాయి. ఈ వరుసలో చంద్రుని ప్రదేశంలో భూమి ఉన్నదనుకుంటే ఇవి గ్రహ కక్ష్యల వరుసలను సూచిస్తున్నాయి. సూర్యోదయం నుండి పై గ్రహాల వరుసలో ఒక్కో గంటకు ఒక్కో గ్రహం ఆధిపత్యం వహిస్తుంది. దీన్నే హోర అని అంటాం. ఒక్కరోజుకు 24 గంటలు. 21 గంటలవరకు మూడు ఆవృత్తులు అయిపోయిన తరువాత మూడవ గ్రహం యొక్క హోర మరునాడు ప్రథమహోర అవుతుంది. ఆదివారంనాటి ఉదయం సూర్యహోరతో ప్రారంభమై మళ్లీ 22వది రవిహోర, 23వది శుక్రహోర, 24వది బుధహోర అవుతాయి. 25వ హోర అనగా మరునాడు ఉదయం చంద్రహోరతో ప్రారంభమవుతుంది. సోమవారాధిపతి చంద్రుడు. మంగళ-కుజుడు, బుధ-బుధుడు, గురు-గురువు, శుక్ర-శుక్రుడు, శని-శని, ఆది-సూర్యుడు. ఈ ప్రథమహోర ఫలితం ఆవారం మొత్తం పనిచేస్తుందని ఆయా వారాలు శుభకరాలా, అశుభకరాలా అనేవి నిర్ణయిస్తారు. ఏ రోజున ఆ హోరాధిపతి ప్రభావం ఉంటుంది. వారం ఈ గ్రహాల ఆధారంగానే నిర్ణయించడం జరుగుతుంది.

"న పూర్వే శని సోమేచ నగురుర్దక్షిణ స్తథా
నపశ్చాద్భాను శుక్రేచ చోత్తరే బుధమంగళే"

"అంగార పూర్వే గమనేచలాభం సోమా శనా దక్షిణమర్థలాభం
బుధౌగురౌ పశ్చిమ కార్యసిద్ధి రవౌభృగౌ చోత్తర ధాన్యలాభం."

తూర్పు వైపునకు–శని, సోమవారాలు, దక్షిణం–గురువారం, పశ్చిమం–ఆది, శుక్ర వారాలు. ఉత్తరం బుధ, మంగళ వారాలలో ప్రయాణాలు కూడదు.

తూర్పువైపు మంగళవారం, దక్షిణంవైపు సోమ, శని వారాలు, పడమరకు బుధ, గురు వారాలు. ఉత్తరంవైపు ఆది శుక్రవారాలు ప్రయాణం చేయడంవల్ల వారదోషాలు తొలగిపోతాయి. కాలామృతం 160 శ్లోకం ప్రకారం –

"రిక్తా పర్వదినా దివిష్ట తిథయ షష్ఠష్టమీ ద్వాదశీ
వర్జ్యా భూమిజ భానుపుత్ర దిన కృద్వారాశ్చ యాత్రాక్షణే
హస్తాదిత్య హరిద్వయాంత్య శశభృద్దస్రార్య మిత్రాహ్వయా
శ్చస్తా మధ్యమ తార శ్శతభిషఙ్మూల ప్రజేశోత్తరాః"

రిక్తతిథులు, పంచపర్వాలు, పాడ్యమి, భద్రకరణయుక్త దినంబును పక్షద్వయ గతంబులగు ద్వాదశి, షష్ఠి, అష్టమిలు ఆది, మంగళ, శనివారాలు ప్రయాణానికి యోగ్యాలు కావు. మిగిలిన తిథివారాలు అశ్వని, మృగశిర, పునర్వసు, పుష్యమి, హస్త, అనూరాధ, శ్రవణం, ధనిష్ట, రేవతి నక్షత్రాలు ప్రయాణానికి ప్రశస్తాలు. రోహిణి, ఉత్తర, మూల, ఉత్తరాషాఢ, శతభిషం, ఉత్తరాభాద్ర నక్షత్రాలు మధ్యమాలు తక్కినవి అయోగ్యాలు. కాలామృతం 161వ శ్లోకం ప్రకారం –

"శూలాఖ్యేష్వథవార భేషు గమనం యాతుర్భవేద్రోగ కృ
చ్చంద్రార్కాత్మజ వ్వారయోస్సురప భే ప్రాచీన్నగచ్ఛేద్దిశమ్
జీవేఽజాంఘ్రిభ ఏవ చాంతక దిశం శుక్రార్కయోః సృష్టభే
పశ్చా దర్యమభే కుజజ్ఞ దినయోర్యాతాచ్చ సౌమ్యాం దిశమ్."

తూర్పుకు సోమ శనివారాలు, జ్యేష్ఠా నక్షత్రం, దక్షిణానికి గురువారం, పూర్వాభాద్రనక్షత్రం, పశ్చిమం, ఆది శుక్రవారాలు, రోహిణీ నక్షత్రం, ఉత్తరానికి మంగళ బుధవారాలు పుబ్బనక్షత్రం ఈ విధంగా వార నక్షత్రాలు శూలసంజ్ఞ కలిగి ఉండడంవల్ల అటువంటి వారశూల నక్షత్ర శూలలయందు ప్రయాణమైపోతే వ్యాధి కలుగుతుంది.



పై శాస్త్రోక్త భావనలను అనుసరించి ప్రయాణపరంగా జానపదులు తాము గుర్తించిన వివిధ అంశాలను సామెతలు, నమ్మకాల రూపంలో ఉపయోగించారు.

'పాడ్యమి ప్రయాణానికి మంచిదట'

'మంగళవారం వారశూల కనుక ఊరికి ప్రయాణమై బయల్దేరగూడదట'

పాడ్యమి ప్రయాణానికి మంచితిథి, ఆది, మంగళ, శని వారాలు వారశూలలు.

'షష్టినాడు చాకలివాడైనా ప్రయాణం చేయడు'

'బుధవారం పులికూడా బయల్దేరదు'

'పౌర్ణమి–అమావాస్యలలో ఆడబిడ్డను అత్తవారింటికి పంపరాదు.'

ఈ సామెతలు శాస్త్రీయమైన అంశాలనే వ్యక్తీకరిస్తూ వివిధ జీవన వ్యవస్థలకు జంతువుల పరంగాను ప్రభావం చూపేవిగా మారినాయి. శకున సంబంధ విషయాలు ప్రయాణ సందర్భంగా ప్రత్యేకతను సంతరించుకున్నాయి.

'బయల్దేరిన పిదప వెనుకకు మళ్లీ తిరిగి రారాదు'

'ప్రయాణమై బయల్దేరేటపుడు ఎవరైనా తుమ్మితే కొంచెంసేపు కూర్చొని మళ్లీ బయలుదేరాలి'

'కనుమునాడు కాకిని అయినా కదలనీయరు'

ఈ విధంగా ప్రయాణ సంబంధంగా వివిధ జీవితాల అనుగుణమైన శకునాది విషయాల సామెతలు ఉన్నాయి.

9. స్వప్నం :

మానవుని అంతశ్చేతనలో అనేకరకాల విశేషాలు నిక్షిప్తమవుతాయి. విశ్వంలోని వివిధ జీవరాశుల అంతశ్చేతన ఒక్కటే అని మనస్తత్వ శాస్త్రవేత్తల అభిప్రాయం. ఈ అంతశ్చేతనలో నిక్షిప్తమైన అంశాలు స్వప్నాలద్వారా వ్యక్తీకరింపబడతాయి. ఈ కలలు సూచించే అంశాలు తమ మనస్తత్వాన్ని భవిష్యత్తును సూచించగలిగేవిగా ఉంటాయి. కలలు భవిష్యత్సూచకాలుగా మారినప్పటి నుండి దీన్ని జ్యోతిశ్శాస్త్రంలో అంతర్భాగంగా స్వీకరించారు. వ్యక్తి మనసు క్రమబద్ధపరచడం ధ్యానంద్వారా, యోగంద్వారా మాత్రమే సాధ్యం. కాకుంటే ఆ మనసు నిరంతరం పనిచేస్తూనే ఉంటుంది.

**'కలలో గ్రహ నక్షత్ర సూర్య చంద్ర బింబాలను చూస్తే శుభం'.** వ్యక్తి అనుకోని విషయాలు కొన్ని, ఎప్పటికీ పరిశీలించే నిత్యజీవన వ్యవహారాలు మరికొన్ని కలల్లో కనపడతాయి. ఒక్కో కల ఒక్కో సమస్యకు పరిష్కారం కావచ్చు. నూతన సమస్యలు వస్తున్నాయనే సూచన కావచ్చు. స్వప్న శాస్త్రవేత్తలు ఈ కలలను శుభాలు, అశుభాలుగా వర్గీకరించారు. మనకు ఏ విషయాలు శుభకరాలో, అవి కలల్లో కనపడడం వల్ల జరిగే మంచీ-చెడులను పరిశీలించడం ద్వారా భవిష్యత్సూచనలు పొందడానికి అవకాశం ఉంది. జ్యోతిషం కూడా ఇటువంటి సూచక శాస్త్రమే. జీవితంలో జరిగే మంచి-చెడులను ఇది సూచిస్తుంది. దాని ప్రకారంగా జీవనం సాగిస్తే మంచిని వృద్ధి చేసుకుంటూ చెడుకు వ్యతిరేకంగా ప్రయత్నం చేస్తూ సాగడం వ్యక్తి యొక్క ముఖ్యధర్మం.

స్వప్నం కూడా ఈ స్థితిని కలిగి ఉండడం వల్లనే జ్యోతిశ్శాస్త్రాంతర్భాగమైంది. గ్రహనక్షత్ర సూర్య చంద్ర బింబాదులు మనకు మంచి చేస్తున్నాయనే భావంతో శుభకరాలుగా స్వీకరించారు.

**'కలలో నక్షత్రాలు నేలరాలి పోవడం చూస్తే దుఃఖం సంభవిస్తుంది'** వంటి సామెతలవల్ల నక్షత్రాలకు మనమిచ్చే ప్రాధాన్యం తెలుస్తుంది.



'కలలో సూర్యచంద్రమండల దర్శనమైతే రోగికి ఆరోగ్యం కలుగుతుంది' అనే నమ్మకం కూడా ఉంది. **'ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్'** అని శాస్త్రప్రమాణం. అదే విధంగా సూర్యుడు కలలో కనిపిస్తే రోగం నయమవుతుందన్న నమ్మకం సహేతుకమైనదే.

**'పాములు కలలోకి వస్తే నవగ్రహాలు తిరిగి రావాలట'** రాహు కేతువులనే ఛాయా గ్రహాలను సర్పప్రతీకలుగా భావిస్తాం. అందుకే స్వప్నంలో పాములు కనపడితే నవగ్రహప్రదక్షిణ అవసరమని శాంతిసూచకంగా చెపుతారు.

**'కలలో ఎవరైనా మరణించినట్లు కలవస్తే వారికున్న శని తొలగుతుందట'** **'కలలో తలకు నూనె రాసుకున్నట్లు వస్తే శనిగ్రహదోషం ఉన్నట్లు'** నూనెతో శనికి అభిషేకం చేస్తారు. శనికి నలుపురంగు, నలుపు భూములు, నలుపు ధాన్యాలు ప్రతీకలు. అంటే ఈ గ్రహప్రభావం వల్ల ఆ రంగు ధాన్యాలు బాగా పండుతాయి. నూనె కూడా శని సంబంధమవడం వల్ల దాన్ని తలకు పూసుకుంటే ఆ గ్రహ సంబంధమైన దోషం ఉన్నట్లు భావిస్తారు. ఎవరైనా మరణించినట్లు వస్తే వారికి అశుభకరమైన పరిణామాలు మరణిస్తాయని, అవి శనిగ్రహ సంబంధంగా ఊహించడం వల్ల ఇటువంటి నమ్మకాలు వచ్చినాయి.

రాత్రి మొదటి ఝాములో వచ్చిన స్వప్నం సంవత్సరాంతంలోనూ, రెండవ ఝాములో వచ్చిన స్వప్నం ఎనిమిది మాసాలలోనూ, మూడవ ఝాములో వచ్చిన స్వప్నం మూడు మాసాలలోనూ, నాలుగవ ఝాములో వచ్చిన స్వప్నం ఒక మాసానికి, అరుణోదయంలో వచ్చిన స్వప్నం పదిరోజులకు, సూర్యోదయంలో వచ్చిన స్వప్నం ఐదురోజుల్లోనూ ఫలాన్నిస్తుంది.

**'తెల్లవారుఝామున వచ్చిన కలలు నిజమవుతాయట'**

ఈవిధంగా జ్యోతిషశాస్త్రంలో సూచించే భవిష్యత్తు దశప్రకారంగా సూచించి నట్లు కలలు కూడా ఫలవంతమయ్యే సమయాలు సూచించబడుతున్నాయి. తెల్లవారు

ఝామున వచ్చిన కలల ఫలితాలు వెంటనే కనపడతాయి కాబట్టి అవి నిజమవుతున్నాయనే భావం వచ్చింది. 'కాంతి సూక్ష్మీకృతమైన రూపమే మనస్సు'. ఈ మనస్సు గ్రహించే అంశాలు చేతన, సుప్తచేతనలో వ్యక్తీకరించబడతాయి. వాటిని గమనిస్తూ విశ్లేషిస్తూ క్రమంగా భవిష్యత్తుపై ఒక అంచనా ప్రకారంతో సాగడం శ్రేయస్సును, అందుకు వ్యతిరేకమైతే బాధలను కష్టాలను పొందవలసి ఉంటుంది.

ఈ విధంగా స్వప్నాల విశ్లేషణకు మనస్తత్వ శాస్త్రజ్ఞులు, జ్యోతిష్కులు ఒక్కచోట చేరి ఫలిత నిరూపణలు చేయడంవల్ల వినూత్న జానపద జ్యోతిషాంశాలను వెలికి తీయవచ్చు.

## 10. నిత్య కర్మలు :

గృహంలో వ్యక్తి నిర్మలంగా ఉండడం మొదలైనప్పటి నుండి నిత్యజీవనంలో ఎన్నో పనులు చేస్తుంటాడు. వైదికకర్మల ప్రకారం షోడశకర్మలు జీవితంలో చేయబడతాయి. ఇవి ప్రత్యేక సమయాల్లో చేసేవి. అవికాక మరీ సాధారణంగా చేసుకునే కర్మల్లో కూడా జానపదుల జ్యోతిర్విజ్ఞానం బహిర్గతమవుతుంది. అయితే వీటి అన్నింటిలో పూర్ణ జ్యోతిష ఛాయలు కనిపించవు. కొన్ని నమ్మకాలు జ్యోతిష విషయాలు లేకుండా ఉన్నాయి.

రోజులు, వారాలు, వేరు వేరు సమయాలలో చేసే పనులు, క్షవరం, గోళ్లు కత్తిరించుకోవడం, వివిధ వస్తువులు, ఆభరణాలు కొనడం, అమ్మడం మొదలైన ప్రతి అంశంలోనూ జ్యోతిషపరమైన విషయాలు ప్రాధాన్యం కలిగి ఉన్నాయి.

**'ఏకాదశినాడు తలంటుకోకూడదట'** ఏకాదశి పర్వదినంగా భావిస్తారు. అన్ని ఏకాదశులు ఏదో ఒక ప్రత్యేకతను కలిగి ఉంటాయి. శయనైకాదశి, ఉత్థాన ఏకాదశి, తొలి ఏకాదశి, ముక్కోటి ఏకాదశి, మతత్రయ ఏకాదశి, భీష్మైకాదశి మొదలైనవన్నీ ఉండడం వల్ల ఏకాదశులను పర్వదినాలుగా ఏర్పాటు చేసుకున్నారు. ఈ రోజుల్లో ఉపవాసముండాలని చెప్పబడింది. అందుకే **'ఏకాదశి ఇంటికి శివరాత్రి పోయినట్లు'**



వంటి సామెతలు చెప్పబడినాయి. ఈ ఏకాదశులలో భగవద్భక్తి కల్గి నిద్ర మేల్కొని ఉపవాసముండాలని ధర్మశాస్త్రం చెపుతుంది. తలంటుకోవడమంటే శరీరమంతా నూనె రాసుకొని, మర్దన చేసుకుని స్నానాదులు సుగంధ ద్రవ్యాలతో ఆచరించడం. దానివల్ల శరీరంలో వివిధ భావాలసంబంధ ప్రేరణలు కలుగుతాయి. సుఖనిద్ర కలుగుతుంది. అందుకే ఏకాదశినాడు తలంటుకోవద్దనే విషయం ధర్మశాస్త్రం నిర్దేశించింది.

**'ఏకాదశినాడు తలంటుకుంటావేమిటి? అని అడిగితే అది నిత్యవ్రతం. నేడే ఆరంభించాను అన్నాడట. మర్నాడు తల ఎందుకు అంటుకోలేదంటే నిన్నటితో వ్రతసమాప్తి అయిందన్నాడట.'** ఇటువంటి నమ్మకాలు తప్పించుకునే చాకచక్యం గల్గినవాడు అంటుండడం కనిపిస్తుంది.

**'శనివారం మగవాళ్లు, శుక్రవారం ఆడవాళ్లు తలంటుకోవాలట. ఆదివారం తలంటుకోరాదు'** శుక్రవారం లక్ష్మీసంబంధంగా, శనివారం విష్ణువుకు సంబంధించిన వారంగా గుర్తించడం జరిగింది. అందుకే ఈరకమైన విశేషాలకు అనుగుణంగా తలంటుకోవాలని చెప్పడం జరిగింది. ఆదివారానికి సూర్యుడు అధిదేవత. సూర్యుడు అశుభగ్రహాలలో ఒకటవడం వల్ల ప్రస్తుత కాలంలో అన్ని పనులు ఆరోజునే పూర్తి చేసుకుంటారు.

**'అమావాస్యనాడు క్షవరం చేయించుకోకూడదు.'**

మంగళవారం, శుక్రవారం, అమావాస్య, పౌర్ణమి రోజుల్లో గోళ్లు తీసుకోకూడదు, జుత్తు కత్తిరించుకోకూడదు. వ్యక్తి శరీరం విద్యుత్ప్రవాహాల సమూహంగా ఉంటుంది. ఈ సమూహానికి జుత్తు, గోళ్లు మార్గాలుగా ఉంటాయి. వీటిద్వారా శక్తి బయటకు పోతుంది. ప్రాచీన ఋషులందరూ జుత్తు ముడులు కట్టుకున్న నిదర్శనాలు ఈ విషయాన్ని స్పష్టం చేస్తున్నాయి. మానవ శరీరంలో మంచి శక్తుల సమూహాలను దృఢపరచి వ్యతిరేక శక్తులను బయటకు పంపించడానికి కొన్నిరకాల సూత్రాలు నిర్దిష్టపరచింది.

వాత్స్యాయనుని ప్రకారం శరీరంలో అక్షి, వక్ష, శిర, హృది, హస్తమ్, అపత్సు, నాఢి, మేఢ్ర, అధోభాగ, శలాయుహ, బుద్ధి, స్థాన, బ్రహ్మదండ మొదలైన స్థలాలు విద్యుత్కేంద్రాలుగా ఉన్నాయి. బుద్ధిస్థాన, బ్రహ్మదండ ప్రాంతాలు తలపైన ఉండేవి. జుట్టు కత్తిరించుకోవడం వల్ల శక్తి వృథా ఎక్కువవుతుంది. జీవత్వం కోల్పోవలసి వస్తుంది. ఒకసారి క్షవరం చేసుకుంటే శరీరంలో మళ్లీ ఆ శక్తి ప్రకృతినుండి స్వీకరించగల్గినపుడు గాని లేదా ఎక్కువ శక్తి వృథా లేనిసమయంలోగాని చేయాలి. దానిద్వారా శరీరంలో జీవశక్తి విద్యుచ్ఛక్తి కాపాడబడుతుంది. వీటికి సంబంధించిన సూత్రాలలో రోజుల గూర్చి వివరించడానికి జ్యోతిషశాస్త్రాన్నాశ్రయించారు. **'అమావాస్య చాలా పనులకు నిషిద్ధం'** శరీరబలాన్ని చాలావరకు ఆ రోజున వినియోగిస్తుంటాం. మంగళవారం కుజుని ప్రాధాన్యముండడం వల్ల వ్రణాలు, దెబ్బలు కలిగే అవకాశం ఉంది. అదేవిధంగా అశుభవారం నిషిద్ధమైనది. శుక్రవారం లక్ష్మీవారంగా భావించి, ఆడపిల్లలు (అక్కచెల్లెలు) ఉంటే నిషద్ధమని సామాజిక బంధాలను నమ్మకంగా ఏర్పరచి శాస్త్రవిషయాలను చెప్పడం జరిగింది.

గోళ్ల విషయం కూడా ఇంతే. గోళ్లనుండి కూడా శరీరంలోని శక్తి ఎక్కువ విడుదల అవుతుంది. అందువల్ల దానికి సమయం నిర్దేశం అవసరమైంది. అదేవిధంగా రాత్రి సమయంలో శక్తి క్షీణించడం అధికంగా ఉండడంవల్ల గోళ్లు తీసుకోకూడదు, క్షవరం చేసుకోకూడదు.

ఇటువంటి విషయాలలో మంచిని గ్రహించడమే ప్రధానం. నియమాలు శాస్త్రాలు విధిస్తాయి. ఆదరించడం అందరి కర్తవ్యం. కార్యం కాగానే తప్పు అయినా ఒప్పు అయినా అప్పుడే ప్రత్యక్ష ఫలాన్నివ్వలేనివి కొన్ని ఉంటాయి. అందువల్ల ఈ క్షౌరాదులు క్రమంగా శాస్త్రీయ దృష్టిని కోల్పోయాయి. వాటి ఫలితం నిత్యజీవనం పైన బుద్ధికుశలతపైన ప్రభావం కలుగజేస్తుంది. అందుకే జా..పదులు ఆయా శాస్త్రీయాంశాలను అక్క, చెల్లె, తల్లి, తండ్రి వంటి సంబంధాలతో కలిపి చెప్పినారు. ఆ విధంగా చెప్పడంవల్ల కనీసం ఆ విధంగానైనా శాస్త్రీయాంశం పాటిస్తారనే భావం



ఉంది. ప్రస్తుత కాలంలో ఈ విషయాలు పూర్తిగా వదిలివేయడం కూడా శోచనీయమైనది.

'ఏవైనా విలువైన వస్తువులు, బంగారం శనివారంనాడు కొనకూడదట.' శనివారంనాడు ఏపనిచేసినా తృప్తికరంగా సాగదనే ఆలోచన కనపడుతుంది. ఈ వారానికి అధిపతి శని. శనిహోరతో మొదలవడమే గాక, వార దుర్ముహూర్తం కూడా ఉదయమే ఉంటుంది. సమాజంలో శనిని గూర్చిన భయం అధికమైనప్పటి నుండి ఇటువంటి సామెతలు బాగా ప్రచారంలోకి వచ్చాయి.

'శనివారంనాడు నూనె, ఇనుపవస్తువులు కొనరాదు.'

'శనివారంనాడు నువ్వులు, నువ్వులనూనె ఇతరులనుండి తీసుకొనిరారాదు.' ఈ వస్తువులన్నీ శనిప్రభావ జనితాలే. నలుపురంగు శనికి సంబంధించింది. నలుపు అశుభ సూచకం, అనే నమ్మకం. ఈనాటికీ నిరసన తెలిపేటపుడు నలుపురంగు బ్యాడ్జీలు ప్రదర్శిస్తారు. ఇనుముకు, నూనెలకు కూడా శనే అధిపతి.

శనివారంరోజు అసలే బావుండదని భావిస్తే దాని సంబంధ వస్తువులు తీసుకోవడం మరింత పీడాకరంగా భావిస్తారు.

'నువ్వులను దబ్బిచ్చి తీసుకోవాలి. ఊరికే తీసుకోకూడదు.'

'చెప్పులు పారవేసుకుంటే శని వదిలినట్లు భావిస్తారు'

నువ్వులు శనికి సంబంధించిన ధాన్యం. వీటిని ఊరికే తీసుకోవడం వల్ల వారింటి శని తమకు పడుతుందనడం ఛాయా మాత్రంగా జ్యోతిష లక్షణాలున్న నమ్మకమే. చెప్పులు పోగొట్టుకోవడంలో కూడా ఇటువంటి భావమే కనిపిస్తుంది.

'మంగళ, శుక్రవారాలు కొత్త చీపురుతో ఊడ్వరాదు.'

'మంగళ, శుక్రవారాలు ఇంటికి చీపురు తీసుకుపోరాదు.'

'మంగళ, శుక్రవారాలు ఇంట్లో బూజు దులపరాదు.'

'శుక్ర, మంగళవారాల్లో మట్టి పాత్రలు పగిలిపోతే అశుభం.'

'శుక్ర, మంగళవారాలలో ముత్తయిదువ చేతిగాజులు పగిలితే అశుభం.'

**'మంగళవారం, శుక్రవారం ఇంట్లోంచి ధాన్యం, ధనం ఎవరికీ ఇవ్వకూడదు.'**

**'శుక్రవారం దీపాలు వెలిగించిన తరువాత డబ్బు అప్పుగా ఇవ్వరాదట.'**

**'మంగళ శుక్రవారాలలో పాతగుడ్డను ఎవరికీ ఇవ్వరాదు. చాకలికి కూడా వేయకూడదు.'**

ఈ విధంగా మంగళ శుక్రవారాల ప్రాధాన్యమాధునిక కాలంలో అధికంగా కనిపిస్తుంది. శుక్రవారం లక్ష్మీ దైవతంగా ఇంట్లోని ఆడవాళ్లు ఆమె ప్రతిరూపాలుగా భావించారు. ఇంట్లోనుండి లక్ష్మీదేవిని పంపిస్తున్నభావం వారికి ఉంటుంది. అందుకే కొత్త చీపురుతో ఊడ్చి లక్ష్మిని పంపిచరాదని, బూజు దులపరాదని చెప్పారు.

ఈ వారాలలో ఆడపిల్లలను అత్తవారిండ్లకు కూడా పంపించరు. ఇది ఛాయా జ్యోతిషాంశమే. శుక్రవారంరోజు వివిధ నోములు చేసుకుంటారు. ఆ రోజున గాజులు పగలడం మొదలైన అంశాలు అమంగళమని విశ్వసించేవారు. మంగళవారం దగ్ధయోగంగా భావించడం వల్ల ఆవారానికి కుజుడు అధిపతి అయినందువల్ల శుభకార్యాలు మొదలుపెట్టరు.

**'శుక్రవారం ధాన్యాదిరాశుల కొలతకు మిక్కిలి శుభమట.'** ఇదికూడా లక్ష్మీదేవి తమ యింట చేరుతుందనే ఆధునిక విశ్వాసమే. అందుకే **'సంపద శుక్రవారంనోము'** వంటివి చాలా నోములు ఏర్పడినాయి.

**'సోమవారం ప్రత్తి ముట్టరాదు. శుక్రవారం ప్రత్తి విడిపింపరాదు.'** సోమవారానికి, ప్రత్తికి అధిపతి చంద్రుడు. **'చంద్రునికో నూలుపోగు'** అనే నానుడి ఈవిధంగా ఏర్పడిందే. కొంత మెరుపుతో కూడిన వస్త్రాలకు, లక్ష్మికి శుక్రవారం ప్రతీక. లక్ష్మిని ఇంటినుండి పంపించడం ఇష్టంలేక పై నమ్మకం ఏర్పడింది.



**'మంగళవారం అప్పుతీర్చాలట'** మంగళవారానికి అధిపతియైన అంగారకుడు ఋణవిమోచన కారకుడు. అప్పు ఉంటే ఆనాడు తీర్చివస్తే బాధలుండవని, అప్పులపాలు పడకుండా ఉండవచ్చని భావిస్తారు.

**'మంగళ, బుధవారాలలో మంచం అల్లకూడదట'**

మంచం అల్లడానికి కూడా పంచాంగాలు చూచేవారా అనే అనుమానంరావడం ప్రస్తుతం సహజం. మంచం ఎన్నో కామ్యకర్మలను తీర్చేది. భౌతిక ఆనందవేదిక మంచం. దానిని అల్లడం మంచిరోజు మంచి సమయంలో మొదలుపెట్టకపోతే మిగిలిన అన్ని విషయాలలాగే సౌఖ్యానుభూతులు పాడవుతాయి. దానినుండి మనసు స్థిమితంగా ఆలోచింపలేదు. అనర్థాలు ఎదురవుతాయి. అంతా నాశనానికి చేరుతుంది. **'మంచానికి నవారువేయడానికి ఆదివారం వేస్తే లాభమని, సోమవారం, సుఖమని, మంగళవారం అగ్ని దగ్ధమని, బుధవారం రోగమని, గురువారం పుత్రలాభమని, శుక్రవారం సౌఖ్యమని, శనివారం మరణమని అంటారు.'** ఇది నమ్మకం. దీనికి శాస్త్రీయ ఆధారం కూడా ఉంది.

**"ఆదిత్యలాభో శశినా సుఖంచ భౌమేచ దగ్ధాహి బుధాచ పీడా**
**గురుశ్చ సత్పుత్ర భృగుశ్చ సౌఖ్యం మందే మృతే ఖట్వ ఫల ప్రశస్తకం."**

అదే విధంగా

**'ఆది సోమ బుధ వారాలలో కొత్తకుండను తడపడం శుభం.'**

**'ఆదిసోమ బుధ వారాలలో కొత్తరోలు వాడడం శుభప్రదం.'**

మొదలైన వారాల శుభా శుభాధిపత్య విశేషాలు ఆయారోజుల్లో చేయగల్గిన పనులను గూర్చిన సామెతలు నమ్మకాలు కనపడుతున్నాయి. ఈ విధంగా జానపదుల నిత్య కర్మల్లో ప్రతిక్షణం జ్యోతిషంతో నిండి ఉండడం కనిపిస్తుంది.

## 11. మరణం :

'జాతస్య హి ధ్రువోర్మృత్యుః' అని గీతాచార్యుని బోధ. షోడశకర్మలలో పదహారవది మరణ సంస్కారమే. వ్యక్తి మరణించినపుడు మిగిలిన బ్రతికి ఉన్నవారు శుభంగా ఉండడానికి, ఇతర సామాజిక, పైత్రుక కర్మలు నెరవేర్చడానికి జ్యోతిషం కొన్ని మార్గాలను నిర్దేశించింది.

'చనిపోయిన వ్యక్తిని యింట్లో ఉంచినంతసేపు పడమరవైపు పెట్టాలి.'

'చనిపోయిన వ్యక్తిని పూడ్చేటప్పుడు తలను దక్షిణంవైపు పెట్టాలి.'

వీటిలో జ్యోతిష ప్రభావాంశాలు నమ్మకాలతో కలిసి జ్యోతిష భావం బాగా బయటికి కనపడుతుంది. మరణించిన తరువాత తూర్పు ఉత్తరాలవైపు చూస్తూ ఉన్నట్లుంచడం వల్ల ఉత్తమ లోకాలు పొందుతారని, దక్షిణం వైపు ఉంటే నరకంవైపు దృష్టి ఉండడంవల్ల అవి బాధాకరమని నమ్మకంతో ఆ పని చేయరు.

'నక్షత్రమేదైనా రాలిపోతే దేశంలో పెద్దనాయకులెవరో మరణిస్తారట.' ఇది శకున సంబంధ నమ్మకంగా మారింది.

'ఉడిగి ఉత్తరం చేరును' అని వ్యక్తి తన గొప్పతనం అంతా చూపించుకుని ఈ లోకంలో తిరిగి తిరిగి చివరకు వల్లకాడుకు చేరుతాడు. 'వల్లకాడు ఊరికి ఉత్తరంవైపు ఉండాలనేది' వాస్తుశాస్త్రం తెలియజేస్తుంది ఆ ప్రదేశంలోని కాలుతున్న శవాల పొగలు వాసనలు ఊరివైపు రాగూడదని దక్షిణంవైపు నుండి వచ్చే గాలులద్వారా అవి అటువైపే వెళ్లాలని నిర్ణయించారు. 'అన్ని తెలిసినమ్మ అమావాస్యనాడు చస్తే, ఏమి తెలియనమ్మ ఏకాదశినాడు చచ్చిందట' మరణం ఎవరికి వస్తుందో, ఎపుడు వస్తుందో చెప్పలేం. 'మృత్యువు పంచాంగం చూసి పనిచేయదు'. ఎంతగొప్ప పండితునికైనా దుర్దినాల్లో మరణం రావచ్చు. ఏమీ తెలియని వానికి మంచిరోజున మరణం రావచ్చు. అమావాస్య నాడు మరణం అనర్థదాయకమని, ఏకాదశి పర్వదినమవడం వల్ల మరణాంతరం



శుభలోకాల ప్రాప్తి అవుతుందని జ్యోతిస్సంబంధమైన అంశం. ఇదే అంశాన్ని అన్నీ తెలిసి తాను తప్పులు చేసేవాడు, ఏమీ తెలియకున్నా ఒప్పులు మంచి చేసేవారిమధ్య తారతమ్యం చెప్పడానికి ఈ సామెతలు వచ్చాయి.

ఈ విధంగా భారతీయుల నిత్యజీవనం గృహజీవనం అంతా జ్యోతిషంతో నిండి ఉంది. జానపదుల నమ్మకాలు, ఆచారాలు, సంప్రదాయాలు పాటించేవారంతా నగరాలలో నేడు నివసిస్తున్నప్పటికీ జానపదులే. పట్టణాలలో నివసించేవారు కూడా ఇప్పటికీ జానపదత్వంతోనే ఆ అలవాట్లను, సంప్రదాయాలను, ఆచారాలను పాటిస్తూనే ఉన్నారు. పుట్టుకనుండి మరణంవరకు ప్రతి అంశంలో ఈ శాస్త్ర అంశాలు అణువణువునా నిండి పురోగతికి మార్గాలవుతున్నాయి.

## 2. వైద్యం :

జానపదుల వైద్యం రోగులపై శీఘ్రమైన ప్రభావం కల్గజేసి చిరాయుష్మంతులను చేస్తుంది. జ్యోతిర్వైద్యానికి జానపదుల నిత్యజీవన వైద్యానికి దగ్గరి సంబంధం ఉంది. జానపదులు తమ వైద్యంలో ఉన్న లోపం కన్నా వ్యక్తి ఆయుష్యానికి ఎక్కువ ప్రాధాన్య మిస్తారు.

'ఆయుష్యం గట్టిగా ఉంటే అడవిలో ఉన్నా ఒకటే అయోధ్యలో ఉన్నా ఒకటే' అని భావిస్తారు. 'ఆయుష్యం గల రోగి హస్తవాసి గల వైద్యుని దగ్గరకు పోతాడు.' వైద్య ప్రక్రియ కన్నా ఆయుర్దాయగణన అధిక ప్రాధాన్యం కలిగి ఉంటుంది. జర్మనీలో వైద్యులకు జ్యోతిషం ఒక అంశంగా ఉంది. అమెరికాలో 21 విశ్వవిద్యాలయాల్లో ఈ పరిశోధనలు సాగుతున్నాయి. భారతీయులు వైద్యుని నారాయణునితో సమానంగా భావిస్తారు.

"శరీరే జర్జరే భూతే వ్యాధిగ్రస్తే కళేబరే
ఔషధం జాహ్నవీతోయం వైద్యో నారాయణో హరిః"

1. ఆరోగ్యం :

భారతీయజ్యోతిషంలో గ్రహ నక్షత్ర స్థితులు, దశల ఆధారంగా చేసే వైద్యం చక్కని ఫలితాలనిస్తుంది. ఈ వైద్యం కూడా ప్రకృతినుండి జరిగితే ఉత్తమమని భారతీయ ప్రకృతి శాస్త్రవేత్తల భావం. ప్రకృతిలోని శక్తిని వినియోగించుకోవాలని జ్యోతిష్కులు సూచిస్తుంటారు. ఒక స్త్రీకి గర్భస్థదోషం ఉంది. సంతానం కలగడంలేదు. రావిచెట్టు చుట్టూ ప్రదక్షిణం చేస్తే, గర్భస్థ దోషాలు తొలగుతాయని చెప్పినారు. ప్రదక్షిణలు చేస్తుంటేనే గర్భం వస్తుందేమోనని అనుకున్నదొక అమాయకజీవి. **'అశ్వత్థ ప్రదక్షిణం చేసి కడుపు పట్టుకు చూసుకున్నట్లు'** అనే సామెత ఈ స్థితిని వివరించేదే. రావి చెట్టు గాలి ఆ చెట్టుక్రింద కూర్చోవడం ఆరోగ్యకరం. ప్రాణిక్ హీలింగ్ వంటి ప్రాచీన వైద్యశాస్త్ర గ్రంథాలు శరీరం బాగా రోగగ్రస్థమైనపుడు సముద్రస్నానం చేసి రావిచెట్టు కింద విశ్రాంతిని తీసుకోవాలని తెలుపుతుంది. ఈ కారణంగా రావిచెట్టు హిందువులకు పూజనీయమైన వృక్షమైంది. గ్రామదేవతలు ఎక్కువగా ఈ చెట్లక్రిందనే ఉంటారు. ఇటువంటి శుభలక్షణాలనే వేపచెట్టు కూడా కలుగచేస్తుంది.

**'అశ్వత్థవృక్షం, వేపచెట్టు భార్యాభర్తలు. వాటికి శాస్త్రోక్తంగా వివాహం జరిపిస్తే పిల్లలవుతారట.'** అనే నమ్మకం వైద్యపరమైందే. రెండు వృక్షాలు ఒకే దగ్గర ఉండడంవల్ల వాటి గాలితో అనారోగ్యకరమైన అంశాలన్నీ దూరమవుతాయి. శరీరంలోని దోషాలు పోతాయి. వ్యక్తికి దృఢమైన శరీరం ఉంటుంది. రావిచెట్టుకూ, వేపచెట్టుకూ, ఆయుర్వేద వైద్యపరంగా ఎంతో విలువ ఉంది. గాలి ఎంతో ప్రత్యేకతను పొందింది.

**'అమావాస్య పౌర్ణమి రోజుల్లో పిచ్చి ముదురుతుందట'** కారణం చంద్రుడి ప్రభావమే. శరీరంలోని నీటిని చంద్రకిరణాలు ఆకర్షించడం, దాని ప్రభావం మనసుపై పడడం. మనో దౌర్బల్యమున్నవారు ఆ ఒత్తిడికి తట్టుకోలేక పిచ్చివాళ్లు కావడం వంటి విశేషాలు కనపడుతున్నాయి.

**'పౌర్ణమిరోజుల్లో రోగం తిరగబడుతుందట.'**



**"అమావాస్యనాడు ఆడవాళ్లకు, పౌర్ణమి మగవాళ్లకు, రోగం తిరగబడ్తుందట.'** అనే తిథులపరమైన పూర్ణ జ్యోతిషాలైన నమ్మకాలున్నాయి. జ్యోతిశ్శాస్త్రరీత్యా చంద్రుడు జలకారకుడు. మనఃకారకుడు. పౌర్ణమినాడు సూర్యచంద్రుల మధ్య 180 డిగ్రీల అంతరం ఉంటుంది. భూమికి రెండువైపులా ఇద్దరి ఆకర్షణలబలం ఒకేవైపు పని చేస్తుంది. సముద్రంలో ఆటుపోటులు అత్యధికంగా పౌర్ణమి, అమావాస్యలలో వస్తుండే కారణం ఇదే. సముద్రం నీటిపై ప్రత్యక్షంగా కనిపించిన విధంగానే మనుషుల శరీరంలో ఉన్న నీటిని రక్తాన్ని ఆకర్షించడం కనిపిస్తుంది. అమావాస్య పౌర్ణమి తిథులలో ఈ రక్తపోటు, హృదయభారం అధికమవుతుంది. రోగమున్నవారికి ఇది బాధను కలుగజేయగా రోగంలేని వాళ్లకు ఆహ్లాదాన్ని కలుగజేస్తుంది. రక్తసంబంధ దోషాలు అధికంగా కనిపించే స్త్రీలలో మాత్రం అమావాస్య అధిక దోషఫలితాన్ని ఇస్తుంది. అందుకే అటువంటి రోగాలు తిరగబడతాయి. మనః కారకుడైన చంద్రుని పూర్ణబలం, బలహీనం రెండు సమయాలు, పిచ్చివంటి మానసిక వ్యాధులు అధికంగా వస్తాయి. కాబట్టి రోగగ్రస్థులు ఈ విషయాన్ని గుర్తు పెట్టుకొని ముందుజాగ్రత్తలు తీసుకోవాలని జానపదులు, జ్యోతిష్కులు వివిధ మార్గాలలో సూచనలను చేస్తారు.

కార్తీకమాసం వచ్చేవరకు వానలు చివరకు వస్తాయి. నేల చిత్తడిగా ఉంటుంది. ఈ ఋతుసంబంధమైన మార్పులు కార్తీక మాసంలో అధికం. ఆ సమయంలో కొన్ని రకాల అంటువ్యాధులు ప్రబలే అవకాశం ఉంది. అందుకే ఒక వైద్యుడు తన భార్యతో **'కార్తీకం రాని కమ్మలు, కడియాలు చేయిస్తానన్నాడట'** ఈ రకమైన జ్యోతిష విజ్ఞానం మాత్రమేకాక ఆ కాలాలలో తీసుకోవలసిన చిట్కాలను జానపద వైద్యం తెలియజేస్తుంది.

**'విశాఖవర్షం-వ్యాధులకు హర్షం'** సూర్యుడు ఒక్కో నక్షత్రంలో ప్రవేశించినపుడు ఆ నక్షత్ర కార్తె అంటారు. విశాఖలోకి సూర్యుడు ప్రవేశించే సమయం దాదాపు నవంబరు మొదటి వారమవుతుంది. ఇది కాలం మారే సమయం. ఈ మార్పుకు శరీరాలలో కొద్ది బలహీనమున్నా, రోగ నిరోధక శక్తి లేకున్నా తట్టుకోవడం కష్టం.

అందుకే ఈ కాలం వ్యాధులకు హర్షం 'విశాఖ కురిస్తే విషం పెట్టినట్లు' అనే సామెతకూడా ఉంది. ఇది మనుషుల ఆరోగ్యాలకు, పంటల సంబంధానికి కూడా వర్తిస్తుంది.

అనుభవశాలియైన వైద్యుడు రోగాలను క్షుణ్ణంగా అధ్యయనం చేయగలడు. ఆ అనుభవం నిరంతర పరిశీలనల వల్ల వస్తుంది. పూర్తి అనుభవం వచ్చేసరికి అతడు వృద్ధుడవుతాడు. చిన్నవయసులో జ్యోతిషం నేర్చుకుంటే గణితసంబంధమైన విశ్లేషణాశక్తి అధికంగా ఉండడంవల్ల లెక్కలు త్వరగా కట్టగలుగుతాడు. ఆ విధమైన ఆలోచనలతో ముందుకు వెళ్తే జ్యోతిషాన్ని సక్రమంగా అధ్యయనం చేసి ఫలితవిశ్లేషణ చేసే అవకాశం ఉంటుంది. అందుకే **'బాల జ్యోతిషం-వృద్ధవైద్యం'** అనే సామెత వచ్చింది.

**"పూర్వజన్మ కృతం పాపం వ్యాధిరూపేణ పీడ్యతే**
**తచ్ఛాంతిరౌషధై ర్దానైః జపహోమ సురార్చనైః"**

మానవులు పూర్వజన్మంలో చేసిన పాపంవల్ల ఈ జన్మలో వ్యాధిరూపంలో పీడించబడతారు. అటువంటి వానికి ఔషధాలచేత, దానాలచేత, జపహోమాదులచేత, దేవబ్రాహ్మణ పూజలచేత శాంతి కలుగుతుందని ధర్మశాస్త్ర ప్రమాణముంది.

పూర్వజన్మ సంబంధమైన అంశాలుకూడా జానపదులకు చిరపరిచితాలు. **'పూర్వజన్మలో చేసిన దుష్కృత్యాలవల్ల ఈ జన్మలో కష్టాలను అనుభవిస్తారు'. 'కాల కర్మగతులు కనిపెట్టనలేనయా'** అని కష్టాలను గమనించిన సందర్భంలో అంటుంటారు. **'పాప పరిహారార్థం ఇతరులు చేసిన దానాన్ని స్వీకరించిన తర్వాత జపతపాలతో ఆ పాపం పోగొట్టుకోవాలట'** అనే నమ్మకంఉంది. జపతపాలవల్ల అవతల వ్యక్తికి మనశ్శుద్ధి కలుగుతుందనీ మనసు శుద్ధమయితే శరీరానికి రోగాలు దరి చేరవని భావన. వ్యాధి సమూలమైన నాశనానికి మనోమూలం నుండి తుడిచిపెట్టుక పోవడానికి భారతీయ జ్యోతిష్కుల ప్రయత్నం ప్రశంసమైనది.



జానపదవైద్యానికి జ్యోతిర్వైద్యానికి దగ్గర సబంధం కనపడుతుంది. జ్యోతిష పరమైన ప్రకృతిప్రభావాలు, మూలికలగుణాలు జానపదుల వైద్యంగామారి ఉండవచ్చు. జానపదులు వ్యాధి అనేది పూర్వజన్మ పాప ఫలితంగా భావిస్తారు. దానికి ఔషధాలు, దానాలు, జపాలు, హోమాలు దేవీపూజ, బ్రాహ్మణపూజలు చేయించాలని, తద్వారా శాంతి కలుగుతుందని నమ్మకం ఉంది.

'Prevention is better than cure' అనే అంశమాధారంగా జానపద జ్యోతిర్వైద్యాలున్నాయి. ముందుజాగ్రత్తలు వ్యాధి రాకుండా నిరోధిస్తాయి. దీనికి వివిధ రకాల పద్ధతులు అమలులో ఉన్నాయి. మానవశరీరంలో అన్నమయ, ప్రాణ మయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ కోశాలుంటాయి. ఒక్కోకోశం ఒక్కో పనిచేస్తుంది. అన్నమయకోశానికి తగినంత సంపూర్ణ ఆహారం, ప్రాణమయ కోశానికి ప్రాణాయామం, మనోమయకోశానికి ధ్యానం, విజ్ఞానమయ కోశానికి అధ్యయన స్వాధ్యాయాలు, పఠనపాఠనాలు, ఆనందమయ కోశం వీటన్నింటి ఫలితమైన ఆనందానికి హేతువవుతుంది.

**'యుక్తాహార విహారస్య యుక్తచేష్టస్య కర్మసు**
**యుక్త స్వప్నావ బోధస్య** ............' అన్న భగవద్గీతావచనం తెలిసిందే.

అన్నమయకోశానికి అందజేసే ఆహారం శక్తివంతమై ఇతరరోగాలను అణచేదిగా ఉండాలి. ఆహారపదార్థాల ఉత్పత్తి కూడా సూర్యకిరణ సంబంధమైన కిరణజన్య సంయోగక్రియ ద్వారా జరిగేదే ఎటువంటి ఆహారం తీసుకుంటే రోగనిరోధక శక్తి పెరుగుతుందో గమనించి తీసుకోవాలి. ప్రకృతిలోని వివిధ వృక్షజాతులనుండి ఉత్పన్నమైన ఆకులు, పూవులు, కాయలు, పండ్లు, వేర్లు ఆహారపదార్థాలుగా తీసుకోవడం ఆరోగ్యవృద్ధికరం. అదేవిధంగా నిత్య ప్రాణాయామ సాధన, ధ్యానం, అధ్యయన స్వాధ్యాయాలు వల్ల ఆనందంపొందే మార్గం ఈ వైద్య విధానం చెపుతుంది. ఈ జ్యోతిర్వైద్య విధానం అందరికీ ఆనందాన్ని కలిగిస్తుంది.

ప్రకృతిపై జ్యోతిస్సుల ప్రభావం అధికం ఒక్కో పదార్థం ఒక్కో వ్యాధి రాకుండా కాపాడుతుంది. వీటిని గమనించి ఉపయోగించడమే ఆయుర్వేద విజ్ఞానధర్మం. అలోపతి వంటి వైద్యాలు తాత్కాలిక నివారణేగాని శాశ్వతంకాదని దాదాపు అందరూ అంగీకరించిందే. వాటి నుండి ఏర్పడే విషఫలితాలు శరీరం రోగగ్రస్థం కావడానికి తోడ్పడతాయని తేల్చారు. జ్యోతిస్సుల ప్రభావం మనుషులపైనే గాక ప్రకృతిలో సకల చరాచర జీవులపై ఉంటుంది. వాటిని గుర్తించి ఉపయోగించుకోవడంలో కాలాన్ని దృష్టిలో పెట్టుకోవాలి. సరియైన కాలంలో తీసుకోని మందులు విషపదార్థాలుగాను మంచికాలంలో తీసుకునే ఎటువంటి పదార్థమైనా, మందులైనా అమృతంగా మారుతుందని జ్యోతిశ్శాస్త్రం చెపుతుంది. చరకసంహిత, శుశ్రుతంవంటి అతి ప్రాచీన వైద్యశాస్త్రగ్రంథాలలో వైద్యునికి అమృత విషకాలాల పరిజ్ఞానం ఉండి ఔషధం తయారుచేసి ఉపయోగించాలని తెలుపుతుంది.

జ్యోతిష్కునికి శరీరంలోని సప్తధాతువులు, జాతకంలోని సప్తగ్రహాలమీద అవగాహన ఉండాలి. ఒక్కోగ్రహం ఒక్కో సమయంలో సరియైన ఫలితాలను లేదా వ్యతిరేక ఫలితాలనిస్తుంటే అవి జాతకంలో ఎక్కడున్నాయో గమనించి ఆ భావ, రాశిపరమైన శరీరభాగానికి ఆ గ్రహసంబంధ అనారోగ్యం వస్తుందని, దానికి నివారణగా వివిధ ప్రక్రియలు సూచిస్తాడు. ఆ నివారణా మార్గాలలో రత్నశాస్త్రమొకటి. శరీరానికి అందం కలిగించి వివిధ భాగాలపై ఈ కాంతులు చర్య జరుపుతాయి. దశల ప్రకారం వివిధ లోహాలలో వివిధ రత్నాలను పరీక్షించి చేతిక పెట్టుకోవడం ద్వారా రోగనివారణ జరుగుతుంది. దీనిని జెమ్ థెరఫీ, స్టెల్లార్ హీలింగ్ అని అంటారు.

ఒక్కో పక్షిపై ఒక్కో కాంతి ఒక్కో విధమైన ప్రేరణను కలుగజేస్తుంది. ఈ కాంతి వాటి గొంతుల్లో వేరువేరు రాగాలను పలికిస్తుంది. స-రి-గ-మ-ప-ద-ని- అనే స్వరాలు సంగీతానికి మూల స్వరాలు. ఈ స్వరాలు వింటూంటే మనసుకు ప్రశాంతత కలుగుతుంది. వీటికి జ్యోతిష కాంతులే మూలస్థానంగా కనపడుతున్నాయి. ఒక్కో రకమైన వ్యాధికి ఒక్కోస్వరాన్ని వింటుండడం వల్ల మనశ్శాంతి కలుగుతుంది.



దాని ద్వారా రోగం నమయమవుతుంది. 'రాగాలతో రోగాలు నయమవుతాయి.' అనే సామెత దీనినుండి వచ్చిందే.

జ్యోతిష్కులు జపహోమదానాదులు వ్యాధి నివారణా చర్యలుగా చూపిస్తారు. జపం మంత్రపఠనంద్వారా జరుగుతుంది. **'మననాత్ త్రాయతే ఇతి మంత్రః'** మంత్రానికి వ్యుత్పత్తి. నిరంతరం మననం వలన మంత్రం రక్షిస్తుంది. భాషాశాస్త్రం ప్రకారం అచ్చులు, హల్లులు ఉద్భవించేస్థానాలు శరీరంలో వేరువేరు ప్రదేశాలలో ఉన్నాయి. ఆయా అక్షరాలను ఉచ్చరించడం ద్వారా శరీరంలోని శక్తి కేంద్రాలలో కదలిక వస్తుంది. హార్మోన్ల సరియైన విడుదలలో క్రమబద్ధత ఏర్పడుతుంది. ఈ శక్తికేంద్రాలనే షట్చక్రాలని యోగశాస్త్రం చెపుతుంది. ప్రాణిక్‌హీలింగ్ వంటి వైద్యగ్రంథాలలో ఈ షట్చక్రాల ప్రేరేపణ ఏవింగా చేయాలనే విషయాలున్నాయి. ఈ పద్ధతుల్లో స్వర ఉచ్చారణ ఒక భాగం. మంత్రం ఉచ్చరిస్తుండడం వల్ల శారీరకంగా ఆమంత్రం తనను రక్షిస్తుందన్న అభిప్రాయంతోను మానసికంగా వ్యక్తి ఆనందమార్గాన్ని చేరుకుంటాడు. ఆరోగ్యపథానికి దగ్గరవుతాడు. దీనిని ఉచ్చరించలేనంత స్థితిలో రోగి ఉంటే అతని కర్ణరంధ్రాల ద్వారా శబ్దాలు ప్రసరించే విధంగా గట్టిగా ఉచ్చరించాలి. ఒక్కో అక్షరం ఉచ్చారణలో ఎక్కడనుండి వస్తుందో దానిద్వారా ప్రేరేపించబడే శరీర భాగమేది? అనే అంశాలు ప్రత్యేకంగా పరిశీలించాల్సి ఉంది. దీనిని మంత్రథెరఫీ అని కూడా అంటారు.

వేదకాలం నుండి భారతీయులకు యజ్ఞయాగాదులు తెలుసు. కల్ప సూత్రాల యజ్ఞయాగాదుల సమయంలో వివిధ కర్మలను నిర్దేశిస్తుంది. జ్యోతిషం ఆ యాగాదులకు సరియైన సమయనిర్ధారణ చేస్తుంది. వాటివల్ల ప్రకృతిలో శుద్ధత ఏర్పడుతుంది. **'నిత్యం హోమం చేసుకునే గృహంలోకి దయ్యాలు ప్రవేశించవట'** దయ్యం దైవానికి వికృతి. శుభం కలుగజేస్తే దైవమని, పీడిస్తే దయ్యమని అనడం ఆనాటి నుండి పరిపాటి అయింది. నిత్యం హోమంచేసే గృహంలో పొగంతా ఇంటి నిండా నిండడంవల్ల అంటువ్యాధులకు ఆస్కారం ఉండదు. విషవాయువులు

ప్రవేశింపలేవు. శుద్ధత్వమేర్పడుతుంది. ఇంటి మొత్తంలో ఇటువంటివాని వల్ల ఇంటిలోని అందరికీ ఆరోగ్యం చేకూరుతుంది. హోమాలలో వివిధ గ్రహాలకు సంబంధించి వేరువేరు సమిధలనుపయోగింపమని శాస్త్రోక్తం. ఆయా సమిధలనుండి వెలువడ్డ పొగవల్ల ఆ గ్రహసంబంధమైన ఆరోగ్యం శరీరానికి రాకుండా ఉంటుంది. ఈ ప్రక్రియలో మంత్రోచ్చాటన కూడా ప్రాధాన్యం వహించింది. దీనినే హోమథెరపీ అని కూడా అంటున్నారు. వీనిని సామూహికంగా నిర్వహిస్తే పూర్తి వాతావరణం శుద్ధమవుతుంది. ఈ విషయమై శాస్త్రజ్ఞులు వివరంగా పరిశోధించి వివేచించాల్సి ఉంది.

దానం చేయడమనేది ఒక శుద్ధమైన మానసిక ప్రక్రియ. దానం చేయడం హోమం చేయడం మొ॥గు కార్యక్రమాల ద్వారా శరీరంలో కొన్ని స్రావాలు విడుదల అవుతున్నాయని ఆధునిక శారీరక వైజ్ఞానికులు పరిశోధనల ద్వారా తెలియజేస్తున్నారు. దానినుండి మనసు అనారోగ్యాల నుండి దూరమవుతుంది. మనసుతో శరీరం కూడా రోగ విముక్తమవుతుంది. అయితే దానం మనస్ఫూర్తిగా చేయాలనే కోరికతోనూ పుట్టిందై ఉండాలి. **'బలవంతపు మాఘస్నానాల'** వల్ల ప్రయోజనం లేదు.

వివిధ గ్రహాల ప్రభావాలను ఆధారంగా చేసుకుని ఔషధాలు ఇవ్వాలి. అనారోగ్యం ఏమిటో అవి ఎందుకు కలుగుతున్నాయో గమనించి లోపాన్ని పూరించే ఆహారం, ఔషధాలు ఇచ్చి రోగవిముక్తి చేయవచ్చు. 'ఆహారవిజ్ఞానశాస్త్రం' ఈ విషయాలను ప్రస్తుతకాలంలో పనిగట్టుకొని ప్రచారం చేస్తుంది. ఆకాశాన్ని అరచేతిలోని జాతకంలో చూస్తూ ఏ గ్రహం ఏ భావంలో ఉందో జ్యోతిష్కునికి పరిశీలనలో తెలుస్తుంది. అతనికి మిగిలిన శాస్త్రాలతో సంబంధం ఈకాలంలో తక్కువగా కనిపిస్తుంది. అతడు తనకు తెలిసిన శాంతి మార్గాలు ఆ దోషగ్రహ సంబంధమైనవి మాత్రం సూచిస్తుంటాడు. దానిద్వారా శారీరకంగా వ్యాధి నయంకాగా దైవసంబంధ అంశాల ధృవీకరణవల్ల మానసికంగా స్వస్థత చేకూరుతుంది. ఈ అన్ని విషయాలపై ప్రత్యేకమైన సాధారణమైన చర్చ వివిధ వైద్యులు, శాస్త్రవేత్తలు, జ్యోతిష్కుల మధ్య జరిగిన జానపద, జ్యోతిర్వైద్యాలకు సంబంధం కుదుర్చాల్సిన ఆవశ్యకత ఉంది.



**'జానపద వైద్యంలో పాటీక కట్టడం ఒకటి.'** పిల్లల రోగాన్ని మాన్పటానికిగాను ఒక తెల్లనిగుడ్డకు పసుపుపూసి అందులో తాంబూలం, దక్షిణపెట్టి ముడివేసి దాన్ని ఊరి బయటనున్న జిల్లెడుచెట్టుకు కట్టాలి. దీనినే 'పాటీక కట్టడం' అంటారు. పాటీక కట్టిన మూడురోజులు భిక్షవేస్తే దాని శక్తి శూన్యమవుతుందనే భావం ఉంది. జబ్బు నయంకాదట.

'పాటీక కట్టడం' జిల్లెడు చెట్టుకే కడతారు. జ్యోతిశ్శాస్త్రరీత్యా సూర్యునికి సంబంధించిన వృక్షం జిల్లేడు. దీనినే అర్కవృక్షం అంటాం. **'ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్'** అని స్మృతివాక్యం. **'సూర్య ఆత్మా జగతస్తస్థుశ్చ'** అని ఉపనిషద్వాక్యం. అర్కవృక్షంతో 56 రకాల రోగాలు తగ్గుతాయని ఆయుర్వేదం చెబుతుంది. దీన్నే **'అర్కవ్రతం'** అంటారు. జిల్లేడుచెట్టుయొక్క ప్రతిభాగం మందుగా ఉపయోగపడుతుంది. పిల్లలరోగాలు ఇటువంటి విధానాలవల్ల తగ్గుతాయన్న నమ్మకం జ్యోతిషశాస్త్రజ్ఞులు కూడా తెలియజేస్తున్నారు.

ఆరోగ్యం కాపాడుకునే మార్గంలో వివిధ పద్ధతులను జానపదులు ఆచరిస్తారు. **'రోజూ ఉదయాన్నే లేచి ఇంటిముందర నీళ్లుచల్లి పేడనీళ్లతో అలకాలి'** ఇది ప్రస్తుతం పట్టణవాతావరణంలో కొంత లోపించినా, పల్లెటూళ్లలోమాత్రం తప్పకుండా కనపడు తుంది. పేడలోని శక్తి కొన్నిరకాల బ్యాక్టీరియా బయటినుండి లోపలికి చేరకుండా రక్షిస్తుంది. అదేవిధంగా **'రోజూ ఇంటిముందర ముగ్గులు వేయాలి'** ఇది నమ్మకమే. దీనిద్వారా ఇంటికి అలంకరణలో నూతనత్వం కనపడుతుంది. సుద్దతో ముగ్గు చేస్తారు. దీనిలో కాల్షియం ఉండడం వల్ల అతి సూక్ష్మజీవులను ప్రేరేపించకుండా నిరోధిస్తుంది. అసలు ముగ్గులు వేసే అలవాటు సంప్రదాయం కళ కూడా. ఆకాశంలోని నక్షత్రాలు–అవి కలిసినట్లుండే అల్లికలలాంటి కళాత్మక నిర్మాణం ద్వారా వచ్చిందంటే అతిశయోక్తికాదు.

వైద్య ప్రక్రియల్లోని అంశాలను జ్యోతిష్కులు శాంతిప్రక్రియలుగా భావిస్తారు. నవగ్రహాలకు శాంతి ప్రక్రియలు ఏర్పాటు చేశారు. ఒక గ్రహశాంతి అంటే ఆ

గ్రహసంబంధమైన ధాతువు శరీరంలో లోపించడం, దాన్ని తిరిగి మామూలుస్థితికి తీసుకుని రావడానికి మనం ప్రయత్నం చేయడం అని అర్థం. 'నవగ్రహ శాంతులలో ఇనుము, పత్తి, నూలును దానంగా తీసుకోరాదు' ఇనుము, శనికి, పత్తి, నూలు చంద్రునికి సంబంధించిన వస్తువులు. గ్రహసంబంధ వస్తువులు అంటే ఆ గ్రహ కాంతులవల్ల ఈ వృక్షఫలాలు కనపడుతుంటాయి. రెండింటి లక్షణాలలో సామ్యం ఉంటుంది. ఇటువంటివి తీసుకోవడం వల్ల ఇచ్చేవారి కష్టాలు తీసుకున్నవారికి చేరుతాయని దానినుండి తమకు కష్టాలు మొదలవుతాయన్న నమ్మకం దాన స్వీకర్తలలో అధికులకు ఉంది. నువ్వులదానం, ఇనుము దానం చాలా తక్కువమంది, అంటే ముందు వెనుకలలో ఎవరూలేనివారు మాత్రమే తీసుకుంటున్నారు.

నిద్రించే సమయంలో కూడా దిశను జ్యోతిషం సూచిస్తుంది. ఇదీ ఆరోగ్యసూత్రమే. **'దక్షిణంవైపు తలపెట్టుకుని పదుకోవాలట' 'ఉత్తరం తూర్పు, పడమర దిక్కుల్లో తలపెట్టుకొని పడుకోరాదట.'** ఈ నమ్మకం కూడా సహేతుకమే. భూమి తన చుట్టు తాను తిరుగుతూ సూర్యునిచుట్టూ తిరుగుతూ ఉంటుంది. పడమరనుండి తూర్పువైపు ఈ ఆత్మభ్రమణం ఉంది. నదులన్నీ అందుకే పడమర నుండి తూర్పుకు ప్రయాణిస్తున్నాయి. పడుకునే సమయంలోనూ ప్రకృతిని అనుసరించాలి. నిద్రపోయే కాలం కూడా మనకు అధికం. భూమి తిరిగిన విధంగానే భూమిచుట్టూ ఉన్న అయస్కాంత తరంగాలు భూగర్భంలోని తరంగాలు ప్రయాణం చేస్తుంటాయి. వీటికి అనుకూలంగా మనం స్పందించినపుడు ప్రకృతి మనకు అనుకూలంగా మారుతుంది. ప్రతికూలమైన విధంగా ఉంటే ప్రకృతి మనను వ్యతిరేకిస్తుంది. ఈ ప్రభావం మనసుపైనే పడుతుంది. మనసు అల్లకల్లోలమవుతుంది. ఆనందం నాశనమవుతుంది. ఎత్తు ఉన్నవైపు, తలవైపునుండి కాళ్లవైపు తరంగప్రసారం ఉండే విధంగాను, వివిధ నక్షత్ర మండలాల అనుకూలతరంగాలు ప్రసరించేవైపు నిద్రించాలి. ఉత్తరంవైపున్న నక్షత్రాలు శుభఫలితాన్నివ్వడం, భూమార్గానికి, ఉత్తరంవైపు అధిక నక్షత్రబలం ఉండడంవల్ల సూర్యుని 'ఉత్తరాయణం' మనకు పుణ్యకాలమైంది. అందుకే ఉత్తరంవైపు చూస్తూ



పదుకోవాలని నమ్మకం ఏర్పడింది. దీనికి వ్యతిరేకమైతే మిగిలిన ఎన్నో అంశాలు వ్యతిరేకమవుతాయనే శాస్త్రీయజ్ఞానంతోనే దక్షిణానికి అధిపతి యముడని అటువైపు చూస్తూ **'ఉత్తరదిశగా తలపెట్టుకు పదుకోరాదు'** అని సామెతలు, నమ్మకాలు వచ్చాయి.

ఆరోగ్యసూత్రాలలో చిన్నతనంనుండే పిల్లలను సక్రమంగా తీర్చి దిద్దడంలో కొన్ని జ్యోతిషసంబంధ సామెతలు కనపడతాయి. **'కాలుసరిగా కదుక్కోకపోతే శని పట్టుకుంటుంది'** దీనిలో ఆరోగ్యసూత్రం కనపడుతుంది. కాని మారుతున్న కాలంలో క్రమగతిలో శనిపై అధికమైన దురభిప్రాయం ఏర్పడింది. ఏలినాటిశని కష్టకారకుడు. అయినా అన్ని విషయాలలో కాదు. కొన్ని సమయాలలో శని అత్యంతవృద్ధికారకుడు. ఆయుష్కారకుడు. సామాజికుల భయభావన శనిగ్రహంద్వారాను, పిల్లలను తల్లి తిడ్తూ చెప్పడంలో శని భయం వారికి పెట్టడంద్వారా ఆరోగ్యం కాపాడుకునే సూచనలు, సూత్రాలున్నాయి. **'ఆరునెలలకు చచ్చేవాడికి అరుంధతి కనపడదు'** పెళ్లినాడు చూపించే అరుంధతీ నక్షత్రం. మరణం కంటిచూపు తగ్గిన వృద్ధులకు అనువర్తించే సామెతగా ఇది కనపడుతుంది. **'ఆశ్లేష కురిస్తే అంతా ఆరోగ్యం'** వర్షాలు సరియైన కాలంలో పంటలు బాగా పండడం. అంతవరకూ ప్రకృతిలో వాతావరణం నిలిచిన సూక్ష్మజీవుల నాశనం జరుగుతుంది. ఆశ్లేష నక్షత్రంలో దాదాపు ఆగస్టు మొదటివారంలో సూర్యుడు ప్రవేశిస్తాడు. వానలు పడే అదను ఇది. ఈ సమయంలో పడే వర్షం ఆనంద ఆరోగ్యాలకు హేతువవుతుంది.

భారతీయ జీవనంలో ఆరోగ్యసంబంధమైన సామెతలు జ్యోతిషార్థాలలో ఈ విధంగా వ్యక్తీకరింపబడినాయి.

## 2. ఆహారం :

వైద్యపరంగా పరిశీలించాల్సిన సామెతల్లో ఆహార సంబంధమైనవి కూడా అధికంగా ఉన్నాయి. **'గ్రహాలప్రభావంవల్ల మనుషుల మంచి చెడ్డలు ఆధారపడి ఉంటాయట.'** ఈ విషయంకూడా జానపద సహేతుక నమ్మకమే. వివిధ గ్రహాల

కాంతులు శరీరంపై ప్రత్యక్షంగా తినే వివిధ ఆహార పదార్థాలపై పరోక్షంగా పడడం ఆయా కాంతులను వ్యక్తులు గ్రహించడం వానిద్వారా మనసుయొక్క ఆలోచనా రీతులలో మార్పురావడం దానినుండి మంచి చెడ్డగుర్తించి అనుభవించడం జరుగుతూనే ఉంది. అయితే ఈ వైద్యవిధానాలు మంచివైపు ప్రయాణింపజేసే వాహకాలుగా కనిపిస్తాయి.

**'అన్నప్రాశనం నాడే ఆవకాయ దిప్పా'** అన్నాడట. కొడితే ఏనుగు కుంభస్థలాన్ని కొట్టాలనే భావం దీనిలో కనపడుతుంది. అన్నప్రాశనం షోడశకర్మలలో ఒకటి. ఈ రోజున తీపి పదార్థం కొద్దిగా మొదటసారి శిశువుకు నోట్లోపెట్టే సంప్రదాయం ఉంది. ఇది మగపిల్లలకు ఆరవనెల, ఆడపిల్లలకు ఐదవనెల చేసే సంప్రదాయం ఉంది. **'అన్నం ఎక్కువైతే ఆచారం ఎక్కువ ఆచారం ఎక్కువైతే గ్రహచారం తక్కువ'** అన్నభావం అతి ఛాందసంగా ప్రవర్తించే వారినుద్దేశించింది. ఎన్ని ఉన్నా ఈ గ్రహచారం లేకుంటే ఇబ్బంది అధికమనే భావం, శాస్త్రీయదృష్టి భారతీయులకు అలవాటుగా మారింది.

**'ఆదివారం ఉసిరికాయ తినకూడదు'** ఆదివారం రవి ప్రభావం అధికంగా ఉంటుంది. ఉసిరికాయలోని ఆమ్లగుణం శుక్రునికి సంబంధించింది. గ్రహ ప్రభావాల రీత్యా రవి శుక్రులకు శత్రుత్వం ఉంది. విరుద్ధ స్వభావాలున్న ఆహారం శరీరం అసంతులితమవడానికి అవకాశాలిస్తుంది. అందువల్ల ఆదివారం ఉసిరికాయ తినడం తప్పుగా భావిస్తారు. అదేవిధంగా జలుబుగుణం రాత్రిపూట అధికమైనందువల్ల ఉసిరికాయవంటి ప్రేరకాలను తీసుకోవద్దని చెపుతారు. కనీసం పేరు గూడా ఉచ్చరించవద్దనే మాట కచ్చితంగా చెప్తే తప్ప ఆ పని చేయకుండా ఉండదనే నమ్మకంతో ఈ ఉసిరికాయ సంబంధ నమ్మకాలు ఏర్పడినాయి.

**'అమావాస్యనాడు అట్లు పున్నానికి బూరెలు'** ఇవి ఆయా రోజుల్లో తీసుకోవడం వల్ల శరీరానికి మంచిది. ఒక స్త్రీ తానుకున్న విధంగా జీవితం గడుపలేకపోయింది. అస్తవ్యస్తమైన జీవనం గడుపుతుంది. అపుడు అమావాస్యకు అట్టుపెట్టలేదు. పున్నానికి



బూరె పెట్టలేదు అని వాపోయింది. భోజన పదార్థాలు కూడా వాతావరణ పరిస్థితులు ప్రకృతి ఆధారంగా మార్పుచేయాలి. లేకుంటే అవి విషమవుతాయి. అవసరమైనదాని కన్నా అధికంగా తీసుకున్నా అవి విషమవుతాయి. (అజీర్ణేభోజనం విషం) అమావాస్య నాడు మినుములతో చేసిన అట్లు, పూర్ణిమనాడు బెల్లంతోకూడిన బూరెలు ఈ మంచి ఫలితాన్నిస్తాయి.

**'ఉంటే ఉగాది లేకుంటే శివరాత్రి'** అనేది వ్యక్తియొక్క సంపదను దానిని బట్టి అతడు తీసుకునే ఆహారాన్ని తెలియజేస్తుంది. ఉగాదినాడు భక్ష భోజ్యాలతోనూ, శివరాత్రినాడు ఉపవాసాలతోనూ గడుపడం మనకు తెలిసిందే. **'ఏకాదశి ఇంటికి శివరాత్రి పోయినట్లు'** అనే సామెత ఈ ఉపవాసాల దృష్టిలో వ్యంగ్యంగా ఉంటుంది. ఏకాదశినాడు ధర్మశాస్త్ర నిర్దేశం ప్రకారం ఉపవాసం పూర్తిగా ఉండాలి. శివరాత్రినాడు సాయంత్రం ఉపాహారం తీసుకోవచ్చు. అందువల్ల శివరాత్రి. ఏకాదశింటికి వెళ్లే దొరికేదేమీ ఉండదు.

**'ఏదుం దిన్నా ఏకాదశి, పందుందిన్నా పరగడపే'**నని తిండిపోతును తిట్టే సామెత. **'పని అంటే నా వళ్లు భారకిస్తుంది. భోజనమంటే నా వళ్లు పొంగిపోతుంది'** అనే వారున్నారు. ఏదుం అంటే ఐదు తూములు. పందుం అంటే పది తూములు. ఈ జానపద పరిభాష జ్యోతిషానికి అన్వయం చేయడంవల్ల వారికున్న జ్యోతిర్విజ్ఞానాన్ని అర్థం చేసుకోవచ్చు. (ఒక్క తూముకు రెండు, కుండలు. ఒక్క కుండకు 20 సేర్లు)

కరువులు వస్తుంటాయి. ఈ కరువు రోజుల్లో మరింత బాధపెట్టడానికి అధికమాసాలు వస్తాయి. **'కరువులో అధికమాసం'** అని బాగా బాధలు పడుతున్నప్పుడు మరో తప్పని విషయం. నెత్తిమీదబడి ఆర్థికబాధలు పడుతున్నపుడు చెప్పుకునే జ్యోతిష పరిభాష. జ్యోతిషం ప్రకారం కాలగణనంలో సౌర చాంద్రమానాలు, ప్రాముఖ్యం కలిగి ఉన్నాయి. సౌరమానంలో కన్నా చాంద్రమానంలో కొన్నిరోజులు తక్కువగా ఉంటాయి. అందుకే 2 1/2 సంవత్సరాలకు ఒక అధికమాసం వచ్చి సౌరమానంతో సమానమవుతుంది. అవి ఒక్కోసారి ఒక్కోమాసం అధికమవుతాయి. ఇలా రెండు

అధికమాసాలు వచ్చేకాలాన్ని వేదాలలో 'పంచవర్షాత్మక యుగ'మన్నారు. పితృకార్యాలు, తద్దినాలు వారు చనిపోయిన రోజున ప్రతి సంవత్సరం చేయాలి. అయితే అధికమాసం వస్తే రెండవసారి చేయాలి. శ్రమఖర్చు అధికం అవుతాయి. అందుకే కరువులో అధికమాసం అని బాధపడేవారున్నారు. ఆహార విజ్ఞానం జ్యోతిశ్చక్రంలో ప్రత్యేకత నీవిధంగా సంతరించుకుంది. ప్రకృతిలోని జ్యోతిస్సుల ప్రభావ జనితాలైన ఆహారం తీసుకోవడం ఆరోగ్యం వృద్ధి చెందించుకోవడం విజ్ఞుని లక్షణం. గురువు వ్యతిరేక కాంతిశక్తి వల్ల 'చక్కెర' పుడుతుంది. గురువు అనుకూలశక్తి వల్ల పసుపు మెంతులు పుడతాయి. చక్కెరవ్యాధి శరీరంలో వచ్చినపుడు, పసుపు, మెంతులు ఉపయోగ పడుతున్నాయి. వ్యతిరేక ప్రభావాలను అనుకూల ప్రభావాలను గమనించి ముందుగా ఇచ్చే ఆహారంలో మార్పు తీసుకొచ్చి రోగం సమూలంగాతుడిచి వేయడంలో జ్యోతిషం ప్రత్యేక పాత్రను పొందిఉంది. ఈ విషయాలను క్షుణ్ణంగా పరిశీలించి సామాజికులకు అందజేయడం వల్ల ఆరోగ్య, ఆనందమయ జీవనం సాధ్యం.

### 3. గ్రహణం :

జానపదులకు గ్రహణ సంబంధమైన విషయాలు దానిదోషాలు తెలుసు. వారి నమ్మకాలలో గ్రహణ సమయంలో తీసుకోవలసిన జాగ్రత్తలు కనిపిస్తున్నాయి.

**'గ్రహణసమయంలో రాహు కేతువులు సూర్య చంద్రులను మింగుతారట'** ఇది జానపదులకు గ్రహణంపై ఉన్న అవగాహన. రాహువు కేతువులు సూర్య చంద్రుల్ని మింగడం ఒక ప్రతీక మాత్రమే. ఈ రెండూ భూమి యొక్క చంద్రుని యొక్క మార్గాల లోని నీడలు. ఈ నీడలకు కూడా శక్తి ఉంటుంది. చక్కని, ప్రసరింపజేయడం వల్ల ఆనందం కలిగించే కాంతిని ఇవి ఆపి కలుషిత కాంతిని ప్రపసరింపజేస్తాయి. అందువల్ల జాతకాలలో రాహుకేతులతో కలిసి ఉన్న గ్రహం తన పూర్తి ప్రభావం చూపించలేదన్న భావం తెలియజేస్తారు. గ్రహణసమయంలో సూర్యుడు, భూమి, చంద్రుడు ఒకే సరళరేఖలోకి వస్తారు. భూమికి సూర్యునికి మధ్యగా చంద్రుడు వచ్చినపుడు సూర్యగ్రహణం, భూమికి చంద్రునికి మధ్యగా సూర్యుడు వచ్చినపుడు



చంద్రగ్రహణం వస్తుంది. ఈ సమయంలో భూమి నీడలు కూడా ఈ మార్గంలో వచ్చి కచ్చితంగా ఈ మార్గం పైన పడి దాటిపోతాయి. అది 'రాహుకేతువులు' సూర్య చంద్రులను మింగుతున్న భావనలో సాహిత్యంలో పెద్ద కథలు వచ్చాయి.

క్షీరసాగరమథనం తర్వాత అమృతం వెలికి వస్తుంది. అమృతం పంచడానికి విష్ణువు మోహినీ రూపంలో వస్తాడు. రాక్షసులను, దేవతలను రెండు వరుసల్లో కూర్చోబెట్టి అమృతం మొదలు దేవతలకు పంచుతుంటాడు. తమకు మిగులుతుందన్న భావంలేని రాక్షసుల్లో ఒకడు దేవతల వరుసల్లో చివరకు చేరినాడు. మోహినీ అతనికి కూడా అమృతం పోసింది. ఈ విషయం సూర్యుడు చంద్రుడు చేస్తారు. వెంటనే విష్ణువుకు తెలియజేస్తారు. విష్ణువు తన చక్రంతో ఆ రాక్షసుని మెడను ఖండిస్తారు. అప్పటికే అమృతం గొంతుజారగా శరీరంలోని రెండు భాగాలులు బ్రతికే ఉంటాయి. ఇద్దరూ రాహుకేతువులుగా మారినారు. తాము ఆ విధంగా మారడానికి హేతువు లయ్యారనే కోపంతో ఎప్పుడు సూర్యచంద్రులు కనిపించినా తినడానికి చూస్తుంటారు. ఇది పురాణగాథ. జ్యోతిషవిశేషాంశాలను ఇది వ్యక్తీకరిస్తుంది.

రాహుకేతువులు, భూమి రెండువైపులా తన వృత్తమార్గాన్ని ఖండించేటపుడు ఏర్పడే సున్నితమైన ఛాయాబిందువులు, వీటి నీడలు అడ్డం వచ్చినపుడు గ్రహణాలు ఏర్పడతాయి.

**'గ్రహణం పట్టినపుడు పంటలకు బలికూడు చల్లాలట' 'గ్రహణానికి గంట, రెండు గంటల ముందే భోజనం చేయాలి'** గ్రహణ సమయంలో ఏమీ తీసుకోకూడదు. గ్రహణ సమయంలో ప్రకృతిలో పూర్తి మార్పులు వస్తాయి. విషపూరిత కిరణాలు ప్రసారమవుతాయి. ఏ నక్షత్రంలోనైతే గ్రహణం పడుతుందో వారిపై ఈ ప్రభావం అధికంగా ఉంటుంది. అందుకే పంచాంగకర్తలు ఏ నక్షత్రాలలో గ్రహణం పడుతుందో ఆ నక్షత్రం ఉన్నవారిని ప్రత్యక్ష కిరణాల ప్రభావం పడకుండా గృహంలోనే ఉండమని సూచన లిస్తారు. వివిధ పదార్థాలలో కూడా జీవశక్తి నిండిన దర్భను వేసుకోవడం

కూడా ఈ సమయంలో శాస్త్రీయ సంప్రదాయంగా వస్తుంది. ఆ సమయంలో తీసుకునే ఆహారం విషమవుతుందని, తీసుకునే ఆహారం వల్ల ఇతర రోగాలు నయమవుతాయని ఒకటి, రెండు గంటల ముందే తిని మిగిలింది కూడా పారవేయమనే చెపుతారు. ప్రకృతి మొత్తంపై ఈ ప్రభావం ఉండడంవల్ల కొంత మందులాంటి ద్రావం పొలాల్లో చల్లితే వాటిపై విషప్రభావం ఉండదని, దానివల్ల మళ్లీ ఆ పొలంనుండి వచ్చే ఆహారాన్ని స్వీకరించేవారు పూర్ణఆరోగ్యం కలిగి ఉంటారని ఈ విధంగా నియమం చేయబడింది. దీనినే 'బలికూడు' అంటారు.

**'గర్భిణీ స్త్రీ గ్రహణం చూడకూడదు'** చూస్తే పుట్టబోయే పిల్లల్లో శరీరాంగాలలో ఏదైనాలోపం ఏర్పడుతుంది స్త్రీలు గర్భం ధరించినపుడు సున్నితమైన శరీరం కల్గి ఉంటారు. ఏ రకమైన ఇతర ప్రభావమయినా వారి శరీరాలలోకి వెంటనే ప్రవేశిస్తుంది. ఆ ప్రభావం అత్యంత సున్నితమైన శరీరం కలిగి అపుడే ఎదుగుతున్న పిండంపై పడుతుంది. దానిద్వారా అంగవికలత్వం సంభవించే అవకాశం ఉంది. గ్రహణ ప్రభావాలు రాహుకేతువులు, సూర్య చంద్రుల కాంతులతో మిళితమై విషకిరణాలను ప్రసరిస్తుంటే దానికి మనకు తోచిన ప్రత్యామ్నాయం ఏర్పాటు చేసుకోవడం అవసరం. ఈనాటికీ గ్రహణసమయంలో భోజనం చేయకపోవడం, విడువగానే స్నానాదులతో శరీరశుభ్రతను, జపతపాలతో మానసిక శుద్ధతను ఏర్పరచుకోవడం తెలిసిన విషయమే.

చివరకు ఏ గ్రహం పట్టినా ఆగ్రహం పట్టకూడదనే నిర్ధారణకు చేరుతారు. ఆగ్రహం వల్ల సర్వం నాశనమని తెలుసుకున్నవారు జ్యోతిషసంబంధ గ్రహాలనే ఉపమానాలుగా తీసుకున్నారు.

వైద్య విషయంగా ఆరోగ్య ఆహారవిశేషాలను జానపదులు కూడా క్షుణ్ణంగా వివరించారు. వారి యొక్క వైద్యం, ముందుజాగ్రత్తలు అన్నీ సామాజిక సంబంధాలతో కూడినవై ఉన్నాయి. పాపం, కళ్లుపోతాయి. అక్క చెల్లెళ్లకు దోషం, దేవుడు కొడ్తాడు, దయ్యం పడుతుంది. అంటూ భయపెట్టిస్తూ వారి నియమాలను పాటింపచేయడం సామెతలు నమ్మకాలలో కనబడుతుంది.



## 3.వ్యవసాయం :

జానపదుల ముఖ్య జీవనాధారం, వృత్తి వ్యవసాయం. తాను పంటలు పండించి, తాను జీవించి చాలామందిని బ్రతికిస్తాడు. అది సక్రమంగా సాగాలంటే అతనికి కాలమాన స్థితులు తెలిసి ఉండాలి. విత్తేసమయం, వర్షం వచ్చేసమయం, మండె కట్టడం, నాటుపెట్టడం, కోయడం అన్నిపనులు నిర్దిష్టమైన రోజుల్లో సాగాలి. పశువులను కాపాడుకోవాలి. ఈ రంగంలో జానపదుని నిరంతర పరిశోధన అమూల్యమైన అంశాలను వెలికి తీస్తుంది.

వ్యవసాయదారుల గూర్చి నేదునూరి గంగాధరం గారు **'చదువు సంధ్యలు లేకపోయినను పండుగలను బట్టి కాలమును లెక్కించే గణికుడు. ప్రకృతి దృశ్యమును పరిశీలించి ఫలములను నిర్ణయించే జ్యోతిష్కుడు. పశులక్షణములను పరికర లక్షణములను సాంగోపాంగంగా చెప్పగల ప్రజ్ఞాశాలి. కార్తులననుసరించి కాలగతుల నూహించి సేద్యం చేయగల శేముషీ దురంధరుడు. అదునెరిగి ఆయా ఫలసాయము పొదుపు చేయుటయు కావలసిన విత్తనములను భద్రపరుచుటలు తెలిసిన శాస్త్రవేత్త'** అని తన 'పసిడిపలుకులు' పుస్తకంలో వివరించారు.

ఈ విషయాల ప్రకారం జానపదులకు కాలస్వరూపం తెలుసు. లేకుంటే అతడు వ్యవసాయం చేయలేడు. నిత్యజీవనవిధులు నిర్వర్తించలేడు. ఈ కాలం యొక్క ఫలతత్త్వాన్ని జ్యోతిశ్శాస్త్రం సమగ్రంగా వివరిస్తుంది. అకాలంలో చేసిన పనులద్వారా నష్టపడడం కంటే సకాలంలో కృషిచేయడం వల్ల అధికఫలితం పొందవచ్చుననేది జ్యోతిశ్శాస్త్ర సందేశం.

వ్యవసాయానికి సంబంధించి లెక్కలేనన్ని సామెతలు కనపడుతున్నాయి. వ్యవసాయానికి నీరు అవసరం. ఆ నీరు వర్షం ద్వారా లభిస్తుంది. తొలకరి జల్లులు పడగానే రైతు విత్తనాలు చల్లడానికి సిద్ధమవుతాడు. ఆ వర్షం కురిపించడం తన చేతిలో లేనందువల్ల దానికోసం ఎదురుచూడడం మొదలవుతుంది. దానిద్వారా ఒక

సుదీర్ఘపరిశీలన జరిగింది. వారు గమనించిన అంశాలు సామెతలై శాస్త్ర ప్రమాణాలైనాయి. వర్ష పరిశీలన రెండు రకాలుగా కనిపిస్తుంది. 1. ప్రవర్షణ, 2. సద్యోవర్షం.

ప్రవర్షణ మంటే ఏమిటో బృహత్సంహిత ప్రవర్షణాధ్యాయం 1వ శ్లోకం ఈ విధంగా తెలిపింది.

"జ్యేష్ఠ్యాం సమతీతాయాం పూర్వాషాఢాది సమ్ప్రవృష్టేన
శుభాశుభం వా వాచ్యం పరిమాణం చామ్బుస సజ్జైః"

జ్యేష్ఠ శుక్ల పూర్ణమి తరువాత పూర్వాషాఢా నక్షత్రం మొదలుకొని 27 నక్షత్రాలు పూర్తి అయ్యేవరకు శుభాశుభాల పరిణామాలు చెప్పబడే కాలం ప్రవర్షణకాలం. ఇక్కడ వృష్టి ఉంటే శుభమని, వృష్టిలేకుంటే అశుభమని అర్థం. ఏ నక్షత్రంలోనూ వర్షం పడకపోతే ఆ సంవత్సరం అనావృష్టి అని చెప్పవచ్చు. వివిధ నక్షత్రాలలో పడిన వర్షపాతానుసారం ఫలితం వేరువేరుగా ఉంటుంది.

వరాహమిహిరుడు బృహత్సంహిత ప్రవర్షణాధ్యాయంలో వివిధ నక్షత్రాల వృష్టిప్రమాణం తెలియజేశాడు.

"హస్తాప్య సౌమ్య చిత్రా పౌష్ణ ధనిష్ఠాస్ర షోడశద్రోణాః
శతభిషగైంద్ర స్వాతీషు చత్వారం, కృత్తికాసు దశ॥"

"శ్రవణౌ మఘానురాధా భరణీ మూలేషు దశ చతుర్యుక్తాః॥
ఫల్గున్యాం పంచకృతిః పునర్వసౌ వింశతిః సార్పభేదశ త్ర్యధికాః॥"

"ఐన్ద్రాగన్యాఖ్యే వైశ్వేచ వింశతిః సార్పభేదశ త్ర్యధికాః
అహిర్బుధ్న్యార్యమ్ణ ప్రజాపత్యేషు పంచకృతిః॥"

"పంచదశా జే పుష్యేచ కీర్తితా వాజిభే దశ ద్వేచ
రౌద్రేకష్టాదశ కథితా ద్రోణా నిరుపద్రవే ష్వేతేః॥"



వీని వివరం ప్రకారం హస్త, పూర్వాషాఢ, మృగశిర, చిత్ర, రేవతి, ధనిష్ఠా నక్షత్రాలలో ప్రవర్షణ కాలంలో వర్షం కురిస్తే తరువాతి మేఘప్రసవ కాలంలో 16 ద్రోణాల వర్షం పడుతుంది. శతభిషం, జ్యేష్ఠా, స్వాతిలలో నాలుగు ద్రోణాలు, కృత్తికలో 10, శ్రవణం, మఘ, అనూరాధ, భరణి, మూలలో 14, పుబ్బలో 15, పునర్వసులో 20, విశాఖ, ఉత్తరాషాఢలో 20, ఆశ్లేషలో 13, ఉత్తరాభాద్ర, ఉత్తర, రోహిణిలలో 25, పూర్వాభాద్ర పుష్యాలలో 15, అశ్వినిలో 12, ఆర్ద్రలో 18 ద్రోణాల వర్షం ప్రసవకాలంలో పడుతుంది.

ఇక్కడ ద్రోణం అంటే నాలుగు వందల బారలున్న జలాశయం. దీనిద్వారా సంవత్సరం యొక్క వర్షఫలితం తెలుసుకోవడం సాధ్యం అవుతుంది.

సూర్యుడు వివిధ రాశుల్లోనూ, ఆ రాశులలోని నక్షత్రాలలోనూ ప్రవేశించినపుడు వాటిని కార్తెలు అని అంటారు. ఈ కార్తెలు సమయానికి వర్షిస్తాయో లేదో తెలియదు. కాని జానపదుల పరిశీలన ఈ అంశంపై అధికంగా ఉంది. వర్షం కురిస్తే శుభకరమా! అశుభమా లెక్కించగలుగుతున్నారు. ఈ రెండింటి పరమైన విషయ వివరణ సామెతలలో అత్యధికంగా మనకు ఈనాడు కనపడుతుంది.

వ్యవసాయదారుడు తన వ్యవసాయ పనిని ప్రారంభించడానికి సరియైన సమయం చూస్తుంటాడు. అన్ని విధాలుగా కుదుర్తున్నపుడు మొదలుపెడతాడు. లేకుంటే విత్తనాలు విత్తడం-నష్టపోవడం జరుగుతుంది.

"అదను ఎరిగి సేద్యం-పదును ఎరిగి పైరు'

'అదును చూచి పొదలో చల్లినా పండుతుంది.' ఈ అదను గూర్చి ప్రకృతిని గ్రహ నక్షత్రాదుల వివరణను నిత్యం పరిశీలిస్తుంటాడు. ఒక్కో కార్తెలో సూర్యుడు ప్రవేశించినపుడు వచ్చిన వివిధ జీవనప్రవృత్తులను వారి వ్యవసాయిక జీవితాలతో అన్వయించుకోవడం క్రింద గమనించవచ్చు.

**'అశ్వని కురిస్తే అంతా నష్టం'**

**'అశ్వని కురిస్తే ఆరు కార్తెలు విడుపు'** అశ్వని కార్తె ఏప్రిల్ మధ్యభాగంనుండి మొదలవుతుంది. ఆ సమయం ఏ పనికి యోగ్యంకాదు. అందుకే ముందుగా వర్షం పడడం నష్టభావాన్ని సూచిస్తుంది.

**'కార్తెముందు ఉరిసినా కార్యంముందు వదరినా చెడుతుంది'** ప్రవర్షణాధ్యాయం ప్రకారం అశ్వని నక్షత్రంనాడు వర్షంకురిస్తే 15 ద్రోణాలు ఆ సంవత్సర వర్షఫలితం కాబట్టే అంతానష్టం.

**'భరణి కార్తెలో చల్లిన కాయకు చిప్పెడు పంట'**

**'భరణి కార్తెలో చల్లిన నువ్వుచేను కాయకు బరిగెడు గింజలు'**

ఏప్రిల్‌లో మే ప్రథమభాగంలో విత్తనాలు చల్లడం ద్వారా వచ్చేఫలితాలు పై విధంగా ఉంటాయి.

**'భరణి కురిస్తే ధరణి పండును'** ప్రవర్షణాధ్యాయం ప్రకారం భరణిలో వర్షం కురిస్తే వర్షాకాలం 14 ద్రోణాల వర్షం పడుతుంది. విత్తేసమయం ముందు ఇంత వర్షం అన్నీ దున్నుకోవడానికి ఆనందకరమైందే.

**'భరణి ఎండలకు బండలు పగులును. రోహిణిలో రోళ్లు పగులును'** అనేది ఆ రోజుల్లో ఉండే వేసవి తీవ్రత్వాన్ని తెలియజేస్తుంది.

**'కృత్తికలో కుత్తిక పిసుకుడు' 'కృత్తికలో కుత్తుకలు నిండవు'**

మేషమాసం మొదటివారంలో సూర్యుడు కృత్తికా నక్షత్రంలో ప్రవేశిస్తాడు. కృత్తికానక్షత్రం దైవతం (అగ్నిర్నః పాతు కృత్తికా) అని వేదంలోని నక్షత్రేష్టి చెపుతుంది. అందుకే దీనిలో వేడిమి అధికంగా ఉంటుంది. దీనిని 'కర్తరి' అంటారు. అధికమైన వేడి ఉండడం వల్ల ఆ సమయంలో కొన్ని పనులు చెడిపోతాయి. దీన్నే 'కత్తెర' అని



అంటారు. ఈ సమయంలో మట్టి, కర్ర, రాయి మొదలగు వాని పనిచేయకూడదు. **'మృత్ దారుశిలా కర్మాణి వర్జయేత్'** అని శాస్త్రవాక్యం. ఆ సమయంలో మట్టి, రాయి, కట్టెలకు సంబంధించిన పనులుచేస్తే వేడికి అవి పగిలిపోతాయి. నాశనమవుతాయి. ఈ సమయం వ్యవసాయానికి అనుకూలం కాదు. ప్రవర్షణ ప్రకారం కృత్తిక నక్షత్రం రోజు వర్షం కురిస్తే ఆ వత్సరం 10 ద్రోణాలు పడుతుంది. అది సరిపోదు. అందువల్లనే కృత్తిక పూర్తిగా అననుకూలమైంది.

**'రోహిణి ఎండకు రోళ్లు పగులును' 'రోహిణి కార్తెలో విత్తడం రోటిలో విత్తుటే' 'రోహిణి విత్తనం రోళ్లు నిండనిపంట' 'రోహిణిలో రోళ్లు చిగిర్చనన్నా చిగిరిస్తవి, రాళ్లు పగులనన్నా పగుల్తవి.'**

రోహిణినక్షత్రంలో సూర్యుడు మే నెల మధ్యభాగంలో ప్రకాశిస్తాడు. ఈ సమయంలో సూర్యుడు భూమికి అతి దగ్గరలో ఉండడం వల్ల ఎండలు బాగా ఉంటాయి. ఈ సమయంలో నేలలో తేమ పూర్తిగా లోపిస్తుంది. అందుకే రోహిణి ఎండకు రోళ్లుపగులుతాయని, ఆ సమయంలో విత్తనం వేయడం ద్వారా బండమీద వేసినట్లు అవుతుందని సామెతార్థం. దానివల్ల పంటలు పండవు.

ప్రవర్షణకాలంలో రోహిణి నక్షత్రంలో వర్షం కురిస్తే 25 ద్రోణాల వర్షమా సంవత్సరంలో పడుతుంది. అందుకే రెండింటి సమన్వయమైన సామెతలో రోకళ్లు చిగిరించడంగాని, రోళ్లు పగలడం గాని జరుగుతాయని సూచించారు.

**'మృగశిర కార్తెలో ముంగిళ్లు చల్లబడును'**

సరైన సమయంలో వర్షాలు కురిస్తే ఫలితాలు ఉత్తమంగా ఉంటాయి. కృత్తిక, రోహిణి కార్తెల్లో ఎండలు బాగా అయిపోయిన తర్వాత మృగశిర కార్తెలో అనగా జూన్ మొదటి వారంలో తొలకరి జల్లులు పడతాయి. ఈ సమయం ఆనందప్రదం. ఈ సమయంలో వేసే విత్తనాలు బాగా పంటనిస్తాయి. వ్యవసాయ పనులకు ఈ సమయంలో అందరూ సిద్ధమవుతారు.

'మృగశిరం కురిస్తే ముసలి ఎద్దు రంకె వేస్తుంది'

వ్యవసాయపనులకు పశువులనుపయోగిస్తాం. ఈ సమయంలో వర్షం పడడం వల్ల అన్ని పనులకు సిద్ధమవుతాయని సామెత.

**'మృగశిరతో కూడ ముల్లోకాలు చల్లబడును'** అంతటా వేడితగ్గిపోయి చల్లదనం చేకూరుతుంది. **'మృగశిర కురిస్తే ముంగారు పండుతుంది.'** సమయానికి కురిసే వర్షాలు ఆ సంవత్సరమంతా నీటి సదుపాయం ఉండేవిగా మారి మూడుకార్లు పంట పండడానికి ఉపయోగపడతాయి. అందుకే **'మృగశిరలో పెట్టిన పైరు, మీస కట్టున బుట్టిన కొడుకు మేలు'** సమయా సమయాలు గమనిస్తూ తొలకరి వానలు చిందగానే మృగశిరలో వేసే పైరు మంచి ఫలితాలనిస్తుంది. తొలిగా మీసం వస్తునపుడు కొడుకు పుడితే తనకు శక్తి తగ్గేనాటికి అతడు యోగ్యుడవుతాడు. ప్రవర్షణలో కూడా మృగశిరా నక్షత్రంలో వర్షం కురిస్తే ఆ సంవత్సరం 16 ద్రోణాలు వర్షం కురుస్తుంది.

**'ఆరు కార్తెలకు పోతు ఆరుద్ర కార్తె' 'ఆరుద్ర కురిస్తే దారిద్రం లేదు'** మృగశిర కార్తెలో వర్షాలు ప్రారంభమై ఆరుద్రలో చోటుచేసుకుంటాయి. జూన్ నెల మధ్యభాగంలో ఆరుద్రలో రవి ప్రవేశిస్తాడు. ఈ సమయంలో పడే వర్షం అన్నిరకాల తరి పంటలకు బాగా ఉపయోగ పడుతుంది. అందుకే **'ఆరు కార్తెలకు పోతు ఆరుద్రకార్తె' 'ఆరుద్ర కురిస్తే ఆరు కార్తెలు కురుస్తాయి'** అన్నారు. ఆ సంవత్సరానికి వారికి పంటలు బాగా పండడం వల్ల దరిద్రం ఉండదు. సమాజంలో ఎప్పటికైనా ఇతరులకు అన్నదానం చేస్తూ ఉంటే దానినుండి వారు ఆనందపడుతుంటారు. అందరూ వారిని స్తుతిస్తారు. ఆరుద్ర కార్తెలో విత్తనం వేయడం కూడా అటువంటిదే.

**'ఆరుద్రకార్తె విత్తనానికి అన్నం పెట్టిన యింటికి సేగి (చెరువు) లేదు.' 'ఆరుద్రలో తడిస్తే ఆడది మగవాడౌతాడు'** అనడంలో వ్యవసాయపనులు అధికమై ఆడవారు కూడా మగవాళ్లలాగా శ్రమిస్తారనే భావం కనపడుతుంది. **'ఆరుద్ర వాన అదనువాన'** ఆ అదను చూసి పైరు వేయడం వ్యవసాయవిజ్ఞాన లక్షణం. **'ఆరుద్రతో అదను సరి'**



**'ఆరుద్రలో అడ్డెడు చల్లితే పునాసకు పుట్టెడు పండుతుంది'** విత్తనాలు వేసుకోడానికి చివరి కార్తె ఆరుద్ర. తరువాతైతే అదును తప్పుతుంది. ఆరుద్రలో చల్లగానే పునర్వసులో పంట పండకపోయినా ఉత్తమ ఫలితాన్నిస్తుందనే భావం ఉంది.

**'ఆరుద్ర మొదటిపాదాన ఎత్తితే ఆరంభాలు చెడుతాయి'** వానలు ఆరుద్ర మొదటిపాదంలో పడి ఆగిపోతే వేసినపంటలు ఎండిపోవడం గాని అధికంగా కురిస్తే మురిగిపోవడం గాని జరుగుతుంది.

ప్రవర్షణాకాలంలో ఆరుద్ర నక్షత్రంనాడు వర్షం కురిస్తే ఆ సంవత్సరం 18 ద్రోణాల వర్షం కురుస్తుంది. ఈ రకంగా కూడా ఆరుద్రకురిస్తే దారిద్ర్యం లేదు అని విశ్వసిస్తారు.

సరియైన వర్షం పడేసమయం అవడం వల్ల ఆరుద్ర ప్రవేశించే సమయం ఆధారంగా సంవత్సర ఫలం చూస్తారు.

**"ఆర్ద్రాయాంచ రవి ప్రవేశ సమయే నిత్యర్క్ష విజ్ఞేయకం**
**యామ్యర్క్షం చతురక్ష సస్య ఫలితం రౌద్రం చతుర్వృష్టి కృత్**
**వృష్టిర్నాస్తి మఘాది పంచకమిదం స్వాతీత్రయం చార్క్షకృత్**
**జ్యేష్ఠాపంచక సస్యనాశ కథితం వస్వాది షట్కం శుభమ్॥**

ఆరుద్ర నక్షత్రంలో రవి ప్రవేశించినపుడు ఆ రోజు నక్షత్రాన్ని పరిశీలించాలి. యమసంబంధమైన భరణితో నాలుగు నక్షత్రాలు కృత్తిక, రోహిణి, మృగశిరలు ఆ దిన నక్షత్రాలైతే సస్యవృద్ధి జరుగుతుంది. తరువాతి ఆరుద్ర, పునర్వసు, పుష్యమి, ఆశ్లేషలు దిన నక్షత్రాలైతే వర్షం తీవ్రంగా ఉంటుంది. మఘ, పుబ్బ, ఉత్తర, హస్త, చిత్త, నక్షత్రాలైతే వృష్టి ఉండదు. స్వాతీ, విశాఖ, అనూరాధ, జ్యేష్ఠ, మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ, శ్రవణం నక్షత్రాలైతే సస్యనాశనమవుతుంది. వర్షాలు అధికంగా పడే అవకాశాలు ఉన్నాయి. ధనిష్ఠ, శతభిషం, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, రేవతి, అశ్వనిలలో సస్యవృద్ధి సువృష్టి కలిగి శుభఫలితాలనిస్తాయి.

సూర్య చంద్రులకు మధ్య ఆర్ద్రా నక్షత్రమాధారంగా ఉండే దూరాన్ని బట్టి ఈ వర్ష ఫలితాలుంటాయి.

**'పునర్వసు, పుష్యాలకు పూరేదు (కముజు జాతి అడవిపిట్ట) అదుగైనా తడువదు'**

**'పుశాల (పుష్యమికార్తె)లో పూరి పిట్ట తడువదు'** సరియైన వర్షాలు ఆర్ద్రలో కురిస్తే పునర్వసు, పుష్యమిలలో రవి ప్రవేశించినపుడు వర్షాలు పడకూడదు. పడితే పంటలకు నష్టం కలుగుతుంది. వ్యవసాయ పనులకు ఇబ్బంది. ఒకవేళ పడినా అత్యంత అల్పంగా ఉంటుంది. అందుకే పై విధమైన సామెతలు వచ్చాయి.

**"ఆశ్లేషలో ఊడ్పు (పైరునాటడం) ఆరుగురి (ఆరింతల) ఊడ్పు"**

**"ఆశ్లేషలో అడుగుకొక చినుకైనా అడిగినన్ని వడ్లు"**

ఆశ్లేష కార్తె ఆగస్టునెల మొదటివారంలో ప్రవేశిస్తుంది. రవి ఆశ్లేష చేరినపుడు వర్షం బాగా పడుతుంది. కాని వర్షం ఆగి ఆగి కురుస్తుంది. ఆశ్లేష ముసలికార్తె, ఆగి ఆగి తుంపర కురుస్తుంది. ఈ కార్తెలో వర్షం తీవ్రంగా ఉండదు. సన్న చినుకులు పడుతుంటాయి.

**'ఆశ్లేషలో తడిస్తే ఆడది మగవాడవుతాడు'**

**'ఆశ్లేషలో ముసలి ఎద్దు రంకెవేస్తుంది'** ఇవన్నీ వ్యవసాయానికి సంసిద్ధులైన మానుష జీవాదుల నుండి ఏర్పడినవి. ప్రవర్షణకాలం ప్రకారం ఆశ్లేషా నక్షత్రంలో వర్షం కురిస్తే ఆ సంవత్సరం 13 ద్రోణాల వర్షం కురుస్తుంది.

**"ఆశ్లేష వర్షం అందరికీ లాభం"**

**"ఆశ్లేషలో పూస్తే అంతులేని పంట"**

**"ఆశ్లేష కురిస్తే ఆరోగ్యమంటారు"**

ఈ విధంగా నక్షత్రాలకు సంబంధించిన సామెతలు వర్షవిజ్ఞానానికి హేతువులుగా ఉన్నాయి.



**"మఘ పుబ్బలు వరపైతే మహత్తర క్షేమం"** ప్రవర్షణ కాలం ప్రకారం మఘలో వర్షంపడితే 14 ద్రోణాలు, పుబ్బలో పడితే 15 ద్రోణాలు కురుస్తుంది. ఈ రెండు సరియైన కాలంలో పడకపోతే క్షామం (కరువు) వస్తుంది.

**'మఘ పుబ్బలు వరపైతే మీ అన్నసేద్యం, నా సేద్యం మన్నే'** అని తన భార్యతో భర్త అంటుంటాడు.

**'మఘలో మానెడు చల్లడం కన్న ఆశ్లేషలో అద్దెడు చల్లడం మేలట.'**

ఈ సామెతలు మఘకార్తెలో విత్తినవి ఫలవంతం కావనే విషయాన్ని తెలుపు తున్నాయి. **'మఘలో చల్లిన విత్తనాలు మచ్చులు కనపడతాయి.'** ఆ గంట రెండవ వారంలో మఘా నక్షత్రంలో రవి ప్రవేశిస్తాడు. మఖానక్షత్రం సింహరాశిలో ఉంటుంది. ఇవి నిర్జలరాశి. అందువల్ల ఈ విధమైన మార్పులు కనపడుతున్నాయి. మఘ కన్నా పుబ్బ కొంత మేలుగా ఉంటుంది.

**'మఘలో మానెడు పుబ్బలో పుట్టెడు'** అనే సామెత ఈ భావాన్నే వ్యక్తపరుస్తుంది. సాధారణంగా మఘలో వేసిన విత్తనం పాడవుతుంది. ఏదైనా కార్యం మొదలుపెట్టగానే ఇబ్బందులు ఎదురై ఆపివేయడం కంటి అంశాలకు ప్రతీకలుగా సామెతలు వచ్చాయి.

**'మఖలో పుట్టి పుబ్బలో గిట్టినట్లు'**

**'పుబ్బలో పుట్టి మఘలో మాడినట్లు'** ఈ సామెతలు జానపదుల పరిశీలనా శక్తికి, నిత్యజీవన వ్యవహారదక్షతకు నిదర్శనాలు.

ఉత్తరనక్షత్రం నాడు కురియకున్నా కనీసం విశాఖలో కురిస్తే 20 ద్రోణాల వర్షం ఆ సంవత్సరం పడుతుంది. అందుకే **'వృష్టికి ప్రమాణం ఉత్తర హస్తలని'** అంటారు.

**'ఉత్తరలో చల్లిన పైరు కత్తెరలో నరికిన కొయ్య ఒకటేనట'**

కత్తెర (కర్తరి)లో కట్టెపనులు చేయకూడదు. చేస్తే కట్టె పగిలి నష్టం వాటిల్లుతుంది. ఉత్తరకార్తెలో చల్లితే అదే ఫలముంటుంది.

ఉలవలను ఉత్తరలో చల్లుతారు. దానికి అధికమైన అవసరం లేదు. అందుకే **'ఉత్తర పదును – ఉలవకు అదును'** అనే సామెత ఉంది. **'ఉత్తరలో ఊడ్చేకంటే గట్టు మీద కూర్చొని ఏడ్చేది మేలు'**. ఇది ఉత్తరాకార్తెలో సాధారణ వర్షస్థితి.

**"హస్తలో చల్లితే హస్తంలోకి రావు"**

**"హస్త కార్తెలో చల్లితే అక్షంతలకైనా రావు"** సెప్టెంబరు చివరివారంలో హస్తకార్తె ప్రవేశిస్తుంది. రెండవసారి ఋతుపవనాలు వచ్చే సమయమిది. హస్త కార్తెలో వర్షం అధికంగా పడుతుంది. హస్తకార్తెలో పడే వర్షం చూసి చిత్తలో విత్తడం వల్ల ఫలితం బాగా ఉంటుంది. హస్తలో చల్లితే మురిగి నాశమవుతుంది.

**'హస్తలో అద్దెడు చల్లేకంటే చిత్తలో చిట్టెడు చల్లడంమేలు'**

**'హస్త పోయిన ఆరు దినాలకు అడక్కుండా విత్తు'** అనే సామెతలు హస్తాకార్తెలో వర్షాలవల్ల కలిగే నష్టాన్ని సూచిస్తున్నాయి.

**'హస్తకు ఆది పంట, చిత్తకు చివరి పంట'** అనే సామెత ద్వారా హస్తాకార్తెలో విత్తిన పంట వర్షాధిక్యంవల్ల సరిగా ఎదగక చిత్తా నక్షత్రంలోనే పాడైపోతుందని అర్థమవుతుంది.

**'హస్త ఆదివారం వస్తే చచ్చేటంతవాన'** ఆదివారం సూర్య ప్రాధాన్యం కలిగింది. హస్తా నక్షత్రానికి అధిపతి కూడా సూర్యుడే. హస్తకార్తె ఆదివారం నాడు ప్రవేశిస్తే విపరీతమైన వర్షం కురుస్తుందట.

**హస్త ఆదివారం వచ్చింది. చచ్చితిమయ్యా గొల్లల్లారా! చల్లపిడతల కాసులు తీసి సాలలు వేయించండి.**



హస్త ఆదివారం వచ్చింది. చస్తిమోయి గొల్లల్లారా! కాసుకొక దాన్ని కాలుపట్టీ ఈడ్వండి. (అన్నవట గొర్రెలు). వర్షం ఈ రోజుల్లో అధికంగా వస్తుంది. గొర్రెలు వర్షానికి తాళలేవు. అంతకు ముందు పొల్లాల్లో మందగట్టబడతాయి. కాని ఆ సమయంలో మాత్రం వాటికి కొట్టాలు అవసరమవుతాయి. గొల్లల పేరుతో చెప్పినా ఇదీ వర్ష జ్ఞానాన్నే చెపుతుంది.

ప్రవర్షణకాలంలో హస్త, చిత్తలలో వర్షం పడితే ఆ సంవత్సరం 16 ద్రోణాల వర్షం కురుస్తుందట. అధికమైనవర్షం కురవడం ద్వారా కూడా వేసిన విత్తు మురిగిపోయే అవకాశం ఉంటుంది.

**'అన్ని కార్తెలు తప్పినా హస్త తప్పదట'**

చిత్తకార్తెలో వేసుకున్న పైర్లు తరువాతి కార్తెల్లో బాధపెట్టకపోతే సక్రమమైన ఫలితాలనిస్తాయి.

**'చిత్త కురిస్తే చింతలు కాయును'** అనేది ఇటువంటి సామెతల్లో ఒకటి. **'చిత్త చిత్తగించి, స్వాతి చల్లజేసి, విశాఖ విసరకుంటే అనూరాధలో అడిగినంత పండుతాను అందిట వరి'**

**'చిత్త చిత్తగించి, స్వాతి చల్లజేసి, విశాఖ విసరకుంటే వీసానికి పుట్టెడు పండుతాను అన్నదిట జొన్న'** ఈ సామెతలను బట్టి చిత్తకార్తెకు ఉన్న ప్రాధాన్య మెంతటిదో తెలుస్తుంది. అక్టోబరు రెండవవారంలో చిత్తకార్తె ప్రవేశిస్తుంది. ఇది రెండవ ఋతుపవన సమయం. అలాగే పూర్తి స్థాయిలో కురువకపోతే ఎండ, ఉడుకపోతే అధికమవుతాయి.

**'వానలలో చిత్త చినుకు తన చిత్తమున్నచోట పడుకుందట'** చిత్త కార్తెకు వరి కొద్దిగా పొట్టకు వస్తుంది. వర్షం ఎండ సమానంగా ఈ కార్తెలో కనపడుతుంటాయి. **'చిత్త జల్లు– చిత్త ఉబ్బ'** అని సామెత ఈ విషయాన్నే తెలుపుతుంది. **'చిత్త స్వాతులు కలిస్తే వానలు అధికం' 'చిత్త స్వాతులు సంధించినట్లు'** అనే సామెతలు ఈ మధ్య

కాలంలో పడే వర్షాల విషయాన్ని సూచిస్తున్నాయి. **'ఉలవలు చిత్తలో చల్లితే చిత్తుగా పండుతాయట'** అనే విషయం వ్యవసాయదారునికి ఏ పంట ఏ సమయంలో వేయాలో నన్న విజ్ఞానం తెలియజేస్తుంది. వానలు అధికంగా కురిసే ఆ నక్షత్ర కార్తెలపై అధికంగా సామెతలు కనపడుతున్నాయి.

స్వాతి వాయు నక్షత్రం. ఈ నక్షత్రంలో వర్షంతో పాటు గాలి కూడా ఉంటుంది.

**'స్వాతి వర్షం చేనుకు హర్షం'**

**'స్వాతి వానకు సముద్రాలు నిండవు'**

**'స్వాతి వాన ముత్యపు వాన'** మొదలైన సామెతలు స్వాతీ నక్షత్ర ప్రాధాన్యాన్ని తెలియజేస్తున్నాయి. అక్టోబర్ చివరి వారంలో స్వాతి కార్తె వస్తుంది. ఇదీ ఋతుపవనాల సమయమే.

**'స్వాతి కురిస్తే మూడు కార్తెలు కురుస్తాయి'** అనే భావంతోపాటు **'స్వాతి కొంగ, పంటకాపు నీళ్లున్న చోట ఉంటారని'** వ్యవసాయదారుని స్థితి ఈ కార్తెల్లో వచ్చే కొంగలతో పోల్చిన సామెత ఇది.

**'స్వాతి కురిస్తే చట్రాయి కూడా పండును'** స్వాతి వర్షానికి ఇటువంటి సామెతలు రాళ్లు కూడా పండుతాయని సూచిస్తున్నాయి. స్వాతి చినుకుకు ముత్యం ఏర్పడుతుందని కూడా ఉంది. **'స్వాతివాన ముత్యపుచిప్పకుగాని నత్తగుల్లకేల'** అనే సామెత ఈ విషయం తెలుపుతుంది. ముత్యాలు ముత్యపుచిప్పలో ఈ కాలంనుండీ రూపు దాలుస్తాయని చెప్పవచ్చు. ప్రవర్షణ ప్రకారం స్వాతినక్షత్రంనాడు వర్షంపడితే ఆ సంవత్సరం కేవలం నాలుగు ద్రోణాలవర్షం కురుస్తుందట. అందుకే **'స్వాతికురిస్తే భీతి కలుగుతుంది' 'స్వాతి కురిస్తే చల్లపిడతలోకి రావు జొన్నలు'** అనే సామెతలు వచ్చాయి.

స్వాతీనక్షత్రంలో వర్షాలు ఆగిపోవాలి. విశాఖలో వర్షం పడితే ఇన్నిరోజులు పడిన్రశమ, చేసిన పనులు చెడిపోవడం జరుగుతుంది. కార్తెలో ఋతుపవనాలు కూడా ఆగిపోతాయి. అందుకే-



**'విశాఖతో మబ్బులు - మజ్జిగతో భోజనం సరి'**

**'విశాఖతో మేఘాలు - ప్రసూతితో యవ్వనం సరి'**

అనే సామెతలు విశాఖలో మబ్బులు ఆగిపోవడాన్ని తెలియజేస్తున్నాయి. ప్రవర్షణాకాలం ప్రకారం విశాఖనక్షత్రంనాడు వర్షం కురిస్తే 20 ద్రోణాల వర్షం కురుస్తుంది. అందుకే **'విశాఖను చూచి విడువర కొంప'** అనే సామెత వచ్చింది. ప్రవర్షణ కాలంలో విశాఖనాడు వర్షం పడితే ఊళ్లో బ్రతకడానికి వీలవుతుందని లేకుంటే కష్టమనే జ్యోతిషభావం సామెతల్లో కనపడుతుంది.

**'విశాఖ పద్దే పిశాచి పట్టినట్లు'** అనే సామెత పై విషయాన్ని తెలియజేస్తుంది. అయితే విశాఖ కార్తెలో వర్షం పడితే పొలాలన్నీ పాడవుతాయి.

**'విశాఖ (కార్తె) కురిస్తే విషం పెట్టినట్లు'** అనే సామెతలు పై విషయాన్ని తెలుపుతుంది. కాని పనులు రెండింటిని చెప్పాలంటే వ్యంగ్యంగా అనే సామెతలు ఉన్నాయి. **'విశాఖ వరదలు- సంక్రాంతి మబ్బులు'.**

అనూరాధ కార్తెలో పెట్టినపైరు ఈని పంటకు సిద్ధమవుతుంది. నవంబరులో ఈ కార్తె వస్తుంది.

**'అనూరాధలో తడిస్తే ఆడది మగవాడౌతాడు'** అనేది కలుపులు మొదలగు పనులు చేసే సమయంలో అందరు చేసే కృషిని తెలుపుతుంది. **'అనూరాధలో అడిగినంత పంట'** వస్తుంది. **'అనూరాధలో అనాథ క్రయినా ఈనుతుంది'** అనడం పైరు ఎదుగును చెపుతుంది. తక్కువగా పడే వర్షం ఒక్కసారి మెట్టపంటలపై పడే వర్షం వల్ల ఆ పంటలు బాగా పండుతాయన్న భావం తెలుస్తుంది. **'అనూరాధలో తడిస్తే మనోరోగాలు పోతాయి'** ఈ కాలంలో పడే వర్షాల వల్ల పంటలు బాగా పండడం మనశ్శాంతి కల్గడం, ఆర్థికపరమైన ఇబ్బందులు తొలగిపోవడం జరుగుతుంది.

ప్రవర్షణా కాలంలో అనూరాధలో వర్షం పడితే ఆ సంవత్సరం మామూలుగా 14 ద్రోణాలు వర్షం పడుతుంది.

**'జ్యేష్ట చెడ కురియును, మూల ముగురుగ కురియును'**

**'మూల ముంచును, జ్యేష్ట చెరచును (కురిసి)'**

ప్రవర్షణా కాలంలో జ్యేష్టా నక్షత్రంలో వర్షం కురిస్తే ఆ సంవత్సరం నాలుగు ద్రోణాలు వర్షం పడుతుంది. మూలలో 14 ద్రోణాలు కురుస్తుంది. జ్యేష్ట మూల కార్తెలలో పంట కోతలకు వస్తుంటుంది.

**'మూలకార్తెకు వరి మూలజేరుతుంది.'** అయితే ఈ సమయంలో పడే వర్షం అన్నింటినీ రాల్చి నోటిముందరి కూడును పాడు చేస్తుంది. అందుకే **'మూల కురిస్తే ముంగారు పాడు'** అని సామెత.

**'మూలవాన ముంచక తీరదు'** తమకు అవసరం లేనపుడు వర్షం కురవకూడదని ప్రతి రైతు కోరుకుంటాడు. అయితే దాన్ని గుర్తించడమే గాని, నియంత్రించడం లేనపుడు రైతు బాధపడుతూ చెప్పుకునే మాటలు సామెతలు నమ్మకాలుగా మారినాయి.

ఉలవలకు మూలలో ప్రత్యేక స్థానం ఉంది. మూలకార్తెలో ఉలవలు చల్లితే బాగా పండుతాయి.

**'మూలలో చల్లిన ఉలువలు మూడు పూవులు - ఆరుకాయలు'**

**'ఉలువలు మూల జ్యేష్టలలో విత్తినట్లు'** ఈ సామెతలు వ్యవసాయదారుల విజ్ఞానాన్ని వెల్లడిస్తున్నాయి.

పూర్వాషాఢ, ఉత్తరాషాఢ, శ్రవణం, ధనిష్ట, శతభిషం, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, రేవతులలో వర్షం అధికంగా కురదరు. డిసెంబరు తర్వాత వచ్చేది చలికాలం. అందుకే ఈ కార్తెలపరంగా వర్షపరమైన సామెతలు కనపడడం లేదు.



**'రేవతి వర్షం రమణీయం'** అనేది కూడా ప్రవర్షణ కాలంలో రేవతి నక్షత్రంలో వర్షం కురిస్తే ఆ సంవత్సరం 16 ద్రోణాలు కురుస్తుందనే విషయాన్ని తెలుపుతుంది. ఈ విధంగా నక్షత్రాలు సంబంధమైన సామెతలు అనేకం వ్యవసాయదారుల విజ్ఞానానికి ప్రతీకలుగా కనపడుతున్నాయి.

మాసాలకు సంబంధించిన అనేక సామెతలు జానపదుల వర్షవిజ్ఞానాన్ని తెలుపుతున్నాయి.

**'చిత్రి నెలలో దుక్కి, పుటంపెట్టిన పుత్తడి'**

ఉగాది తర్వాత చాంద్రమానం ప్రకారం వచ్చేది చైత్రమాసం. ఆ సమయంలో దుక్కి దున్నడం మొదలవుతుంది. తొలకరి చినుకులు ఒకసారి కురిసిపోతాయి. అప్పుడు గనక దున్నడం మొదలైతే బంగారంలాంటి పంటలు పండుతాయి.

**'అన్ని పైరులకు ఆషాఢం'** శ్రేష్టంగా ఉంటుంది. ఆర్ద్రకార్తె ఆ మాసంలో వస్తుంటుంది. **'కార్తీకమాసానికి కడపటి వర్షాలు'**

**'కర్ణునితో భారతం సరి, కార్తీకంతో వానలు సరి'**

నవంబరు మాసం చివరిలో వర్షాలు ఆగిపోతాయి. మళ్లీ పడితే అది నాశనానికి తప్ప మంచికి పనికిరాదు. అందుకే కార్తీకమాసం గూర్చి ఈ విధంగా సామెతలు వచ్చాయి.

**'మార్గశిరాన మామిడిపూత మొదల'**వుతుంది.

**'మాఘమాసంలో చలి మంటల్లో పడ్డాపోదు'** అంటూ వర్షం తమపై గలగజేసే ప్రభావాన్ని వ్యవసాయదారుడు సామెతల రూపంలో వివరించడం కనిపిస్తుంది.

ప్రకృతికి సంబంధించి ఆకాశ పరిశీలన, చంద్ర పరిశీలనలు జానపద సామెతల్లో ఎక్కువగా కనపడుతున్నాయి.

'చంద్రపరివేషం వర్షయోగం' అని జానపదుల భావన. బృహత్సంహిత సద్యోవర్షాధ్యాయం 6వ శ్లోకం ప్రకారం –

"గిరియోఽంజన చూర్ణ సన్నిభా యదివా బాష్ప నిరుద్ధ కన్దరాః

కృక వాకు విలోచనో ఏమాః పరివేషాః శశినశ్చ వృష్టిదాః ॥"

కాటుక చూర్ణం వంటి పర్వతం, ఆవిరితో కూడుకున్నట్లున్న గుహ, నీటిలో జీవించే జీవుల కండ్లవంటి చంద్రకిరణాలు ఉంటే వర్షం వెంటనే అధికంగా పడుతుంది.

ఈ విషయాలతోపాటు చంద్రుని చుట్టూ గుడి గట్టడాన్ని కూడా వరాహ మిహిరుడు తెలియజేశాడు.

**'దూరంగా గుడికడ్తే దగ్గరలోనూ, దగ్గరగా గుడికడ్తే దూరంలోనూ వర్షం పడుతుందన్న విషయం'** శాస్త్రీయమైనదే. ఇటువంటి విశేషాలు వివిధ పశు పక్ష్యాదుల ప్రవర్తనల ద్వారా తెలుసుకోవడం వ్యవసాయదారుల భవిష్య జ్యోతిషవిజ్ఞానానికి నిదర్శనం.

**'శుక్రవారం ధాన్యం కొలిస్తే మంచిదట'** అనే భావం శుక్రవారానికి అధిదైవమైన లక్ష్మి తన ఇంట నిండాలన్న భావంతో ఏర్పడిందే.

**'బుధవారం చల్లితే బుట్టలోకి రాదు'** అనే మాట వ్యవసాయదారుల వద్ద బాగా వినిపిస్తుంది. **'బుధవారం పుట్టిన మనిషి –బుధవారం పుట్టిన దున్న'**తో దున్నితే భూమిలో బంగారం పండుతుందట.

**'మంగళవారం మందెవేయకూడదట'** అనేది కూడా శుభదినాన విత్తన శుద్ధి చేసి మొలకలకు వేయాలని సూచిస్తుంది.

ఈవిధంగా వ్యవసాయ సంబంధంగా వివిధ అంశాలపై జ్యోతిష సంబంధమైన వేర్వేరు అంశాలు అధికంగా ఉన్నాయి. వర్షానికి సంబంధించిన సామెతలు వీనిలో అధికంగా కనపడుతున్నాయి.



# 4. ప్రకృతి - పశుపక్ష్యాదులు

పంచభూతాత్మకమైన ప్రకృతి నిత్యం పరిశీలనా యోగ్యమైందే. ఒక్కొక్కరూ ఒక్కో విషయాన్ని ఈ ప్రకృతినుండి గ్రహిస్తారు. ప్రకృతికి అనుగుణంగా బ్రతకడానికి ప్రయత్నం చేస్తారు. ప్రకృతిలో మార్పులేవి కల్గినా ఆ ప్రభావం సకల జీవరాశులపై పడుతుంది. దాని ప్రకారం చాలా విషయాలు గమనిస్తూ వ్యక్తి ముందుకు సాగుతాడు. పశుపక్ష్యాదులు మనుషుల కన్నా ముందుగా ఈ ప్రకృతి సందేశాలను గ్రహిస్తాయి. వీటిని ఆధారం చేసుకుంటూ కూడా మనిషి భవిష్యత్తులో జరిగే విశేషాలు సూచనాత్మకంగా తెలుసుకోవడానికి అవకాశాలు అధికంగా ఉన్నాయి. ఆకాశం, నేల, నీరు, నిప్పు, గాలి అన్నీ జ్యోతిస్సుల ప్రభావం వల్ల మార్పులు కలిగేవే.

"ఏదో చెప్పరాని ఆపద సంభవిస్తుందన్నప్పుడు ప్రకృతిలోను, దానిలోని జంతుజాలాల్లో కలిగే మార్పులు అవి ఆపదలను సూచిస్తాయని మన విశ్వాసం. ఈ పరంగానే అన్నింటిని గమనించడం దినచర్యలలో భాగాలైనాయి. జ్యోతిశ్శాస్త్రం ప్రకారం శకున శాస్త్రాంతర్భాగాలైనాయి."-

**'హేతువు లేకుండా తీతువు కూయదు.'** తీతువు కూస్తే ఏదో ఉపద్రవం సంభవిస్తుందన్న నమ్మకం మనలో ఉంది. కారణం లేకుంటే కార్యం పుట్టదుకదా! అందుకే పరిశోధనలు ఏవైపు జరిగితే దాని పరమైన ఫలితం లభిస్తుంది. వీటన్నింటి ఫలితాలు గమనించేది మనస్సే. మనసు కాంతియొక్క సూక్ష్మరూపం.

మనిషి ఏదో పొందడానికి నిర్విరామంగా కృషిచేస్తుంటాడు. ఈ ప్రకృతిని జీవజాలాలను అన్నింటినీ నియంత్రించే ఒక అదృశ్య శక్తి ఉందని భావిస్తారు. ఏది మంచి, ఏది చెడు అని తెలుసుకోలేని పరిస్థితి వస్తే 'అంతా దైవాధీనం' అనే విశ్వాసానికి వస్తాడు. మానవ జీవితం ప్రకృతితో జీవజంతు జాలాలతో పూర్తిగా ముడిపడి ఉంది. ఈ ప్రకృతిని ఉపయోగించుకోవడం కాక దాని ఆదేశాలకు కొంత లోబడుతూ కొంత అతిక్రమిస్తూ జీవన విధిని సాగిస్తున్నాడు. అతిక్రమించిన సమయంలో నష్టం

వాటిల్లుతుంది. ముఖ్యంగా జానపదులు ప్రకృతి ఆదేశానుసారంగా దిక్కు, దేశం, కాల పరిస్థితులు ఆధారంగా తమ జీవనవిధులు నిర్వర్తిస్తున్నారు. ప్రకృతి జీవ జాలాదులతో ముడిపడ్డ మానవ మనస్తత్వం అంతా తనకు శుభసూచకం కావాలని ప్రయత్నిస్తుంది. ఏయే వస్తువులు, ఏ జంతువులు, ఏ మానవ చర్యలు తనకు ఆనందాన్ని కల్గిస్తాయో వానిని శుభ సూచకాలుగా గుర్తించారు. వేటివల్ల నిరంతరం బాధ మనస్తాపం, కార్యహాని జరుగుతున్నాయో అవి అశుభసూచకాలైనాయి.

ప్రకృతిలో శుభాశుభ నిమిత్తాల ఆధారంగా కొన్ని మార్పులు కలుగుతుంటాయి. అది కొన్ని విశేషాలను సూచిస్తుంది. దానికనుగుణంగా మానవుడు స్పందిస్తాడు. అది ఆనందకరమా? కాదా? పరిశీలించి మంచి అయితే శుభశకునంగా, బాధ కలిగిస్తే అశుభశకునంగా భావించాడు.

శకునం కేవలం సూచితాత్మకమే. శకునాన్ని తిట్టడం టెలిగ్రాం తెచ్చిన పోస్టు మనిషిని తిట్టడం వంటిది. మనసు సూచనలిచ్చి మేలు చేసేది కావున శకునాలు తిట్టుకునే ధోరణి అన్ని వర్గాలు ఖండించాల్సిందే. ఐర్లండు దేశంలో అద్దం పగిలిపోతే వెంటనే బయట పారవేస్తారు. పగిలిన అద్దంలో చూసుకోవడం అపాయకరం. దానినుండి జీవనచక్రం భగ్నమవుతుందన్న విశ్వాసం వారికుంది. అలాగే గోడకు తగిలించిన చిత్రం కిందపడితే ఇంట్లో ఎవరైనా మరణిస్తారు. ఉత్తర అమెరికాలోని భారతీయుల తెగల్లో మనిషి పడుకున్నపుడు గాని, కూర్చున్నపుడు గాని అతన్ని దాటుకుని పోరాదనే నమ్మకం ఉంది. ఇటువంటి నమ్మకాలన్నీ దక్షిణ భారతదేశంలో కనిపిస్తున్నాయి. వీటన్నింటిలోనూ అద్దం-చిత్రాలు శకునాలు కావు. కాని అది పడడం, పగలడం ద్వారా వచ్చే శుభాశుభ నిమిత్తాలను మనసు గుర్తిస్తుంది. మనసుకు అధికమైన శక్తి ఉంది. దానికున్న అపరిమితమైన శక్తుల్లో మనం కేవలం 10% మాత్రమే వినియోగించుకుంటున్నామన్నది ఆధునిక వైజ్ఞానికులు అంగీకరిస్తున్న విషయం. పారాసైకాలజిస్టుల ప్రకారం మనసుకున్న శక్తుల్లో జరుగబోయే సంఘటనలు స్ఫురించడం ఒక భాగం. అతి సామాన్యమానవుడు కూడా జరుగబోయే సంఘటనలు



గుర్తించడం మనం గమనిస్తుంటాం. అయితే స్ఫురించిన ప్రతి అంశం వాస్తవం కావాలనేమీ లేదు.

మనసుకున్న శక్తిని ఉపయోగించి ప్రకృతిని అనుసరించి ఏకాగ్రంగా పరిశోధనలు చేస్తే ఆ విషయాల్లో ముందుకు సాగవచ్చు.

**'పిల్లి శకునం ప్రయాణ సమయంలో మంచిది'** అని కొందరు పరిశోధన ప్రారంభిస్తే వారు శుభఫలితం గమనించారు. చెడ్డదనే కోణంలో పరిశోధన సాగించినవారు అశుభఫలితాన్ని గుర్తించారు. రెండింటిలో శుభాశుభాలను గుర్తించింది వారి మనస్సే గాని పిల్లికాదు. అది కేవలం ఆధారం మాత్రమే. మనసుకు శంక, భయం, అనుమానమనే భావాలలో శకునాలలో అధిక ప్రాధాన్యముంటుంది. ఉల్లాసంగా, ఆనందంగా ఉన్నపుడు శకునం ఎలాంటిదన్న ఆలోచనకు ఆస్కారం తక్కువ. అందుకే 'మనోజవంతు మాండవ్యః' అని మాండవ్యుడు మనసుకే అధిక ప్రాధాన్యమిచ్చినాడు.

ఈ శకునాల జాబితా ప్రాంతపరంగా, దేశపరంగా తేడాలుంటాయి. ఒక్కొక్కరి దిగ్దేశ కాలాలు, ఆ ప్రాంతాలలో జీవించే జీవులు, వారి మనస్థితిపై ఈ విషయాలు ఆధారపడి ఉంటాయి. కాని ఈ శకునాలు సర్వప్రపంచ సార్వకాలిక సూత్రాలు కావు. అయితే అటువంటి వానిని గుర్తించే వ్యక్తి తన శక్తియుక్తులు వ్యర్థం కాకుండా, సమయం వృథా కాకుండా, తగు జాగ్రత్తలలో ముందుకు సాగే శుభఫలితాలు పొందే అవకాశం ఉంటుంది.

మంచి చెడ్డలనే కాలస్వరూపం భేదాలను గుర్తించడానికి చేసే ప్రయత్నం సాధన అనేవి మూఢవిశ్వాసాలుగా భావించడం కొందరు చేస్తున్న పని. మానసిక శక్తులను సద్వినియోగం చేసుకునేవారు మూఢులని భావించడం, వారి విశ్వాసాలపై దండెత్తడం, మొదలైన కార్యక్రమాలకు తమ శక్తియుక్తులను వినియోగించడం అలారం గడియారానికి సంబంధించిన 'కాని' విరచడానికి చేసే ప్రయత్నం వంటిదే.

ఈ కోణంలో పరిశీలిస్తే వచ్చిన వివిధ సామెతలు, నమ్మకాలు, పొడుపుకథలు జానపదుల జ్యోతిర్విజ్ఞానానికి దర్పణాలుగా ఉన్నాయి.

**'ఆకాశంలో గొఱ్ఱెతొక్కుడు పడితే అతి సమీపంలో వర్షం'**

చిన్న చిన్న మబ్బుల తునకల పేర్పును అగడప, గొఱ్ఱెతొక్కుడు అంటారు. అది చూసిన వెంటనే వర్షసూచనగా భావిస్తారు. దీన్ని తమ గొఱ్ఱెలతొక్కుడుగా గొల్లలు అభివర్ణించారు. తగిన జాగ్రత్తలు తీసుకోవడానికి ప్రయత్నం చేస్తుంటారు.

**'అగడపలు వేశాయి అత్తా అంటే అట్లకు బియ్యం నానబొయ్యి కోడలా?'** అన్నదట.

**'అగడపలు వేస్తే అవశ్యం కురుస్తుంది'**

**'అగడపలు వేసిందే అత్తా అంటే అటిక నాచేత ఉన్నదిలే అందట.'**

ఇవన్నీ నిత్యజీవనంలో ఆకాశంలోని చిన్న మబ్బులు సమూహం వేసినపుడు వర్ష సూచనగా భావించిన సామెతలు.

**'ఉత్తరాన మబ్బు ఏలితే ఊరికే పోదు'** ఇది ప్రకృతి పరిశీలనాంశం.

**'తూర్పున ఇంద్ర ధనుస్సు దూరాన వర్షం'**

**'తూర్పున ఇంద్రధనస్సు వేస్తే తుంగమడిలోనూ, పడమర ఇంద్రధనుస్సు వేస్తే బండమీదను పశువులను గట్టాలి.'**

వర్ష విజ్ఞానానికి కేవలం సూర్యుడు వివిధ నక్షత్రాలలో ప్రవేశించే సమయ వివరాలే గాక మబ్బు వివిధ దిక్కుల్లో ఉన్నపుడు చూచి చెప్పగలిగే విజ్ఞానం జానపదులకుంది.

**'ఉత్తరంవైపు మబ్బు పడితే తప్పక వర్షం పడుతుంది, తూర్పున ఇంద్రధనుస్సు వస్తే అతి తక్కువ వర్షం. పడమర మబ్బు ఇంద్రధనుస్సు వస్తే మాత్రం తీవ్రంగా వర్షం పడుతుంది.'** ఈ భవిష్యత్సూచక వర్షవిజ్ఞానం జానపదుల సొంతం.



ఇటువంటివే

**'తూర్పున కొఱ్ఱు (ఇంద్రధనుస్సు) వేస్తే, దుక్కిటెద్దు రంకె వేస్తుంది.'**

**'తూర్పున ధనుస్సు వేస్తే తుంగ గడ్డ కూడా తడవదు, పడమట వేస్తే పల్లాలన్నీ నిండుతాయి.'**

**'తూర్పున వరదగూడు వేస్తే తుంగపోచయినా తడవదు.'**

**'తూర్పున వాన పడితే వర్షమంతా సముద్రంలో పడుతుంది. పడమర పడితే మనవైపు పడుతుంది.'** ఇది భారతదేశానికి మాత్రమే సంబంధించిన విషయం.

**'పడమట కొఱ్ఱు వేస్తే పాడియావు రంకె వేస్తుంది.'**

**'పడమట పావురాపిట్టంత మబ్బు నడిస్తే పాతాళం దాకవాన'**

**'పడమట విసరంత మబ్బు నడిస్తే పాతాళం దాకావాన'**

**'పడమట కురిస్తే పంది అయినా నీళ్లకు దిగదు.'**

**'పడమట మెరిసిన పదిగడియలకు వాన.'**

ఈవిధంగా మనదేశ కాల పరిస్థితులకు అనుగుణంగా పడమరవైపు మబ్బు పడడం వల్ల వర్షం బాగా కురుస్తుంది. వివిధ జంతువులకు కూడా ఈ జ్ఞానం ఉంది. అదే విధంగా వ్యవసాయ యోగ్యమైన పశువులకు పని చేస్తుందని, పాడి యావులకు గడ్డి బాగా దొరుకుతుందని ఇంకా అనేకరకాలైన అర్థాలతో ఈ సామెతలు వెలువడ్డాయి.

**'అదృష్టం చెప్పిరాదు-దురదృష్టం చెప్పిపోదు'** అయినా వ్యక్తి ప్రకృతిని తనకు అనుగుణంగా మలచుకోవడానికి ప్రయత్నం చేస్తుంటాడు.

**'కాకి గూడు పెడితే కడపటి వర్షం'** కాకులు తమ గూళ్లను వర్షాలు ఆగిపోయే

సమయంలో పెట్టుకుని మళ్లీ వర్షాకాలం వరకు జీవిస్తాయి. అది గూడు పెట్టిందంటే వర్షాలు ముగిసినట్లే.

'కాకి అరిస్తే చుట్టాలొస్తారు లేదా ఉత్తరం వస్తుందట'

'కాకి కూత బోలు కర్మ బంధుల కూత'

కాకి గొంతేస్తే ఇంటికి చుట్టాలొస్తారు.'

కాకి అరచినపుడు జరుగుతున్న శుభాశుభాలను గుర్తించిన మనసు ఈ విషయం వెల్లడిస్తుంది. 'కాకితో కబురు పంపడం' అనే మాట కూడా మనం వింటున్నదే. బృహత్సంహితలోని 'వాయస విరుతాధ్యాయం' లో వివిధ రకాలుగా కాకుల చేష్టలు అరుపులకు ఫలితాలు వివరంగా తెలిపారు. దానినుండే ఈ సామెతలు వచ్చినాయి. రెండింటిలో సారూప్యం కనపడుతుంది. అవి సామెతల రూపంలో ఉండి తరువాత శాస్త్రీకరించబడినాయి.

'కాకి మనిషి తలమీద తంతే, పట్టుకున్న శని వదిలిపోతుందట'

'కాకి మనిషిని తంతే స్నానం చేసి శనిదీపం పెట్టాలట.

జ్యోతిశ్శాస్త్రరీత్యా శనికి నలుపురంగు, కాకవాహనం అనీ నిర్ణయం. అందుకే అది తంతే శని వదిలిపోతుంది. స్నానం చేసి శనికి దీపం పెట్టాలని, ఇటువంటి పక్షులు ఏమి చేసినా శాంతులు జరుపుకోవాలని ప్రత్యామ్నాయ మార్గాలు సూచిస్తారు.

"కాకి ఇంటిలోనికి ప్రవేశిస్తే ఆ ఇంటిలో ప్రవాసం చేయరాదు.'

'ఇంట్లో కాకి ప్రవేశిస్తే శాంతి జరపాలి.'

వీటికి శాస్త్రోక్తవాక్యాలున్నాయి.

"మధుజ్వాలంతు పక్షీణాం వల్మీకే హస్తజాయతే,
గృహ మధ్యే యమాగ్నేయం నైఋత్యాం వారుణం మృతం॥"



"షణ్మాసం మధుహస్త జాత శశకం మాసత్రి శ్వానోలుకం
గృధ్రం వాయస జంబు జంతుషు గృహేగత్వా సమాసార్థకం।
పక్షం వర్జ కపోత గోధ సమయే గచ్ఛంతి యే మందిరం
తే ముంచామి శుభప్రదం వసతుమే శ్రేష్ఠ వసిస్త్రాదిభిః॥

"కపోత శశినా గోధ జంబుకం గృహమావిశేత్
భుజంగ క్రూర పక్షిణాం గృహకర్తా వినశ్యతి"

గృహంలో పెద్ద పిట్టగాని, ఉడుముగాని, గువ్వగాని, కుందేలుగాని, ప్రవేశించిన దోషం కలుగును. తేనెతుట్టెకూడా పెట్టరాదు. అట్లు అయిన యజమానికి మృత్యుప్రదం. నక్క గాని, కుక్కగాని ఇంటిపైన ఎక్కకూడదు. వాటికి పరిహారంగా గృహాన్ని వదిలిపెట్టాలి. తేనెతుట్టె పడితే ఆరుమాసాలు, పెద్దపిట్ట ప్రవేశిస్తే మూడు మాసాలు, కుక్క నక్క గృహంపై ఎక్కితే నెలన్నర, గువ్వ, కుందేలు ప్రవేశిస్తే 15 రోజులు గృహం వదిలి తర్వాత శాంతి జరిపించి గృహంలో తిరిగి ప్రవేశించాలి.

వీటి ఆంతర్యంకూడా ఇటువంటివి ప్రకృతిలోనూ, లేదా గృహం ఆవరణలో ఏదో కీడు కలుగబోతున్నట్లు సూచిస్తున్నాయని, ఆ సమయం జాగ్రత్తలు తీసుకోవాలని భావించడమే. జానపదుల సామెతల్లో కూడా ఈ రకమైన భావాలే కనపడుతున్నాయి.

ఇంకా

'చీమలు చెట్లెక్కితే భూములు పండుతాయట'

భూమిని చీమలు గుల్లగా చేస్తాయి. అక్కడ వ్యవసాయం శుభకరమవుతుంది. చీమలకున్న వర్షవిజ్ఞానంతో అవి ముందుగా గమనించి భూమినుండి చెట్టుపైకి చేరుతాయి. ఆ విషయం మనం గమనించడంవల్ల శుభాన్ని పొందుతాం.

'తూనీగలు ఆడితే తూమెడు వర్షమట' వర్షం మబ్బులు వచ్చేముందు తూనీగలు బాగా లేస్తాయి. వీటి ఆదారంగా వర్షం నిర్ణయించడం వర్షవిజ్ఞానమే.

'తూర్పు వైపున తోకచుక్క పుడితే దేశంలో గొప్పవ్యక్తి మరణిస్తాడు.' తోకచుక్కలు ఎన్నో సంవత్సరాలకు ఒకసారి వస్తాయి. బృహత్సంహితలో ధూమకేతు ఉల్కా పాతాధ్యాయాలలో వీటి శుభాశుభ ఫలిత నిర్ణయం జరిగింది. ఆ సమయంలో ప్రపంచంలో ఎవరో గొప్పవారు మరణిస్తున్నారు. దానివల్ల ఇది నమ్మకంగా స్థిరపడింది. తొకచుక్క కనిపించడం దోషంగా భావిస్తారు.

'ధూమకేతువు కేతువనియో, మోముచందురుదలిగి చూడదు' అని శిష్ట సాహిత్యంలోకి తోకచుక్క చేరింది.

'పుష్య పూర్ణిమనాడు రాత్రి పందిరిమీద దూది పింజను పెట్టి తెల్లవారి నలిపితే నీళ్లు కారితే మరుసటి సంవత్సరం మంచివర్షం కురుస్తుందట.'

'మార్గశిర మాసంలో మంచుపడ్డ నూట తొంబయ్యవనాడు మంచివర్షం'

వర్ష భవితను ముందుగా తెలుసుకోవడం ఈ విషయం తెలియజేస్తుంది. మంచుపడ్డ ఆర్నెల్లకు వర్షం బాగా పడుతుందని ప్రత్యక్షంగా చూస్తూ అన్నమాటైనా దీని వెనుక భూమి సూర్యునిచుట్టూ తిరగడం, ఋతువులు ఏర్పడడం మొదలైన అన్ని వైజ్ఞానిక అంశాలు వారు పరిశీలించడం కూడా తెలుస్తుంది.

'ఏ జన్మలో కలిగిన సర్పదోషం వల్ల ఈ జన్మలో సంతానం కలుగలేదన్న విశ్వాసం ఉంది' గ్రహాలలో రాహువు వీనికి ప్రతీకగా, కారకుడిగా చెపుతారు. రాహువు 5వ స్థానంలో ఉండడం సర్పదోషంగా భావిస్తారు. సంతాన నష్టం కూడా సూచిస్తారు. పాములను కూడా అందరూ ధైర్యం చేసి చంపరు. సర్పాలను చంపడంద్వారా గాని, బాధపెట్టడంద్వారా గాని అవి పగబడతాయన్న విశ్వాసం ఉంది. దీనిద్వారా సంతానానికి హానిగా భావించడం జరుగుతుంది.

'చేతిలో గరుడ రేఖ ఉంటే పాములు బెదరిపోతాయట' ఇది సాముద్రికానికి సంబంధించిన విషయం.



'చేతివ్రాత బావుంటే తలవ్రాత కూడా బావుంటుంది.' ఈ చేతివ్రాత వ్రాసేదిగాను, చేతిలోని గీతలనియు రెండు అర్థాలుగా ఉపయోగించుకోవచ్చు.

'మట్టి నేలలో కప్ప అరిస్తే వాన తప్పదు.'

'మట్టిగడ్డలో కప్ప కూస్తే ఒక జాముకు వర్షం.'

వర్ష సంబంధంగా కప్పల కూతలను ఆధారం చేసుకుని వచ్చిన సామెతలివి. ప్రకృతిలో వాన మొదలైన అంశాలను మనుషులకన్నా జంతువులు, పక్ష్యాదులు ముందుగా గ్రహిస్తాయి. కప్పలు ఉభయచరాలు. వీని అరుపుల ద్వారా వర్షాగమనం గుర్తించవచ్చు.

'తుమ్మెదలాడితే వాన తప్పదు.'

'రాత్రి సమయాల్లో కోయిల కూస్తే వర్షం వస్తుందట.'

'కోడి రెక్కారవేస్తే గొప్పవాన కురుస్తుంది.'

'వర్షం పురుగులు (రెక్క పురుగులు) వస్తే వర్షం బాగా కురుస్తుందట.'

'కుక్క పైకి చూచి ఏడిస్తే వాన, క్రింద చూచి ఏడిస్తే చావు.'

'పొయ్యి అరిస్తే బంధువుల రాక, కుక్క అరిస్తే కరవు రాక.'

ఇటువంటి విషయాలన్నీ జానపదుల పరిశీలనలే. వాస్తవంలో ఎంతో కొంత శాతం జరిగేవే. బృహత్సంహితవంటి ప్రాచీన జ్యోతిషగ్రంథాలలో విపులంగా వివరించబడినవే. వివిధ జంతువులు అరచినపుడు వచ్చే ఫలాలు, శకునాలు ఆనాటికే పరిశోధనలోనికి వచ్చాయి.

'గాడిద వెంట్రుకలు నిక్కబొడుచుకుంటే వర్షం వస్తుందట.' ఈ విధంగా ప్రకృతి పశు పక్ష్యాదుల పరిశీలన వల్ల భవిష్యదంశాలు తెలుస్తుంటాయి. ఫలితాలు అర్థమవు తుంటాయి. దీని ప్రకారం వర్షవిజ్ఞానం ప్రకృతిద్వారా గ్రహించగల్గడమే జానపదుల జ్యోతిర్విజ్ఞానం.

'కందిరీగలు ఇంట్లో తెట్టెపెడితే ఇంట్లో ఉన్న స్త్రీలెవరైనా గర్భవతులౌతారట' ఇది కేవలం నమ్మకంగానే ఉంది.

'పౌర్ణమినాటికి తేనెతుట్టెలో తేనె నిండుగా ఉంటుందట. అమావాస్యకు ఖాళీ అవుతుందట.'

'పౌర్ణమికి పూజించి, అమావాస్యకు ఆరగిస్తవి.' ఇవి తేనెటీగలకు సంబంధించినవి. తేనెటీగలు పౌర్ణమినాటికి తేనె నిండుగా నింపుతాయి. అమావాస్యవరకు తాగేసి వెళ్లిపోతాయి. పొడుపుకథల్లో కూడా వివరించబడినాయి. 'హేతువు లేకుండా తీతువు కూయ'దనే భావం బాగా ఉంది. 'తీతువు కూస్తే అపశకునం ఊళ్లో ఎవరైనా మరణిస్తారట.'

ఈ విధంగా తీతువు పక్షివల్ల, దాని అరుపులవల్ల తప్పకుండా మరణమని భావిస్తారు జానపదులు. ఈ పక్షుల అరుపులు, చేష్టలవంటి విషయాలు ప్రాచీన సంహితలో వివరించబడినాయి.

'పెళ్లికి పోతూ పిల్లిని చంక బెట్టుకుని పోయినట్లు.'

'చెవులపిల్లి ఎదురైతే చేటు వస్తుంది.'

'గుడ్డ గూబను చంకలో బెట్టుకుని బయలు దేరినట్లు.'

ఇవన్నీ శకునాలనే భావంతో కొంతమంది వ్యక్తులను అనుమానిస్తూ చెప్పే సందర్భాలు.

తుమ్ము విషయంలో శకునాలు అధికంగా భావించడం జరుగుతుంది.

'లగ్నంలో తుమ్మినట్లు' అని శుభకార్యం ముందు తుమ్మడం వల్ల అనర్థమనే భావం జానపదుల్లో అధికంగా ఉంది. ప్రస్తుతం శుభకార్యాలలో ఈ తుమ్ములవల్ల అనర్థమని ఎవరైనా తుమ్మితే తిడ్తుండడం గమనిస్తాం.



'రెండును తుమ్మిన సఫలము
ఖండితముగ తుమ్మి చీదగా మరణమగున్
మెండుగ తుమ్ముచు నడచిన
జెందును దోషములు నరుడు శిఖి నరసింహా'

అంటూ తుమ్ములపై శతకాలు కూడా వచ్చాయి. వీటిని పరిశీలించే మనసు, మన ప్రాంతంలో వీటికున్న స్థితి వీటి ఆధారంగా ఈ ఫలితాలు విశ్లేషించడానికి అవకాశం ఉంది. అయితే వివిధ గ్రంథాలలో ఇప్పటికే ఇటువంటి విషయాలు కొన్నింటిని వివరించడం జరిగింది. ప్రత్యేకంగా 'శకున' విషయంలో ఉత్తర భారతదేశంలో తీవ్రమైన పరిశోధనతో గ్రంథాలు వెలువడినాయి.

చంద్ర పరిశీలనలో నెలవంకపైన కూడా సామెతలు శాస్త్రీయ పరిశీలనలుగా కనపడుతున్నాయి.

'దక్షిణం కొమ్ము ఎక్కువైతే ధాన్యం ధర హెచ్చు.' 'ఉత్తరపు కొమ్ము హెచ్చు అయితే ఉప్పుధర హెచ్చు' అనేది వైజ్ఞానికాంశం. సూర్యుని నీడ చంద్రునిపై పడకుండా భూమి అడ్డు పడుతుంది. దానిలో ఉత్తరాయణ, దక్షిణాయన సమయంలో మార్పు ఉంటుంది.

దక్షిణం కొమ్ము ఎక్కువైతే భూమిపై వర్షాలు అధికంగా పడడంవల్ల ధాన్యం తడిసి, పాడై ధాన్యం ధర పెరుగుతుంది. ఉత్తరం కొమ్ము ఎక్కువైతే సముద్రంలో ఎక్కువ వర్షం పడి ఉప్పుమడులు పాడైపోయి ఉప్పుధర పెరుగుతుంది.

ఈ విధంగా వివిధ ప్రకృతి పశుపక్ష్యాదుల సంబంధాలతో, వాటి గమన పరిశీలనలతో నూతన జ్యోతిషాంశాలను, భవిష్యసూచనను జానపదుడైనవాడు గ్రహింపగలడు. ఇవే నమ్మకాలు, సామెతలు, పొడుపుకథల రూపంలో కనిపిస్తున్నాయి.

# పొడుపు కథలు

# జ్యోతిర్విజ్ఞానం

'ఫలమై వెలిసెను భూమిలో
ఫలములలో లోన వెలయు పంద్రెండద్రల్
అద్రకు ముప్పది విత్తులు
విత్తులలో సగము తెలుపు నలుపై యుండున్'

ఇది పొడుపు కథ. ఈ పొడుపు విడవాలంటే కాలస్వరూపం తెలియాలి. నిగూఢమైన అర్థాలుగా కనిపిస్తున్నా విడిస్తే అవి అందరకూ తెలిసే సామాన్యమైన అంశాలే. ఇది పండు అనే అర్థంలో మామూలు దృష్టికి కనపడుతుంది.

దీంట్లో ఫలం-సంవత్సరం, పంద్రెండద్రలు-మాసాలు, ముప్పది విత్తులు-రోజులు, సగం తెలుపు శుక్ల పక్షం, సగం నలుపు కృష్ణపక్షం

'ఒక పండు
పండుకు విత్తులు ముప్పది



వాటిలో తెలుపువి పదిహేను
నలుపువి పదిహేను' (కాలం)

ఇక్కడ కూడా పండు నెల, విత్తులు రోజులు, తెలుపు పదిహేను శుక్లపక్షం, నలుపు పదిహేను కృష్ణపక్షం.

"పండుకు పన్నెండు పచ్చులు
పచ్చులు ముప్పది విత్తులు
పదిహేను తెల్లవి-పదిహేను నల్లవి' (కాలం)

పండు-సంవత్సరం, పన్నెండు పచ్చులు-పన్నెండు నెలలు, ముప్పది విత్తులు-ముప్పై రోజులు, శుక్ల పక్షం- తెల్లవి, కృష్ణపక్షం-నల్లవి.

ఈ విధంగా కాల స్వరూపాన్ని, సంవత్సర స్వరూపాన్ని పొడుపుగా వివరించడం జరుగుతుంది. దాన్ని విడిపించడంలో జ్యోతిశ్శాస్త్ర పరిజ్ఞానం ఉండాలి. జ్యోతిష విజ్ఞానం చదువుకుంటేనే వచ్చేది కాదు. ప్రకృతిలో నిత్య పరిశీలనవల్ల సంప్రదాయంగా వచ్చే నమ్మకాల వల్ల అర్థమవుతుంది. తమకు తెలిసిన భావాలను తమ మేథాశక్తి ఉపయోగించి ఒకరు పొడుపుకథ ద్వారా వ్యక్తీకరిస్తే ఎదుటివారు బుద్ధి కుశలతతో దాన్ని విడిపించాలి.

పొడుపుకథను బాగా పరిశీలిస్తే వీటిలో జ్యోతిష సంబంధ విజ్ఞానాన్ని, పరిభాషను ఉపయోగించుకున్నవి, సిద్ధాంతపరమైన మూలాంశాలు చెప్పేవిగానే కనపడుతున్నాయి. ఫలితజ్యోతిష భావనలు జానపదుల పొడుపుకథలలో అతి తక్కువగా కనపడుతున్నాయి. అందుకే కేవల పరిభాష గూర్చిన ఈ పొడుపుకథలను ప్రత్యేకంగా పరిశీలించడం జరుగుతుంది.

ప్రకృతి పరిశీలనలో భాషాదులు పుట్టకముందు నుండి ఆకాశం ఎక్కువ ప్రాధాన్యం కలిగి ఉంది. రాత్రి కాగానే నక్షత్రాలు-చంద్రుడు, వెన్నెల, చీకటి,

పగటిపూట సూర్యుడు-వెలుతురు ఇవన్నీ మొదట ఆశ్చర్యాత్మకాలై తరువాత పరిశీలనాత్మకాలైనాయి. జానపదులు తమకు తోచిన విధంగా వివిధ పొడుపుకథల ద్వారా ఈ ఆకాశాదులను జ్యోతిస్సులను వివరించారు. వాటని వివరించే వస్తువులు నిత్యజీవనోపయోగాలుగా ఉన్నాయి.

మహాభారతంలోని యక్షప్రశ్నలు పొడుపు కథల్లాగే కనపడుతున్నాయి. దానిలో 'ఏది వార్త' అంటే భూమి-పాత్ర, ఆకాశం-మూస, పగలు రాత్రి- కట్టెలు, సూర్యుడు-అగ్ని, ఋతువులు-తెడ్లు, వీటితో కాలం ప్రాణికోటిని వండుతుంది. 'ఇదేవార్త' అంటాడు ధర్మరాజు. ఇది ప్రకృతి యొక్క మూలసూత్రం పొడుపుకథలో చెప్పినట్లుగా ఉంది.

ఇటువంటి ఆకాశాదుల విశేషాలను, నక్షత్రాలను చూసి జానపదులు పరవశించి పోయారు. తమకు నచ్చినరీతిలో పొడుపులు పొడిచారు. వాటిలో కొన్నింటిని చూద్దాం.

'ఇంతింత గుడిగాదు ఈశ్వరుని గుడిగాదు
కంచుగోప్రము గాదు - కదిలించరాదు' (ఆకాశం)

'సెరువంత గొంగడి - నీ యబ్బ గప్పలేదు- నాయబ్బ గప్పలేదు'(ఆకాశం)

'రూకలెంచలేం- చాపచుట్టలేం' (ఆకాశం-నక్షత్రాలు)

'మాయమ్మకు చాపచుట్టరాదు
మా నాన్నకు పైసలెంచరాదు' (ఆకాశం-చంద్రుడు)

'రాజావారి తోటలో రోజాపూలు
చూచేవారేగాని కోసేవారు లేరు' (తోట-ఆకాశం, రోజాలు-నక్షత్రాలు)

'చినతాంబాలం-పెదతాంబాలం
నూకల బువ్వ - నూనెధార' (భూమి-ఆకాశం-చంద్రుడు-వర్షం)



'అంతులేని చెట్టుకు అరవై కొమ్మలు
కొమ్మకు కోటి పూవులు
పూవుకు రెండు కాయలు' (ఆకాశం-చుక్కలు-సూర్యచంద్రులు)

'ఊరి కొక్కటే ముల్లు గట్టె' (సూర్యుడు)

'కిటకిట మంచం - కిటారు మంచం
ఎందరు ఎక్కిన -ఇరగదు మంచం' (భూమి)

'పేలాలు వేయించాను
పెట్టెలో పెట్టాను
పొద్దు పొడిచే వరకు కనిపించలేదు' (నక్షత్రాలు)

'పుట్టెడు సెనిగల్లో ఒకటే ఉసికరాయి' (నక్షత్రాలు-చంద్రుడు)

'మాయింటి పిల్లలను లెక్క బెట్టలేం' (చుక్కలు)

'పగులల్లా పడిన పళ్ళు
రాత్రిపూట పారబోస్తాం' (నక్షత్రాలు)

'ఆకాశాన్ని ఆ చివరి నుండి
ఈ చివరివరకు కప్పివేసే
ఆయుధం ఏది?' (ఇంద్రధనుస్సు)

ఈ విధంగా జన జీవితంలో ఉపయోగించుకునే వస్తువులు, ఆహార పదార్థాలు, సంబంధాలు, ప్రకృతివంటి అన్ని విషయాలు ఈ ఆకాశాదులను వర్ణించడంలో భాగాలైనాయి.

రాశుల విజ్ఞానం పొడుపుకథలో పద్యాల్లో కనపడుతున్నాయి.

కస్తూరి రంగనాయకుని కవి ఆశీర్వదిస్తూ ఈవిధంగా అంటున్నాడు.

'కన్యకు నైదు జంఘలును, కన్యకు నారు కుచంబు లెన్నగా
కన్యకు నాల్గు కన్బొమలు, కన్యకు నేడు విశాల నేత్రముల్
కన్యకు ద్వాదశంబులగు కౌనును గల్గిన పంచలక్షణా
కన్యకు నీకునింక పదిగానలె కస్తురి రంగనాయకా!'

జ్యోతిష విషయ సంబంధ జ్ఞానం అధికంగా ఉన్న పండితుడు చెప్పిన పద్యమిది. భారతీయ జ్యోతిశ్శాస్త్రంలోని రాశుల పేర్ల ఆధారంగా ఈ పద్యరచన జరిగింది.

కన్యారాశినుండి, వరుసగా 1. కన్య 2. తుల, 3. వృశ్చికం, 4. ధనుస్సు, 5. మకరం, 6. కుంభం, 7. మీనం, 8. మేషం, 9. వృషభం, 10. మిథునం, 11. కర్కాటకం, 12. సింహం.

కన్యారాశినుండి ఐదవరాశియైన మకరం వంటి జంఘాలుండి, ఆరవరాశియైన కుంభం వంటి స్తనాలు కలిగి, నాలుగవ రాశియైన ధనుస్సు వంటి కనుబొమలు కల్గి, ఏడవ రాశియైన మీనంవంటి కన్నులు కలిగి, పన్నెండవ రాశియైన సింహం వంటి నడుము కలిగిన, మంచి గుణములు ఐదు కల్గిన కన్యతో నీకు పదవరాశియైన మిథునం కావాలని ఆశీర్వదిస్తూ చెప్పిన పద్యమిది.

జ్యోతిష విషయాలైన రాశినామాదులు తెలియకపోతే ఈ పద్యం అర్థరహితమైన దవుతుంది.

"నక్షత్రము గల చిన్నది
నక్షత్రము చేత బట్టి నక్షత్రప్రభున్
నక్షత్రమునకు రమ్మని
నక్షత్రముపైన వేసి నాథుని పిలిచెన్"



అభిమన్యుడు యుద్ధానికి బయలుదేరుతున్నాడు. అతని భార్యయైన ఉత్తర భర్తకు వీరతిలకం దిద్దడానికి 'భరణి'ని చేతిలో పట్టుకొని అభిమన్యుడు (అభిజిత్తు) ని 'మూల' కు రమ్మని 'హస్త' మేసి పిలిచింది. ఈ విషయం పొడుపుకథలాగానే ఉంది. జ్యోతిర్విజ్ఞానం శూన్యమైతే ఈ విషయం అర్థంకాదు.

'పెద్దవాడు పడచువాడు మామ గూడినా
గ్రుడ్డివాడు నడ్డివాడు మామ గూడినా
వంచనింత లేకుండా వాన వచ్చును'

పెద్దవాడు సూర్యుడు, పడచు(పిన్న)వాడు బుధుడు, గ్రుడ్డివాడు, శుక్రుడు, నడ్డి(గూని)వాడు శని, సూర్య బుధులు, చంద్రుడు ఒకే దగ్గరకు వచ్చినా, శుక్ర శనులు చంద్రుడు ఒకే దగ్గర కూడినా వర్షం వస్తుంది.

అయితే వర్షాకాలంలో ఈ రకమైన సంయోగంవల్ల వర్షం తప్పకుండా వస్తుంది. ఇది జానపదుల విజ్ఞానానికి నిదర్శనం.

'శివరాత్రికి శివ శివ అంటూ పోతుంది' (చలి)

'ఉడిగి ఉత్తరం జేరుతుంది' (మబ్బు)

చంద్రపరివేషం వల్ల వర్షం కురుస్తుందని జానపదులకు సుపరిచితం.

"దూరం గుడి కడ్తే దగ్గరవాన
దగ్గర గుడి కడ్తే దూరం వాన" (చంద్ర పరివేషం)

'పున్నమికి పూత- అమావాస్యకు ఆరగింపు' (తేనె పట్టు)

ఈ విధమైన జ్యోతిషాంశ విశేషాలతోపాటు ప్రకృతిలోని వివిధ విషయాలు జ్యోతిష విషయాలతో వివరించడం జానపదులకు కొట్టిన పిండి.

సంవత్సరాల పేర్లు బాగా తెలిసినవారు ఎదుటివాడిని తిట్టడం పొడుపు కథలాగానే ఉంటుంది.

'వాడొట్టి ఇరవై ఐదు- ఇరవై ఆరు' సంవత్సరాల పేర్లలో ప్రభవతో మొదలుపెడితే 25వది ఖర - 26వది నందన. వాడు (ఖర నందనుడు) అని తిట్టడం కనపడుతుంది.

చంద్రుని గూర్చి గూడా విశేష జ్ఞానం కనపడుతుంది.

"చంద్రగిరిలో చెట్టు పుట్టె
తిరుపతిలో తీగనారె
ఆకాశాన కాయగాసె
పర్వతాన పండుపండె'

చంద్రుడు జన్మిస్తాడు. ఆ వెన్నెల తీగ ఎక్కడికెక్కడికో పోతుంది.

అది ఆకాశంలో కాయలాగా ఉండి అస్తమయ కాలానికి అస్త్రాద్రిపై పండువలె అవుతుంది. పండురూపం పొందిన తరువాత అందరేమవుతారో చంద్రుడు అదే అవుతాడు.

'నేను ముందే ఉంటాను
కానీ నా గూర్చి మీరు తెలుసుకోలేరు
నన్ను చూడలేరు!' (భవిషత్తు)

అంటూ భవిష్యత్తును తెలుసుకునే విధానం ఎవరికీ సాధ్యం కాదని కనుక్కోవడానికి ఎంతో విజ్ఞానం అవసరం అవుతుందని ఈ పొడుపు కథ తెలియజేస్తుంది.



ఈ విధంగా వివిధ జ్యోతిస్సులకు సంబంధించిన స్వరూప స్వభావాదులను పరిశీలించగల్గిన జానపదుడు ఫలితం మాత్రం పొడుపు కథలలో వివరించలేదు. ఎదురుగా ఉన్న వస్తువురూపం మార్చి చెప్పడం దీనిలో ప్రత్యేకతగాని, ఊహించి, శాస్త్రంద్వారా చెప్పే ఫలితాంశాలు దీనికి అందవు. అందుకే పొడుపు కథలలో ఫలితాంశాలు జ్యోతిష సంబంధంగా లేవు.

మానవునికి ఆలోచనను అందించిందే జ్యోతిషం. అనునిత్యం పరిశీలన పరిశోధనలవల్ల ఈ జ్యోతిషంనుండే వేరు వేరు విధాలైన ఆలోచనలు ఆవిర్భవించి ప్రత్యేక శాస్త్రాలుగా రూపుదిద్దుకొని అధ్యయనం చేయబడుతున్నాయి. కాంతి ఎక్కడైతే ఉంటుందో అక్కడ నూతనమైన ఆవిష్కరణలు జరుగుతూనే ఉంటాయి. కాంతి జ్ఞానానికి సంకేతం. జానపదులు నిరంతరం ప్రకృతితో అనుబంధం ఏర్పరచుకుని బ్రతికేవారు. వారి ఆలోచనలన్నీ ప్రకృతి చుట్టూ, ఆ ప్రకృతిని ఉపయోగించుకొనే విధానాలవైపు, ప్రకృతి వైపరిత్యాలనుండి కాపాడుకునే వైపు సాగుతూ ఉంటాయి. అందుకే అనేక రకాల సామెతలు, పొడుపుకథలు, నమ్మకాలు జ్యోతిర్విజ్ఞానపరంగా ఏర్పడినాయి. ఒక సామెత ఏర్పడడానికే కొన్ని వందల సంవత్సరాలవరకు పట్టవచ్చు ననేది జానపద విజ్ఞానులు చెప్పే అంశం. అటువంటి సామెతలు ఇన్ని జ్యోతిర్విజ్ఞాన సంబంధమైనవి ఏర్పడడానికి మరెన్నో వందల సంవత్సరాలు పట్టి ఉండాలి. జానపదుల నుండి జ్ఞానపథుల వరకు జ్యోతిష భావనలు, వైజ్ఞానిక సంపద అందరి లోనూ నిండి ఉందనడానికి ఈ సామెతలు, పొడుపుకథలు, నమ్మకాలే నిదర్శనం.

జానపద సాహిత్యంలో భాగమైన కథలు, గేయాలు తదితర అంశాలలోనూ ఇటువంటి జ్యోతిష భావనలను వెలికి తీసే అవకాశం ఉంది. ఇంకా జానపదులకు సంబంధించిన వైద్య విధానాలను, సోదె వంటి భవిష్యసూచక విధానాలను పరిశీలించి, పరిశోధించవలసిన అవసరం ఉంది. ఇటువంటి పరిశోధనలవల్ల జానపదుల జ్యోతిర్విజ్ఞాన స్వరూపాన్ని పరిపూర్ణంగా అర్థం చేసుకొని మన ప్రాచీన వైజ్ఞానిక ధోరణిని గమనించి భవిష్యత్తుకు సుమార్గాలను ఏర్పాటు చేసుకోవచ్చు.